

# విషయానుక్రమణిక

## ఆక్టోబరు 1953



త్రివర్ణ చిత్రము : రతీమన్మథులు—మొక్కపాటి కృష్ణమూర్తిగారు.



# "నాకు తెలుసును... లక్స్ టాయిలెట్ సబ్బు మీ చర్మమును ఇంక మనోహరముగాచేయును"

అని టి. ఆర్. రాజకుమారి చెప్పుచున్నది



"శుద్ధమైన ఈ తెల్లటి సబ్బు నా చర్మముమీద వదిలిపెట్టు సువాసనంటె నాకు మిక్కిలి ఇష్టము." అని టి. ఆర్. రాజకుమారి చెప్పుచున్నది. ఆమె ఇంకా ఇలాగున చెప్పుచున్నది: "మనోహరమైన చర్మసౌందర్యమునకు నావలె చేయండి. లక్స్ టాయిలెట్ సబ్బుతో మీ చర్మమునకు ప్రతిదిన సంరక్షణను ఇవ్వండి."




## లక్స టాయిలెట్ సబ్బు

సినీమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు

# ఆంధ్రుల చరిత్ర ఘట్టములు



శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

ప్రాచీనకాలమునుండియు భరతఖండమున పేరు ప్రఖ్యాతులు వహించిన జాతులలో నాంధ్రులొకరు. క్రీస్తునకుపూర్వ మేడెనిమిది శతాబ్దములప్పుడు విరచింపబడినదని పాశ్చాత్య విద్వాంసులు నిర్ణయించియుండు నైతరేయ బ్రాహ్మణమునందాంధ్రుల ప్రస్తావము గలదు. విశ్వామిత్ర ఋషి తనయాజ్ఞనుల్లంఘించినందుకు కుపితుడై తన పుత్రులలో నేబదుండ్రను ఆర్యావర్తముల వెలుపట నివసించునట్లు శపించెననియు, నట్లు శప్తులైన విశ్వామిత్ర పుత్రసంతతివారే యాంధ్రపుండ్ర శబరపుళింద మూతిబాదులనియు వారే బహుళముగ దస్యులైరనియు నందుకలదు; ఐతరేయ బ్రాహ్మణకాలమున పై జెప్పబడిన యాంధ్రాదిప్రజలెచట నివసించుచుండిరో తెలియదు; కాని వారు శబరపుళిందాదులతో చెప్పబడుటవల్లను, తరువాతి చారిత్రికయుగమున శబరపుళిందాదులు వింధ్యప్రాంతదేశములందు నివసించుచుండినందువల్లను వారితోపాటు ఆంధ్రులు గూడ వింధ్యప్రాంత వాస్తవ్యులగు ననార్యప్రజలనియు నాధునిక పరిశోధకులభిప్రాయపడుచున్నారు. పురాణము లాంధ్రుల వృత్తాంతమును మఱియొకతీరున వర్ణించుచున్నవి. తుషారులు (తుఖారులు) ఆంధ్రులు, పుండ్రులు, పల్లవులు, ములకలు మున్నగువారు హిమాచలమునబుట్టి పశ్చిమాభిముఖముగ ప్రవహించు మూడునదులలో నొకటియగు చంక్షు లేక చక్షునది తటమున నివసించుచుండిరని మత్స్యాది పురాణములందు కలదు. ఈయంక్షు లేక చక్షు అను నది యిప్పుడు ఆక్ససు నామమున బరగుచున్నది. ఇది హిమాలయమున నుత్పత్తియై పారశీకదేశ పూర్వసీమలనుండి పశ్చిమోత్తరముఖముగ ప్రవహించి కాస్పియను సముద్రమున బడుచున్నది. అంక్షు లేక చక్షునదీతీర ప్రజలలో నొకరగు తుఖారులు క్రీస్తుశక ప్రారంభ శతాబ్దములలో చీనా పారశీక సరిహద్దులలో నుండిరనియు, వారాడుచుండిన దార్య భాషాకుటుంబమునకు చెందినభాషయనియు నిటీవలి పరిశోధనల వలన నిశ్చయమైనది. పురాణముల సాక్ష్యము విశ్వాసపాత్రము కానేని ఆంధ్రులు మొదట పారశీక దేశ పూర్వభాగమున నివసించుచుండిరనియు తరువాత నేకారణముననో యచటనుండి బయలువెడలి హిందూస్థానమునకు వలసవచ్చి దక్షిణాపథమున స్థిరనివాసములేర్పరచుకొనిరనియు జెప్పవలసియున్నది.

ఆంధ్రులార్యులా యనార్యులా అను విషయమనేక చరిత్ర పరిశోధకులను కలవర పెట్టుచున్నది. ఐతరేయ బ్రాహ్మణము నాధారపఱచుకొని పెక్కండ్రు పరిశోధకులు ఆంధ్రు లనార్యులనియు ద్రావిడజాతికి సంబంధించినవారనియు చెప్పుదురు. దీనికి విరుద్ధముగ కొందఱు చరిత్రకారు లాంధ్రులార్యులని వాదింతురు. ఇందేది సత్యాత్మకమో నిశ్చయించిచెప్పుటకు వీలుకాదు. ఏలనగా ప్రపంచమునందెచ్చటను అన్య సంపర్కములేని స్వచ్ఛజాతి కానరాదు. పరిశీలించి చూచిన ప్రతిజాతియందును సంకరమెంతేనియు కాన్పింపకపోదు. కావున నాంధ్రులును అన్యుల వలె మిశ్రజాతి సంభవులని యెంచుట సమంజసము.

జాతివిషయమట్లున్నను భాష సంకీర్ణమైనదని చెప్పకతప్పదు. ప్రాచీనాంధ్రులేభాష మాట్లాడువారో తెలియదు. సాతవాహనయుగమున నం దాంధ్ర సామ్రాజ్యమున సంస్కృతి ప్రాకృతి పైశాచి దేశి యను నాలుగుభాషలు వాడుకయందుండినట్లు సోమదేవకృత కథాసరిత్సాగరమున గలదు. ఇందు ప్రాకృతము రాజభాషయైనట్లు తోచుచున్నది. ఏలనగా సాతవాహనుడను నతని యంతఃపురనారీజనము ప్రాకృతము మాటలాడుచుండినట్లందు సూచింపబడినది. పైశాచి వింధ్యాటవుల నివసించు పిశాచజనులకు తప్ప యితరులకు దుర్గ్రాహ్యమనియు నందే ప్రవాసమునందున్న గుణాఢ్యుడను బృహత్కథను రచించెననియు వివరింపబడినది. దేశి యెవ్వరిభాషయో

తెలియదు; కానియది సాతవాహనసామ్రాజ్యమందలి జనానీకమున వాడుకయందుండిన భాషయని మన మూహింపవచ్చును. ప్రాచీన తమిళవాఙ్మయము నాధారపఱచుకొని పైచేర్కొనిన దేశి స్వరూపము నొక్కింత కనుగొనవచ్చును. తొల్కాప్పియము నందు కొడుందమిళమును గూర్చియు కొడుందమిళ నాడునుగూర్చియు గొంత వివరణకలదు. కొడుం దమిళు సెందమిళుకంటె భిన్నమైనది. సెందమిళు స్వచ్ఛమైనది; కొడుందమిళు దాని భ్రష్టరూపము. తమిళనాడు పరిసరములనుండు కొన్ని సీమలలో నీకొడుందమిళు వాడుకయందుండెను. ఇందుముఖ్య ముగ తమిళనాడున కుత్తరమందుండిన అరవనాడు అరవావసెంతలై, పున్నాడు అనునవి ముఖ్యముగ గమ నింపదగినవి. దక్షిణ ఆర్కాడు ఉత్తర ఆర్కాడు జిల్లాలు చేరిన దేశ మరువనాడనబడుచుండెను. చెంగ ల్పట్టును దానికుత్తరమందలి తీరభూమియు నరువావసెం తలైయనబరగెను; టాలమియను యవనభూగోళ శాస్త్రజ్ఞు డరువర్నాయను జాతివారు చోళమండల మునకుత్తరమున కృష్ణానదికిదక్షిణమునను౦డు తీర దేశమున నివసించుచుండిరని చెప్పియున్నాడు. నెల్లూరు మండలములోని కందుకూరు తాలూకాకు జెందిన మాలెకొండపై చెక్కియుండునొక ప్రాచీన ప్రాకృతశాసనమున నరువాలరు ప్రస్తావముగలదు. కావున కృష్ణానది పర్యంతమును టాలమీచెప్పినట్లు అరువర్నాయనువారు నివసించుచుండిరనుట తెల్లము. పున్నాడు మైసూరునందలి దక్షిణభాగమునకు ప్రాచీన నామము. పాశ్చాత్య గంగశాసనములందీరాష్ట్రము పేర్కొనబడెనది. ఇందువలన కృష్ణానదికి దక్షిణమం దును మైసూరు ప్రాంతమునను తొలకాప్పియరుకాల మున కొడుందమిళు వాడుకయందుండెనని తేలు చున్నది. ఈప్రాంతములందు తమిళభాష స్వచ్ఛత చెడి "కొడుందమిళు" నేలమాగెనో కనుగొందము. దీనికరువలరాకయే ప్రధాన కారణము. అరువలు దమిళులు గారు. దక్షిణాపథమునకును దమిళభూమి కిని మధ్యనివసించుచుండిన నాగజాతి జనులని తమిళ పరిశోధకులు చెప్పెదరు. కాని యరువాలరాంధ్రు లొకప్పుడు వారితో గలసిమెలసియుండిన మఱియొక తెగ వారలో యని తలపుటకు నవకాశము. వీలనగా మహారథులు మహాతలవరులు నున్నను నాగప్రాకృతులకు సాతవాహనరాజులతో బంధుత్వము గలసియుండెనని శాసనములవల్ల దెలియుచున్నది. మఱియు నరువా లరు మాట్లాడుచుండిన కొడుందమిళు సంస్కృత ప్రాకృతపదములు సెందమిళున చేరుటవలన నేర్పడినది.

కావున నరువాలరు సంస్కృతమునుగాని ప్రాయశః సాతవాహన రాజకుటుంబమువలె ప్రాకృతమునుగాని భాషించుచుండి యుండవలెను. క్రమ క్రమముగ నాంధ్రులరొత్తిడి యధికమగుటవలన కొడుందమిళు రూపము మఱియు భ్రష్టమయి నూతనభాషగ పరిణామ మందెను. ఈ నూతనభాష స్వరూపముగూడనన్ని యెడల నొక్క తీరున నుండలేదు. ఆయాప్రాంతము లందు వసించుచుండిన ఆంధ్ర ద్రావిడజనసంఖ్యను బట్టి దానిస్వరూపము భిన్నమైయుండెను. దక్కను పూర్వార్థమున ననగా గోదావరి కృష్ణా పినాకినీ నదీ తీరమందలి సారవంతమైన దేశమునందాంధ్రులసంఖ్య యధికతరము. ఇచ్చటిభాష తన ద్రావిడత్వమును సంపూర్ణముగ గోలుపోకపోయినను సంస్కృత ప్రా కృత పదభూయిష్ఠమై యాభాషల సాంప్రదాయము లను ధారాళముగ గ్రహించెను. ఇట్లాంధ్ర ద్రావిడ భాషల సంయోగమువలన నేర్పడిన క్రొత్తభాషయే ప్రాతతెనుగు. దక్కను పశ్చిమార్థమున పూర్వార్థ మునందువలె నాంధ్ర ద్రావిడభాషల కూటమివలన నూతనభాష యేర్పడినను నాంధ్రులకంటె ద్రావిడుల సంఖ్య యధికమగుటచే దానిస్వరూపము భిన్నమా యెను. దీనికి హళె కన్నడమని పేరువచ్చినది. హళెకన్నడమునకు దమిళముతో చాలా సన్నిహిత బాంధవ్యముగలదు. అది తన కొడుందమిళ స్వరూప మును చాలాకాలమువఱకు గోల్పోలేదు. ఆంధ్ర ద్రావిడప్రజల సంయోగమువలన నాంధ్రజాతిమఱియు సంకీర్ణమై యాస్తుని కాంధ్రజనానీకమై పరిణామ మందినది. ప్రాకృత ద్రావిడములకు భిన్నమైన తెనుగు వారి దైనందినభాషయైనది.

## 2

ఆంధ్రుల పురాతన చరిత్రముదెల్పు నాధార ములు లేవు. బౌద్ధగ్రంథములనుబట్టి చూడగా వారు బౌద్ధయుగమున కృష్ణా గోదావరుల నడుమ నివసించు చుండిరని తెలియవచ్చుచున్నది. ఆంధ్రజాతికిచెందిన యశ్వకములకలను రెండుతెగల జనులకు బోధను ప్రతి ష్ఠానగరములు ముఖ్యస్థానములుగ పేర్కొనబడినవి. చంద్రగుప్తమౌర్యుడు మౌర్యసామ్రాజ్యమున కస్తిభా రము వేయునప్పటికి ఆంధ్రులు దక్షిణాపథమున కధి పతులైయుండిరి. వారిరాజ్యమందనేక గ్రామము లును, కోటలచే సంరక్షితములైన ముప్పది పట్టణము లును గలవని వారిరాజు కొలువున లక్షపదాతులును రెండువేల గుఱ్ఱములును వేయి యేనుగులును గలవ

నియు మెగాస్థినీసు వ్రాసియున్నాడు. చంద్రగుప్తుని కాలమున మౌర్యులకును నాంధ్రులకును పరస్పరమెట్టి రాజకీయసంబంధముండెనో తెలియదు; చంద్రగుప్తుడు వారిని జయించెనని తలచుట కవకాశము లేదు; కాని యశోకుని కాలమునందాంధ్రులు మౌర్యుల కరిగాపులైయుండిరి. అశోకుడు జయించినది కళింగదేశమొక్కటియే. కావున చంద్రగుప్తుని యనంతరము మౌర్యసామ్రాజ్యము పీఠము నధిష్ఠించిన బిందుసారు డాంధ్రులనుజయించి వశవర్తులను గావించుకొనెనని చరిత్ర పరిశోధకులనేకులభిప్రాయపడుచున్నారు. సత్యము గావచ్చును. కాని యాంధ్రులు చిరకాలము పారతంత్ర్య మనుభవింపలేదు: అశోకుని యనంతరము మౌర్యసామ్రాజ్యము విచ్ఛిన్నమైనది. అశోకునితరువాతి మౌర్యచక్రవర్తుల సత్త్వహీనత నాధారపఱచుకొని సాతవాహనవంశజుడగు శ్రీముఖుని యాధిపత్యముక్రింద నాంధ్రులు తిరుగుబాటుచేసి గతించిన నిజస్వాతంత్ర్యమును బునఃప్రతిష్ఠయొనర్పుటయేకాక దక్షిణభారతమందు మౌర్యుల యేలుబడిక్రిందనుండిన రాష్ట్రములన్నిటి నాక్రమించుకొనిరి. మఱియు కాణ్వవంశజులను గూలద్రోసి మగధము నాక్రమించి నిఖిలభారత సామ్రాజ్యమునకును మూలస్థానమైన పాటలీపుత్రమును కైవసము జేసికొనిరి.

శ్రీముఖుడును నతని వంశజులును దక్షిణాపథమును నాలుగు శతాబ్దములకు మించిన కాలము పాలించిరి. వీరిపాలనను వర్ణించుటకిది సమయము గాదు; కాని వారికాలమున దక్షిణాపథమున సంభవించిన ముఖ్యాంశములను సంగ్రహముగా నిచట దెల్పుట యుక్తము. ఇందు ప్రథమమున చేర్కొనదగినది వారొనర్చిన దేశసేవ, సాతవాహన యుగమున నుత్తరాపథమున శకయవనాది విజాతీయులు ప్రబలి దేశమున చాలా భాగము నాక్రమించుకొని సురాష్ట్ర మాళవ భూములను జయించి తుదకు దక్షిణదేశముపై నెత్తివచ్చి యపరాంతమును సైతము కైవసము గావించుకొనిరి. కాథియవాడు క్షహరాటవంశజులగు శకనృపాలకులకాటపట్టాయెను. మఱియు వారు వైదికధర్మమును సరకుసేయక వర్ణాశ్రమములను పాడుసేయగడగిరి. ఈ కారణములవలన బ్రాహ్మణులకు సాతవాహనులకు వారితో వైరము గలిగెను. క్రీస్తుశక ప్రారంభకాలమున నాంధ్రసామ్రాజ్యము నేలుచుండిన గౌతమీపుత్ర శ్రీ శాతకర్ణి యనురాజు శకరాజ్యముపై నెత్తిపోయి క్షహరాటవంశమును నిర్మూలముగావించి వారి యేలుబడిక్రింద రాష్ట్రమునంతటి నాంధ్రసామ్రాజ్యమున గలుపుకొనెను. దేవకీపుత్రుడగు వాసుదేవుడు దానవనికాయమునువలె దనకుమారుడగు గౌతమీపుత్రుడు శకయవనాది విమతులను నాశముగావించి సనాతనధర్మము నుద్ధరించెనని బాలశ్రీ యతని జాతిదేశసేవలను శిలాక్షరముల బ్రకటించినది. గౌతమీపుత్రుని యనంతరము రాజ్యభారము వహించిన సాతవాహన నృపాలురు సత్త్వవంతులు గాకపోవుటచే శకులు మరల తలయెత్తి చాష్టనుని నాయకత్వముక్రింద నాంధ్రులను బరాజితులను గావించి మాళవదేశమునందుజ్జయిని రాజధానిగ నొకనూతన రాజ్యమును స్థాపించిరి. కాని యజ్ఞశ్రీ శాతకర్ణి యనురాజు వారిని ప్రతిఘటించి యాంధ్రస్వాతంత్ర్యమును గాపాడెను. ఇచట చేర్కొనదగిన మఱియొక ముఖ్యాంశము బౌద్ధమతవ్యాప్తి. సాతవాహన యుగమున బౌద్ధమతము దక్షిణాపథమంతటను తామరతంపరగ వర్ధిల్లినది. బౌద్ధమత గ్రంథములందు గౌతమబుద్ధుడే యాంధ్రదేశమునకు వచ్చెనని చెప్పియున్నది. కాని యిది విశ్వాసపాత్రము గాదు. ఆంధ్రదేశమున బౌద్ధధర్మము నుపదేశించుట ప్రారంభించినది అశోకచక్రవర్తికాలమునుండియే. అతడు మహాదేవభిక్షుని ఆంధ్రులకు బౌద్ధమతము నుపదేశించుట కంపెను. అతడు కృష్ణాతీరమందలి ధాన్యకటకమున నెలకొని బౌద్ధమత ప్రచారమునకు బ్రారంభించెను. ఇతని ప్రచారమునకు ఫలితము బౌద్ధమతము దేశమంతటను వ్యాపించెను; జనసామాన్యము బౌద్ధధర్మము నంగీకరించెను. విద్యావంతులనేకులు శ్రమణదీక్ష గొని ధర్మోపదేశమే తమ జీవితమునకు పరమావధియని తలచిరి. ఆర్యదేవుడు నాగార్జునుడు మున్నగునాంధ్రులెందరో బౌద్ధమత తత్త్వమును బరిశోధించి నూతన గ్రంథముల రచించి క్రొత్తమార్గములనుజూపి బౌద్ధప్రపంచమున ప్రఖ్యాతివడసిరి.

బౌద్ధమత వ్యాప్తితోగూడ వాస్తునిర్మాణాది కళలభివృద్ధినందినవి. ఆద్యమునుండియు స్తూపార్చన బౌద్ధమతమునకు ప్రధానాంగమైయుండెను. మంటితోనో ఇటికతోనో, రాతితోనో కట్టిన అర్ధగోళాకారముగనుండు సమాధివంటి ఘననిర్మాణమునకే స్తూపమని పేరు. ఇందు బుద్ధునియొక్కయు నతని ప్రధాన శిష్యాదులయొక్కయు దంతకేశాస్థ్యాది దేహావశిష్టములు స్థాపితములైయుండిన కతమునవవి బౌద్ధులకర్చనీయములాయెను. సాతవాహన యుగమునం దాంధ్రదేశమందెల్లయెడలను పెద్దవియు చిన్నవియు స్తూపములు వందలకొలదిగ నిర్మింపబడెను. వాని శిథిలములు

దేశమందువలె నచటి రాజులును ధనసంపన్నులును శివవిష్ణ్వాది హిందూదేవతల కాయతనములు బుద్ధ భగవానునికి స్తూపచైత్యాదులును నెలకొల్పినారు. వేద వేదాంగ వేత్తలైన బ్రాహ్మణు లచట వేదోక్తకర్మల ననుష్ఠించుచు యజ్ఞాది కార్యములు నడిపువారు ఇట్లు సాతవాహనయుగము విశాలభారత నిర్మాణమునకు సహకారి యాయెను.

## 3

క్రీ. శ. మూడవ శతాబ్ద పూర్వార్ధమున సాతవాహన సామ్రాజ్యము విచ్ఛిన్నమైనది; అంతటితో నాంధ్ర జనపదము చీలికలై రాజకీయైక్యము గోల్పడినది. ఇచట మొదట పేర్కొనదగినది కర్ణాటోత్పత్తి. ప్రాదేశిక కన్నడభాషలు రూపొందినప్పటి నుండియు పూర్వ పశ్చిమాంధ్రులలో భేదము లేర్పడినవి. క్రమక్రమముగ నీ భేదములు ప్రబలి పెద్ద జాతివిభజనకు కారణభూతములైనవి. పశ్చిమ ప్రాంతముల వారు పూర్వ సీమల వారినుండి వేర్పడి కర్ణాటకు లనబరగిరి. పూర్వ సీమలవారి కాంధ్రనామము రూఢిగాయెను; కాలక్రమమున వీరికి తెలుగువారనియు వారి దేశమునకు తెలుగు దేశమనియు పేరులు కల్గినవి. ఆంధ్రులకు తెలుగువారను క్రొత్త పేరెల వచ్చెనో నిశ్చయించి చెప్పుటకు వీలు లేదు. జాతియు భాషయు నొక్కటియే యైనను రాజకీయైక్యత లేక యాంధ్రులు పెక్కు స్వతంత్ర రాజ్యముల పాలనకు లోబడి విభక్తులై యుండిరి. సాతవాహన సామ్రాజ్యమంతరించిన పిమ్మట తీరాంధ్రదేశమున కృష్ణానది యుభయతటములను ఇక్ష్వాకువంశజులు పాలింపగడగిరి. వీరి పిమ్మట బృహత్పలాయన శాలంకాయన రాజులు కృష్ణాతీరమును వేంగి దేశముతో గూడ పరిపాలించిరి; మాఠరవంశజులు కళింగము నేలుచుండిరి; తరువాత విష్ణుకుండినులు వేంగిమండలమున కధిపతులై యుత్తరమున కళింగము సరిహద్దులనుండి దక్షిణమున కృష్ణానదివఱకును గల రాష్ట్రమున కధిపతులైరి. ఇక్ష్వాకులు గతించిన పిమ్మట పల్లవులు దేశము నాక్రమించి కృష్ణా తుంగభద్రలకు దక్షిణమందుండు నాంధ్రరాష్ట్రము నంతటిని స్వాధీనపఱచుకొని ప్రభుత్వము సల్పగడగిరి. తెలింగాణ చరిత్రమును దెల్పు సాధనము లెవ్వియు నింకను బయల్పడలేదు. అప్పటి రాజు లనవరత మొండొరులతో యుద్ధము సేయుచున్నను ఆంధ్రదేశము నంతటిని ఏకఛత్రాధిపత్యము క్రిందికి దేవలయునని యెవ్వరును ప్రయత్న మొనర్చినట్లగపడదు.

చాళుక్యాగమనముతో నాంధ్రదేశ చరిత్రయం దొక నూతనయుగము ప్రారంభమగుచున్నది. చాళుక్యోత్పత్తిని గూర్చి చరిత్ర పరిశోధకులు భిన్నాభిప్రాయములను వెలిబుచ్చియున్నారు; వారి వివాదములతో మన కిప్పుడు పనిలేదు. చాళుక్యుల ప్రస్తావన మొట్టమొదట ఇక్ష్వాకుల శాసనములందు కానవచ్చుచున్నది. ఇక్ష్వాకుల యాధిపత్యముక్రింద రాయలసీమలోని జమ్మలమడుగు ప్రాంతమున హిరణ్యకులను తెగవారు నివసించుచుండిరి. వీరి సేనాధిపతి స్కంద చలికి రెమ్మణకుడని యిక్ష్వాకుల శాసనమందు కలదు; స్కందచలికి రెమ్మణకుడనగా స్కందచలికి మనుమడో కుమారుడో వంశీకుడో యగు రెమ్మణకుడని యర్థము; ఇందువలన క్రీ. శ. మూడవ శతాబ్దమున చాళుక్య వంశజులు కొందఱు జమ్మలమడుగు ప్రాంతమున నుండిరని తెల్లమగుచున్నది. తరువాత వీరు పశ్చిమోత్తరాభిముఖులై యుత్తర కర్ణాటకమునకు వలస దరలిపోయి విజాపుర మండలమున స్థిరనివాసము లేర్పఱచుకొన్నట్లున్నది. క్రీ. శ. ౬ వ శతాబ్ది మధ్యమున పులకేశి వల్లభుడను చాళుక్యప్రభువు విజాపురమండలములోని బాదామిని సాధించి యచటి కొండపై ప్రబలమైన దుర్గమును గట్టించి దానిని రాజధానిగ జేసికొనెను. పులకేశికి కుమారుడైన కీర్తివర్మ పరిసర ప్రాంత జనులను జయించి తన యేలుబడిక్రింది రాజ్యమును పెంపొందించెను. ఇతనిచే పరాజితులైన ప్రజలలో నలవ కొర్యకదంబులుండిరని చాళుక్య శాసనములందు చెప్పియున్నది. నలులనువారు నలవాడి విషయమం దుండిరి. ఈ నలవాడి విషయమే కర్నూలుమండల పూర్వసీమయం దుండిన నెలవాడి యని పరిశోధకులు కొందఱు అభిప్రాయపడుచున్నారు. మౌర్యకదంబులు పశ్చిమసముద్రతీర ప్రాంతదేశములను పాలించుచుండిరి. ఈ విజయముల వలన కీర్తివర్మ యాంధ్ర కర్ణాట దేశ భాగములను జయించి తన యధికారము క్రిందికి దెచ్చుకొనెనని విదితమగుచున్నది. కీర్తివర్మకు నలుగు రైదుగురు పుత్రు లుండిరి. పెద్దవాడగు రెండవ పులకేశి శూరాగ్రేసరుడు, జేత. ఇతడు దక్షిణాపథమందలి సకల రాజన్యులను జయించి పూర్వ సాతవాహన భూపాలుగవలె దక్షిణాపథాధిపతియని వాసికెక్కెను. ఇతని పాలనక్రింద సకలాంధ్ర భూమండలమే కాక కర్ణాటావని యితని యొక్క యేలుబడిక్రిందికి వచ్చినది. కాని యిట్లు చేకూడిన రాజ్యైక్యము చిరకాలము వర్థిల్లలేదు. తా జయించినట్టి యాంధ్రదేశమునుండి రెండవ పుల

హ్యమైనను దన్మూలమునఁ బ్రాఁతెలుగు స్వరూపము కొంతకుఁగొంత తెలియవచ్చుచున్నది.

చాళుక్యాగమనము ఆంధ్రభాషాభ్యుదయమునకు మొట్టమొదట ప్రతిబంధకమైనది. చాళుక్యులు కర్ణాటకులు; వారి భాష కర్ణాటము; తీరాంధ్ర భూమియే కాక కొంచెమించుమించుగ సకలాంధ్రావనియు జాళుక్యుల యేలుబడి క్రిందికి వచ్చుటవలన ప్రాఁదెలుగునకు కర్ణాటభాషాసంపర్కము దప్పినది కాదు. కన్నడ పదములు పలుకుబడులు లోకోక్తులు బిరుదాంకములు ద్రవ్వితండముగ దెలుఁగున బ్రవేశించినవి. తీరాంధ్రరాయలసీమలలో గొన్ని స్థలములందు వప్ప శాసనములు గన్నడమున నె ప్రకటింపబడుచుండెడివి. రాజులును సామంతులును గన్నడమునే ఆదరించుటవలన నది నాగరకభాషయై వర్ధిల్లినది. ప్రాఁదెలుఁగు జనసామాన్యమున వాడుకయందుండినను విద్యావంతుల దృక్పథమున కెక్కదాయె; కాని రాష్ట్రకూట సామ్రాజ్యస్థాపనతో భాషాపరిస్థితులు మారెను. రాష్ట్రకూటపూర్వచాళుక్య వైరమువలన కర్ణాటాంధ్ర మైత్రి చెడెను; రాష్ట్రకూటులు పూర్వచాళుక్యులను చంపెచాళుక్యులనియు నాంధ్రచాళుక్యులనియు బిలువసాగిరి; పూర్వచాళుక్యులు రాష్ట్రకూటులను కర్ణాటకులని నిరసింపఁగడఁగిరి. ఇందుమూలమున పూర్వచాళుక్యులు గర్ణాటభాష యును దెలుఁగు నాదరింప నారంభించిరి. ఈ విషయమె నన్నెచోడుని కుమారసంభవములోని

'మునుమార్గ కవితలోకం
బున వలయఁగ దేశికవిత బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయం
బున జన చాళుక్యరాజు మొదలుగ పలువుర్'

పద్యమున సూచింపబడియున్నది. ప్రాచీనమున కవిత్వము బుట్టించి చాళుక్యరాజు మున్నగువారు తెనుఁగు నాంధ్రమున బాదుకొల్పిరని యిందువలన దెల్లమగుచున్నది. కవిత్వము బుట్టించి తెనుఁగు నంధ్రవిషయంబున నిలిపిన చాళుక్యరాజెవ్వరో యనునది పట్టుకొనుటకు విద్వాంసులు ప్రయత్నము చేసియున్నారు. అతఁ డెవ్వడైనను క్రీ. శ. 848—892 ల మధ్య వేంగిని పాలించిన గుణగ విజయాదిత్యుఁడో లేక తత్పూర్వుఁడో కావలయునుగాని తరువాతివాఁడు మాత్రము కాఁజాలఁడు. ఏలనఁగా తెలుఁగు పద్యరచన యప్పటికె పరిపూర్ణ మందియుండెనని యతని శాసనములు రుజువు చేయుచున్నవి. పూర్వచాళుక్యరాష్ట్రకూటవైరము తెలుఁగుకవిత్వోత్పత్తికి కారణమైనను, కన్నడకవిత్వము దానికి మేలుబంతియైనది. తెనుఁగు కన్నడ ఛందశ్శాస్త్రముల నొండొంటితో బోల్చిచూచిన నిది తెల్లముగాగలదు. తెనుఁగున కవిత్వము బుట్టినను కావ్యరచన యింకను ప్రారంభము గాలేదు. ఈ కారణముననే యప్పుడాంధ్రదేశమున కావ్యరచనకు గడఁగిన పొన్న సంపాదికవులు కన్నడమున కావ్యముల విరచించిరి. ఈ కాలమందలి తెనుఁగుకవిత్వమంతయు శాసనములందణఁగియున్నది.

(3) క్రీ. శ. ౯౭౩ మొదలు ౧౦౭౬ వఱకును పూర్వ చాళుక్య చరిత్రమున సంధియుగమని చెప్పవచ్చును. ఈ కాలమున నడచిన ప్రధాన చరిత్రాంశము చోళపాశ్చాత్య చాళుక్య ద్వంద్వయుద్ధము. క్రీ. శ. ౯౭౩ సంవత్సరమున రాష్ట్రకూటుల సామ్రాజ్యము కూలిపోయినది. పాశ్చాత్య చాళుక్య సత్యాశ్రయుని వంశమునకు ఇమ్మడి తైలపదేవుఁడు కర్ణాటక సింహాసనము నాక్రమించుకొనెను. ఆంధ్రదేశమున తెలింగాణమును రాయలసీమలో జాలభాగమును నతని యేలుబడికి లోనైయుండినవి. ఆ సమయముననే ద్రావిడదేశమున చోళులు విజృంభించి సమస్త ద్రావిడభూమిని దమ యాధిపత్యము క్రిందికి దెచ్చుకొని యాంధ్రకర్ణాట దేశములపై దమ సార్వభౌమత్వము నెలకొల్పుటకు కుతూహలించుచుండిరి. ఆంధ్రదేశమునకు గన్నాకువంటిది వేంగీమండలము; కావున వేంగిని కబళించుటకై కర్ణాటకులును మున్నొకప్పుడు చోళచక్రవర్తులును వేంగిపై నెత్తిరాఁగడఁగిరి. ఇక్కడినుండియే వేంగి కొన్నాళ్లు యుద్ధభూమియైనది. పూర్వ చాళుక్యుల స్వాతంత్ర్యము పంగతమైనది. కాలానుగుణముగ నొకప్పుడు చోళులకును మఱియొకప్పుడు పాశ్చాత్య చాళుక్యులకు ననుగాములు గావలసివచ్చెను. తెలుఁగు కుటుంబ కలహములే వారి నీ స్థితికి దెచ్చినవి.

క్రీ. శ. ౯౭౦ వ సంవత్సరమునం దమ్మరాజు విజయాదిత్యుని జంపి యతని యన్న యగు దానార్ణవుఁడు వేంగి సింహాసనము నాక్రమించుకొని మూఁడేండ్లు రాజ్యపాలన చేసెను. అంతట నమ్మరాజు విజయాదిత్యుని బావమఱఁది పెదకంటి సంస్థానాధిపతి జటాచోడభీముఁడు దానార్ణవుని జంపి క్రీ. శ. ౯౭౩ సంవత్సరమున వేంగి కళింగముల నాక్రమించుకొని ౨౭ సంవత్సరములు ఏకచ్ఛత్రాధిపతియై ప్రజాసంరక్షణ మొనర్చెను. ఆంధ్రులు విస్మరించిన మహాపురుషులలో నితఁడొకఁడు. ఇటు చోళులను నటు కర్ణాటకులను నెదిరించి తీరాంధ్రమున నసహాయశూరుఁడై స్వాతంత్ర్యమును గాపాడెను; కాని చిట్టచివర కతఁడు రణనిహతుఁడు కాఁగా వేంగిరాజ్యము చోళు

లకు హస్తగతమైనది. దానార్ణవుని పుత్రులగు శక్తివర్మ విమలాదిత్యులు పితృమరణానంతరము ద్రావిడదేశమునకు బోయి చోళచక్రవర్తియగు మొదటి రాజరాజు నాశ్రయించిరి. రాజరాజునకు వేంగిదేశమును జొచ్చుటకు మంచి సమయము దొరికినది; కావున వారిని చేరదీసి రెండవవాడగు విమలాదిత్యునికి దన కుమార్తె కుందవ్వనిచ్చి వివాహ మొనర్చి పెద్దవాడగు శక్తివర్మకు సహాయముగ యువరాజు రాజేంద్రచోళుని యాధిపత్యముక్రింద నొక ప్రచండసైన్యమును వేంగిదేశమును జయించుట కంపెను. ఈ యుద్ధమున జటాచోడభీముడు నిహతుడు కాగా రాజేంద్రచోళుడు శక్తివర్మను పితృపైతామహమైన పూర్వచాళుక్య సింహాసనముపై ప్రతిష్ఠించెను. శక్తివర్మ రాజ్యాభిషేకముతో పూర్వచాళుక్యుల స్వాతంత్ర్యము గతించెను; అతడును నతని తరువాతివారును చోళుల కరిగాపులై వర్తిల్లిరి. పాశ్చాత్య చాళుక్యుల యొత్తిడి దినదినప్రవర్ధమానమగుచున్నందుచేత చోళుల సహాయములేక వేంగియందు రాచరికము సల్పుటకు సాధ్యము గాకపోయెను. శక్తివర్మ పండ్రెండేండ్లు రాజ్యముచేసి కాలగతి నందెను. అతనికి సంతు లేకపోవుటవలన నతని మరణానంతర మతని తమ్ముడు విమలాదిత్యుడు రాజ్యాధిపతియై యేడేండ్లు కాలము ప్రజాపాలన గావించి గతించెను. విమలాదిత్యుని కిరువురు పుత్రులుండిరి. వారిలో చోళరాజదౌహిత్రుడగు రాజరాజనరేంద్రుడు జ్యేష్ఠుడు; రెండవవాడాంధ్ర చోళవంశ సంజాతయైన మేళాంబికాపుత్రుడగు విష్ణువర్ధన విజయాదిత్యుడు. అతడు రాజరాజనరేంద్రుని రాజ్యాభిషేకమునకు సమ్మతింపక తిరుగుబాటుచేసి పాశ్చాత్య చాళుక్య చక్రవర్తియగు రెండవ జయసింహుని వేంగి నాక్రమించుకొనెను. అంతట చోళచక్రవర్తియగు రాజేంద్రచోళుడు దన మేనల్లుడగు రాజరాజనరేంద్రుని పక్షమవలంబించి సైన్యముతో దరలివచ్చి విష్ణువర్ధన విజయాదిత్యుని బారదోలి క్రీ. శ. 1022 వ సంవత్సరమునం దతనికి పట్టాభిషేక మహోత్సవమును జేసెను. తన కుమార్తెయగు నమ్మంగదేవి నిచ్చి యుద్వాహము గావించెను. కాని రాజరాజనరేంద్రుని కష్టములంతట తీరలేదు. క్రీ. శ. 1031 వ సంవత్సరమున మఱియొకసారి యతడు విష్ణువర్ధనుని దుండగమువలన రాజ్యభ్రష్టుడాయెను; చోళచక్రవర్తి సహాయమువలన మరల బునఃప్రతిష్ఠితుడాయెను. క్రీ. శ. 1042 వ సంవత్సరమున పాశ్చాత్య చాళుక్య జయసింహుడు మృతినందెను. అతని యనంతరము అతని పుత్రుడు ఆహవమల్ల సోమేశ్వరుడు సామ్రాజ్యాధిపతి యాయెను. మఱి రెండేండ్లు గడచిన తరువాత రాజేంద్రచోళచక్రవర్తియు కాలగతి నందెను; తరువాత నతని జ్యేష్ఠపుత్రుడు మొదటి రాజాధిరాజు చోళసామ్రాజ్యమున కధిపతి యాయెను. ఆహవమల్ల సోమేశ్వర రాజాధిరాజుల రాజ్యకాలమున చోళ పాశ్చాత్య చాళుక్యులకు పోరు మహాఘోరముగ నడచెను. క్రీ. శ. 1047 వ సంవత్సరమున ఆహవమల్ల సోమేశ్వరుడు వేంగిని జయించి స్వాధీనపఱచుకొనెను. మరల నది క్రీ. శ. 1068 వఱకు చోళులకు వశపడలేదు; రాజేంద్రచోళుని యనంతరము చోళసామ్రాజ్యమున కధిపతులైన యతని పుత్రులు వేంగిపై బలువాఱు దండయాత్రజేసియు సాధింపజాలరైరి. కావున రాజరాజనరేంద్రుడు ఆహవమల్ల సోమేశ్వరున కరిగాపై యతనితో సంధిచేసికొని క్రీ. శ. 1061 వఱకును రాజ్యముజేసి మృతినందెను; తరువాత నతని కుమారుడగు రాజేంద్రుని సింహాసనమున నధిష్ఠింపనీయక విష్ణువర్ధన విజయాదిత్యుడు సోమేశ్వరుని సమ్మతిపై దేశము నాక్రమించి పాలింపసాగెను. క్రీ. శ. 1068 లో సోమేశ్వరుడు శివసాయుజ్యము నందు వఱకును నతని యాధికారము నిర్వక్రముగ సాగినది. అంతట చోళచక్రవర్తి వీరరాజేంద్రుడు వేంగపై నెత్తివచ్చి విష్ణువర్ధన విజయాదిత్యుని బారదోలి తన మేనల్లుడైన రాజేంద్రుని సింహాసనముపై ప్రతిష్ఠించెను; కాని యటుపిమ్మట కొన్ని నెలల లోపల వీరరాజేంద్రుడు పరమపదించుటవలన రాజేంద్రుడు దక్షిణదేశమునకు బోయి చోళసామ్రాజ్యము నాక్రమించుకొని, కులోత్తుంగ చోళదేవుడను నభిషేకనామమును ధరించి చోళరాజధానియైన గంగైకొండ చోళపురమునుండి ప్రజాపాలనము సేయసాగెను. రాజేంద్రుని నిష్క్రమణము విష్ణువర్ధన విజయాదిత్యుని కనుకూలపడెను. పూర్వ గాంగవంశజుడైన రాజరాజు సాహాయ్యముబడసి యతడు వేంగిని మరల స్వాధీనపఱచుకొనుట కెత్తివచ్చెను; అతనిని వారించుటకు వలనుపడక కులోత్తుంగచోళు డతనితో రాజీపడి యొడంబడిక చేసికొనెను. దాని ప్రకారము విష్ణువర్ధన విజయాదిత్యు డతని జీవితాంతమువఱకును వేంగి నేలునట్లును అటుపిమ్మట నది కులోత్తుంగునికి చెందవలసినట్లును దీర్మానము జేసికొనిరి. అట్లే విష్ణువర్ధన విజయాదిత్యుడు క్రీ. శ. 1076 వఱకును వేంగిని స్వతంత్రుడై పరిపాలించి దేహము చాలించెను. అటుపిమ్మట వేంగి చోళసామ్రాజ్యమున గలసిపోయినది.

రాజకీయ పరిస్థితు లిట్లు కలతపడియుండినను, ఆంధ్రవాఙ్మయము చక్కగ నభివృద్ధినందినది. గుణగ విజయాదిత్యుని కాలమునుండి గానవచ్చు పద్యరచనా సంప్రదాయ మీ యుగమందు గూడ నాదరపాత్ర మాయెను. జటాచోడ భీముని కాంచీపుర శాసనమును సోమదేవి ద్రాక్షారామ శాసనమును, బణపతి దీగ్గాసి శాసనమును ఇచట స్మరింపదగినవి. ఆంధ్రకావ్యరచన ఈకాలమునందే ప్రారంభమాయెను. అప్పుడు వెలువడిన కావ్యములు రెండే. నన్నెచోడుని కుమారసంభవ మొకటి; రెండవది నన్నయభట్టుగారి ఆంధ్రమహాభారతము. రెంటియందును కర్ణాటక వాఙ్మయచ్ఛాయలు విస్పష్టముగ గోచరముచున్నవి. మఱియు నన్నయభట్టుగారికి భారతరచనయందు నారాయణభట్టు తోడ్పడెను; నారాయణభట్టు కర్ణాటకుడు; కర్ణాటకచక్రవర్తియైన ఆహవమల్ల సోమేశ్వరుని ప్రధాని. కావున నన్నయభట్టుగారి కవిత్వములో పాలలోని పంచదారవలె నారాయణభట్టుకవిత్వము లీనమై యున్నది. ఇక కర్ణాటక కవిత్వపు పోకడలు నన్నయభట్టుభారతమున గానవచ్చుచున్నవి. ఈ విషయమెట్లుండినను, ఆంధ్ర వాఙ్మయమునకు నన్నయభట్టుగారి భారతము పునాదివంటిదని నిస్సంశయముగ బలుకవచ్చును.

## 4

క్రీ. శ. 12 వ శతాబ్దోత్తరార్ధమున చోళ పాశ్చాత్య సామ్రాజ్యములు రెండును విచ్ఛిన్నము గాదొడగినవి. సామంతరాజ్యములు ప్రబలి స్వతంత్రములాయెను. ఇట్లు పొడచూపిన స్వతంత్రమైన నూతన రాజ్యములలో నాలుగు ముఖ్యమైనవి. తెలంగాణమున కాకతీయులును తీరదేశమున వెలనాటి చోళులును నెల్లూరి తెలుగు చోళులును రాయలసీమయందు వల్లూరి కాయస్థప్రభువులును నెలకొని దమతమ యాధిపత్యము క్రింది రాష్ట్రములను బెంపొందించుటకై కొండొరులతో బోట్లాడగడగిరి; కాని కాలక్రమమున గాకతీయులు పక్కన వారి నణకరించి కొంచె మించుమించుగ నాంధ్రదేశము నంతటి నాక్రమించుకొనగల్గిరి. మొట్టమొదట కాకతీయుల యధికారము తెలంగాణ మందలి సచ్చినాటియందు మాత్రమే చెల్లుచుండినది; కాని స్వభుజ పరాక్రమముచే గాలక్రమమున వారు తెలంగాణమును దమ యేలుబడిక్రిందికి దెచ్చుకొనిరి. కాకతిరుద్రుడు సింహాసన మధిష్ఠించు నప్పటికి పశ్చిమమున గల్యాణకటకమునుండి పూర్వసముద్రమువఱకును నుత్తరదక్షిణముగ మాల్యవంతమునుండి శ్రీశైల పర్యంతమును వ్యాప్తమైయుండు రాష్ట్రము సర్వమును కాకతీయులపాలనలో నుండెను; కాని గణపతి తలయెత్తువఱకును నాంధ్రదేశమునం దన్యప్రాంతముల వారికి గణ్యత కలుగకపోయెను. గణపతి దొడ్డరాజు; వెలనాటి రాజులను నిర్జించి నెల్లూరు పర్యంతము గల తీరాంధ్రమును స్వాధీనము జేసికొనెను. చోడతిక్కరాజుతోడను మనుమసిద్ధితోడను మైత్రి గావించుకొని, కంచివఱకు దండయాత్రలు సల్పెను; వల్లూరు కాయస్థ ప్రభువుల నరిగాపుల జేసి యేలెను. ఈ విజయముల మూలమున గణపతి యాంధ్రదేశమున కధిరాజాయెను; కాని యతని కేకచ్ఛత్రాధిపత్యము జేకూడదాయె. నెల్లూరు చోళులును వల్లూరు కాయస్థులును దమతమ రాష్ట్రములపై సంపూర్ణాధికారమును జెలాయించుచుండిరి. దక్షిణమున పాండ్యులును బశ్చిమమున దేవగిరి యాదవులును గాకతీయుల నింకను ప్రక్కలోని బల్లెములవలె బాధించుచుండిరి. గణపతి యంత్యకాలమునను రుద్రాంబ రాజ్యారంభ దశయందు వారి యాటోపము హెచ్చినది; ఆంధ్రదేశముపై నెత్తివచ్చి యుచ్చావపారము వర్తింపగడగిరి; రుద్రాంబ శత్రుల నెట్లో నిర్జించి తన స్వతంత్రాధికారమును నిలబెట్టుకొన్నను, నాంధ్రదేశమునుండి వారిని వెడలగొట్టజాలకపోయెను. నెల్లూరు కడప చిత్తూరుమండలములందు పాండ్యులును బళ్ళారి యనంతపురమండలముల దేవగిరి యాదవులును నెలకొనియుండిరి; కాని ప్రతాపరుద్రుడు రాజ్యాభిషిక్తుడైన పిమ్మట యాదవుల నోడించి పశ్చిమాంధ్ర మండలములను బాండ్యులను బాఱకంచి దాక దక్షిణాంధ్ర సీమలును నిజరాజ్యమున గల్పుకొనెను; సామంతరాజ్యములన్ని రూపుమాసిపోయెను; ఆంధ్రదేశమున కంతటికిని ప్రతాపరుద్రుడే కేకచ్ఛత్రాధిపతియాయెను. శాతవాహనుల పిమ్మట సమసిపోయిన రాజ్యైక్యత మరల పొడచూపెను. ఆంధ్ర ప్రజలందఱు మరల నొక్కపాలన క్రిందికి వచ్చిరి.

కాకతీయుల కాలమం దాంధ్రదేశమున సంభవించిన చరిత్రాంశములలో ప్రధానమైనది మతవిజృంభణము. వీరశైవమును రామానుజ వైష్ణవమును దేశమం దల్లకల్లోలములను బ్రాకినవి. శైవవైష్ణవమతములు రెండును ప్రాచీనములైనవే; కాని యప్పటి మతసంస్కర్తల యుపదేశముల మూలమున నూతన మార్గముల నడచినవి. చాళుక్యుల కాలమున శైవము ప్రబలి జనాదరణకు పాత్రము కాజొచ్చినది. పాశుపత కాలాముఖ కాపాలికాది శైవసమయము లభివృద్ధిగాంచి సంఘసేవమూలమున ప్రజల హృదయములను చూఱ

గొనెను. ప్రజ శివుడే పరమదైవమని ప్రతిపాదించినను ప్రాచీనార్య ధర్మమును వర్జింపరైరి. బసవఁ డవతరించినపిమ్మట శైవమందు నూతనప్రబోధము గల్గినది. బ్రాహ్మణకులసంజాతుఁడయ్యు నతఁ డుపనయనాది వైదికకర్మలను త్యజించుటయేకాక వర్ణాశ్రమ ధర్మములను దెగడి యవి వర్జ్యములని యుపదేశించెను; భగవత్ప్రసాదమునందుటకు భక్తిమార్గమే శ్రేష్ఠతమ మని బోధించి ప్రాచీన నవీనభక్తుల మహిమను విశద పఱచి వారిత్రోవయే పరమార్థమును సాధింపనెంచిన వారి కత్యంతము శరణ్యమని చాటిచెప్పెను. బసవన్నయే లింగధారణ శైవులలో నాచరణలోనికి దెచ్చెనని కొందఱి యభిప్రాయము. వీరశైవ దీక్షగొన్న వారందరును లింగమును వాలాయగ ధరించవలయునని బసవన్న శాసించినది వాస్తవమే; కాని లింగధారణ ప్రథమమున నాచరణలోనికి దెచ్చినవా డతఁడేయనుట సరికాదు. ఏలనఁగా బసవపూర్వమునుండియే కాకపోయినను క్రీ. శ. ౭-వ శతాబ్దమునుండియే పాశుపతశైవులలో లింగధారణ వాడుకయం దుండెనని యప్పటి శాసనాదులవల్ల దెలియ వచ్చుచున్నది. శైవులందఱును బసవనిపద్ధతి నంగీకరింపలేదు; ఆంధ్రశైవులు వైదిక కర్మలు విడుచుటకును వర్ణాశ్రమములను త్యజించుటకును సమ్మతింపరైరి. వారికి నాయకుఁడు మల్లికార్జున పండితారాధ్యుఁడు. బసవనివలె నితఁడును ముక్తికి భక్తియే యేకసాధనమని నమ్మి జనసామాన్యమునకు భక్తిమార్గమును బ్రోత్సహించినాఁడు; సర్వవిద్యల పండితుఁడు బసవనకు సరియుద్దియె; పాండిత్యమున పండితునిది పైచేయికావచ్చును. బసవనియెడ నత్యంత గౌరవాదరములు గలవాఁడైనను, 'భక్తివిహీన వలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తు విడువఁజాలనేను బసవలింగ' యని ప్రతిఘటించి వీరశైవమున వేఱుదారి తీసెను. ఇతని సంప్రదాయమువారె యారాధ్యులు. వీరు బ్రాహ్మణులు; నేటికిని ఆంధ్రదేశమున వర్ధిల్లుచున్నారు; ఇట్లు బసవఁడును పండితారాధ్యులును వీరశైవసమయస్థాపకులైనను నది కర్ణాటాంధ్రదేశములందు విశేషవ్యాప్తినందినది పాల్కురికి సోమన యద్భుతప్రచారమువలననే. ఇతఁడు క్రీ. శ. ౧౨-వ శతాబ్దారంభదశయందు ప్రతాపరుద్రుని రాజ్యకాలమున తెలింగాణమున వర్ధిల్లెను. పుట్టుకచే నారాధ్య బ్రాహ్మణుఁడైనను బసవని యుపదేశములందు నమ్మకము హెచ్చుగా బ్రాహ్మ్యమును విడిచి జంగముఁ డయ్యెను. సోమనాథుఁడు నానాభాషల నిష్ణాతుఁడైన పండితప్రకాండుఁడు. సంస్కృత ప్రాకృతాదులందే కాక మరాట కర్ణాటాంధ్ర ద్రావిడములందును నితని వైశారద్య మసాధారణమైనది. కవిత్వమహత్త్వమునం దతనిమించినవాఁ డాంధ్రదేశమునం దప్పుడెవ్వఁడును లేఁడనుట యతిశయోక్తికాదు; తిట్టుకవిత్వమునంతటి పటుత్వముతో బరిఢవించిన కవి మఱి యెవ్వరును గానరారు; మతవాదములు నడుపుటయం దతని దండె వేసినచేయి. సోమనాథుఁడు వీరశైవమత ప్రచారము వినియోగించి దాని నాంధ్ర కర్ణాటదేశముల ప్రధాన మతముగా గావించెను.

వీరశైవమువలె రామానుజ వైష్ణవమును దేశమునం దెల్లయెడలను బ్రాకినది. అదియును భక్తి ప్రతిపాదకమైన మతమే; కాని యందు విష్ణువధిదైవము. రామానుజమత మెవరి ప్రచారమువలన నెట్లాంధ్రదేశమున నభివృద్ధినందినదో నిశ్చయించి చెప్పుటకు వీలుకాదు; కాని వీరశైవముతోపాటదియు గాకతీయుల నాటి యాంధ్రుల యాదరమునకు బాత్రమైయుండెనని యప్పటి శాసనములవల్లను వాఙ్మయమువల్లను దెల్లమగుచున్నది. వైష్ణవము నాంధ్రదేశమున విస్తరింపజేసిన యాచార్యులలో బరాశరభట్టు లగ్రగణ్యుఁడు. ఇతఁడు గోదావరీతీరమున నివసించుచు బలువురాంధ్ర సామంతరాజులకు శ్రీవైష్ణవదీక్ష యిచ్చి శిష్యులఁ జేసికొనెను. ఇట్టి యాచార్యులు మఱియెందఱో ఆంధ్రదేశమున ప్రచారము సల్పియుండవలయును వారి చరిత్రను భావిపరిశోధకులు విచారించి ప్రకటింపవలసి యున్నది

పూర్వయుగముకంటె నీయుగమున వాఙ్మయమెక్కువగ నభ్యుదయమందినది; మఱియు మునుపటివలె కేవలము రాజాశ్రయముపై నాధారపడియుండలేదు; జనాదరణయు నీ యభ్యుదయమునకు బ్రధాన కారణము. కాకతీయ ప్రభువులు చాళుక్య నృపాలురవలె ఆంధ్రభాషా పోషణయందు శ్రద్ధాభిమానముల జూపినట్లగపడదు. గణపతిదేవుఁడు తిక్కనసోమయాజి నాదరించి సత్కరించెను. విద్యానాథునికి ప్రతాపరుద్రుఁ డాశ్రయ మొసఁగె; శాకల్య మల్లాది విద్వద్బృందమును బోషించెను. నిక్కువము. కాని గణపతిదేవుఁడు తిక్కన సోమయాజికి చేసిన గౌరవమునకు వాస్తవకారణ మాతని భాషాభిమానము గాదు. తిక్కన మనుమసిద్ధికడనుండి వచ్చిన రాయబారి; పరరాజుల దూతలను సత్కరించుట రాజనీతి. విద్యానాథ శాకల్య మల్లులు గీర్వాణ భాషాకోవిదులు; వారికి ప్రతాపరుద్రమహీపాలుఁ డొసఁగిన యాశ్రయ మాతని యాంధ్రభాషాభిమానము గాఁజాలదు. కాకతీయులిట్లుదాసీనులైనను వారి సామంతులును దొరలును దండనాయకాద్యధికారవర్గమును ఆంధ్రకవులను జేరదీసి యుత్కృష్టకావ్యరచనకు

కారణభూతులైరి. అప్పటి వాఙ్మయము తీయమున కనుగుణముగ పెంపందినది. మతదృష్టిని దానిని త్రివిధములుగ విభజింపవచ్చును. శైవవైష్ణవములు ప్రబలినను జనానీక మింకను బహుళముగ శ్రుతిస్మృతి పురాణోక్త సనాతనధర్మము ననుసరించుచుండెను. నారికొఱకై నన్నయభట్టు చాళుక్యయుగమున వ్యాసప్రోక్త మహాభారతము నాంధ్రీకరింప నారంభించి మూడు పర్వములు ముగియక మునుపే స్వర్గస్థుడాయెను. ఇట్లరకొరదై నిలిచిపోయిన యాంధ్రభారతాన్వయమును తిక్కన సోమయాజులు తెనిగించెను; అతని శిష్యుడు మారన మార్కండేయ పురాణము నాంధ్రీకరించెను. శైవ వైష్ణవ రచయితలు దమ గ్రంథములందు బహుళముగ ద్విపదనె వాడిరి. పద్యములకంటె ద్విపద పాడుట కెక్కువ యనుకూలముగ నుండుటయే ప్రధానకారణముగానోపు. పాల్కురికి సోమనాథుని ప్రధాన రచనలగు పండితారాధ్య చరిత్రయు బసవపురాణమును ద్విపదాత్మకములే! వైష్ణవ గ్రంథకర్తలు దమ దృష్టినంతటిని రామాయణ కథయందె లగ్నముగావించిరి. వారి ప్రధాన రచనలన్నియు శ్రీరాముని దివ్యకథను వర్ణించునవియే. కోనవారు రామాయణమును ఉత్తరకాండతో గూడ ద్విపదకావ్యముగ విరచించిరి; సాహిణిమారుని ప్రోత్సాహమున భాస్కరాదులు భాస్కరరామాయణమను నాలుకాండల పద్యకావ్యమును వ్రాసిరి. ఈ రచనల మూలమున రామాయణ కథ యాంధ్రజనానీకమునకు సుపరిచితమాయెను.

కాకతీయుల కాలమున కళ లభివృద్ధినందినవి. ఇందు మొదట పేర్కొనదగినది వాస్తునిర్మాణము. పాశ్చాత్య చాళుక్య వాస్తువిద్యకు తెలింగాణమున కాకతీయులు వారసులైరి; చాళుక్య దేవాలయ నిర్మాణపద్ధతి ననుసరించి పెక్కు సుందరమైన దేవాలయములను గట్టించిరి. పాలంపేట యొప్పూరి దేవాలయముల సౌందర్యము సుప్రసిద్ధము. ఇట్టివి మఱి కొన్ని తెలంగాణమున గలవు. వాని నిర్మాణ కౌశలమును స్వరూప సౌందర్యమును పరిచితమగునందాక కాకతీయ వాస్తునిర్మాతల నేర్పువిశదము గాజాలదు. వాస్తునిర్మాణముతో పాటు శిల్ప చిత్రలేఖనములు వర్ధిల్లినవి. బండలను గంధించి మనోహర ప్రతిమలను చెక్కుటయందు కాకతీయ శిల్పులు పాశ్చాత్య చాళుక్య శిల్పుల నధఃకరించిరి. కాకతీయులనాటి చిత్తరవులు తెలింగాణమున గొన్ని దేవాలయముల గలవని చెప్పుదురు. వీని సౌందర్యాధిక్యమును వర్ణించు వారును గలరు; కాని వానిగూర్చి మనకు దెలియవచ్చు విషయ మల్పము. కళాభిజ్ఞులు పరిశీలించి వానియందలి విశేషాంశములను దెలియపఱచువఱకును వానిని గూర్చి నిశ్చయముగ నేమియు జెప్పుటకు వీలు కాదు.

కాకతీయుల పాలనక్రింద దేశముయొక్క ఆర్థిక స్థితి చక్కగ నభివృద్ధినందినది. దేశార్థికాభివృద్ధి వ్యవసాయముపై నాధారపడియున్నదని గ్రహించి యడవుల నఱకించి నూతన గ్రామములను గట్టించి భూమిని సాగుబడికి దెచ్చిరి. పైరుపచ్చలకు వలసిన జలమును పుష్కలముగ లభించునట్లు పెనుతటాకములను గట్టించి వర్షజలమును సేకరించియుంచుటకు దగు సదుపాయములను గల్పించిరి. నేతపను లవ్యారిగ సాగుటవలన దేశజనుల యుపయోగార్థమే కాక అన్యదేశముల కెగుమతి సేయుటకు వలసినంత వస్త్రములుత్పత్తియగుచు వచ్చినవి. వ్యాపారవాణిజ్య మభివృద్ధియాయెను. విదేశ వ్యాపారమూలమున ధనసమృద్ధియై జనులకు సుఖముగ జీవయాత్ర సాగించుట కవకాశము గల్గెను.

## 5

మహమ్మదీయ దండయాత్రలమూలమున కాకతీయ సామ్రాజ్య మాకస్మికముగ విచ్ఛిన్నమైపోయెను. ఆంధ్రదేశమంతయు యవనాక్రాంతమాయెను; కాని వారి యధికారము [illegible] సమసిపోయినది. కాకతీయ సామ్రాజ్యపతనమునకు వాస్తవకారణము మహమ్మదీయుల బలాధిక్యమును మొనగటమియు గాదు; గల్ల దేశద్రోహమును గాదు. ప్రతాపరుద్రుని దూరదృష్టి చాలకపోవుటయే రాజ్యక్షయమునకు మూలకారణము. మహమ్మదీయు లాంధ్రదేశముపై నేడుమారులెత్తి వచ్చిరి; కాని దేశము వారికి స్వాధీనపడలేదు. ఏడుపర్యాయములును పరాజితులై పోయిరని యప్పటిశాసనము లుద్ఘోషించుచున్నవి; కాకతీయు లోడి ఢిల్లీ సుల్తానుల కరిగాపులైనట్లు మహమ్మదీయ చరిత్రకారులు చెప్పుదురు. ఇందలి సత్యాసత్యములెట్లున్నను కడపటి దండయాత్రయందు మహమ్మదీయులోడి పాఱిపోయిరనుట నిర్వివాదాంశము. అట్లోడి వారు పోయినపిమ్మట ప్రతాపరుద్రుడును వారు తిరిగి సత్వరముగ రాజాలరని విశ్వసించి కోటలోని ధాన్యపు గణజములను దెఱపించి ధాన్యము నాకటిచే పీడింపబడుచున్న జనులకు గొల్పించి రాజధాని సంరక్షణకచట గూడియుండిన దొరలకును, నాయకులకును, సైనికులకును వారివారి నాయంకరస్థలములకుబోయి వ్యవసాయకార్యములను సాగించుకొను

ఁడని యాజ్ఞాపించెను. తరువాత మూఁడు నెలలు గడచినవి. మబ్బులేని యాకాశమునుండి పిడుగుపడినట్లు మహమ్మదీయు లకసాహస్రముగ నెత్తివచ్చి యోరుగంటిని ముట్టడించిరి. కోటలోని ప్రజలకు వలసిన యాహార పదార్థములు లేవు; సంరక్షించుటకు దగిన బలము లేదు. అట్లుండియు నాలుగు నెలలు ప్రతాపరుద్రుఁడు లొంగక పోరు చూపెను. కాని కోటలో జనుల జీవనము దుర్భరమైనది. వారి దుస్థితిని గాంచి పరితాపమంది ప్రతాపరుద్రుఁడు కోటను తురకలకు వశపఱచి బందీకృతుఁ డాయెను. వారాతని ఢిల్లీకి గొనిపోవుచుండఁగా మార్గమధ్యమున దన పారతంత్ర్యస్థితికి వగచి యాత్మహత్య జేసికొనెను. ఆంధ్రదేశ మిట్లు మహమ్మదీయుల పాలఁబడినది.

ఆంధ్రరాజ్య నిర్మూలమును ప్రతాపరుద్రుని నిర్యాణమును, దేశదాస్యమును మహమ్మదీయుల దౌర్జన్యమును నాంధ్రుల హృదయమును గలతివెట్టినవి. మహమ్మదీయుల బాఱదోలుట యెట్లు? దేశ జాతి స్వాతంత్ర్యముల బునరుద్ధరించుట యెట్లు? అను ప్రశ్నలకు ప్రతియాంధ్రుఁడును సమాధానము చెప్పవలసి వచ్చెను. వారి కింకను దమ యొగ్గటిమి విషయమై సందేహము గలుగలేదు. దేశమునకంటె స్వార్థమే యధికమను తలంపు వారి హృదయమున నంకురింపలేదు. కావున వారందరును స్వతంత్ర సంగ్రామమునకు నడుముకట్టిరి. ప్రప్రథమమున స్వతంత్రపతాకను నెగురవేసినవారు పాకనాటి పంటరెడ్లు. అద్దంకి ప్రభువైన ప్రోలయ వేమారెడ్డి వీరికి నాయకుఁడు. మహమ్మదీయు లింకను రాజమహేంద్రవరమును జేకొనకముందే ప్రోలయ వేమారెడ్డి కృష్ణకు దక్షిణమందలి తీరాంధ్రదేశమును జయింపసాగెను; అడ్డపడిన తురకలను బరిమార్చి యాంధ్ర స్వతంత్రభేరిని మ్రోయించెను. ఆ మ్రోత యాంధ్రదేశమంతటను బ్రతిధ్వనించి ప్రజల దేశ జాతి మతాభిమానములను రెచ్చగొట్టినది. ప్రజలును దొరలును యుద్ధమునకు సంసిద్ధులైరి. కాని నాయకుఁ డొకఁడుండినగాని తమ యుద్యమము జయప్రదము గాజాలదని వారు గ్రహించిరి. ముసునూరివంశజుఁడైన ప్రోలయనాయకు డొక్కఁడె తమపై యాధిపత్యము వహింపదగినవాఁడని నిశ్చయించి యతనిని దమకు నాయకునిగ నెన్నుకొనిరి. ప్రోలయ నాయకుని పూర్వచరిత్రను గూర్చి తెలియవచ్చు విషయ మత్యల్పము. కాని ప్రోలయ వేమారెడ్డి, వేంగిదేశాధీశ్వరుఁడైన వెంగరాజు, ఏఱువదేశ పాలకుఁడు చోళ భక్తిరాజు మున్నగు ప్రముఖులతో గూడి డెబ్బదియేవు రాంధ్రనాయకు లతని నేకగ్రీవముగ దమ కధిపతిగ నెన్నుకొనుటను జూడఁగా నాతఁడు సామాన్య పురుషుఁడు గాఁడను భావము గల్గుచున్నది. మూఁడు నాల్గేండ్ల లోపలనె తీరాంధ్రమునుండి మహమ్మదీయుల నుచ్చాటనసేయుట జూడ నతఁడు శక్తిసామర్థ్యములుగల దళనాయకుఁ డనియు పరాక్రమసంపన్నుఁ డనియు దెల్లమగుచున్నది. స్వతంత్రయుద్ధము రెండు రంగముల నడచెను. జాతీయసేన యందొక భాగము తీరాంధ్రమందలి మహమ్మదీయ బలగముపై బడి వారిని ప్రతి రణక్షేత్రమునందును దోలి తోపులాడి దేశమును స్వాధీనపఱచుకొన గడఁగెను. మఱి యొక భాగ మారవీటి సోమదేవరాజు నాయకత్వము క్రింద పశ్చిమాంధ్రముపై నడచి కంపిలి ప్రాంతము నేలుచుండిన మిలిక్‌సుల్తానుని ప్రతినిధి నోడించి దేశము నాక్రమించుకొనెను. తీర దేశము నంతటిని పారతంత్ర్యమునుండి విడిపించి ప్రోలయనాయకుఁడు చాల్యవంత సానువుపై నుండు రేకపల్లినుండి రాజ్యముసేయ గడఁగెను. ఇంతటితో నాంధ్రస్వాతంత్ర్య సంగ్రామము మొదటి ఘట్టము ముగిసినది. తరువాతి స్వల్పకాలములోపలనె ముసునూరి ప్రోలయనాయకుఁడు మృతినందినట్లున్నది. అతని యనంతర మతని జ్ఞాతియగు ముసునూరి కాపయనాయకుఁడు ఆంధ్ర జాతీయ నాయకమున కధిపతియై స్వతంత్ర సంగ్రామమును మరల ప్రారంభించెను.

కాపయనాయకుఁడు దూరదృష్టిగల రాజకార్య మర్మజ్ఞుఁడు. తెలింగాణములోని మహమ్మదీయులకు సహాయముగ ఢిల్లీ సుల్తాను నిజ సైన్యముల నంపుననియు ఢిల్లీ సైన్యములతో నెదురు పోరాట తప్పదనియు నతఁడు గ్రహించెను. ఢిల్లీశ్వరు నెదిర్చి యుద్ధము సేయుటకు ఆంధ్రులకు బలము చాలదని యెఱింగి, తన పక్షమును బలపఱచుకొనుట కొక చక్కని వ్యూహమును గని పెట్టెను. మహమ్మదీయులచే నిర్మూలమందిన దాక్షిణాత్య హిందూ రాజ్యములలో ప్రముఖుఁడు కర్ణాటాధిపతియైన ముమ్మడి బల్లాళుఁడు. అతనితో సఖ్యము గుదుర్చుకొని యతని సహాయము వడసిన మహమ్మదీయులను సంపూర్ణముగ దక్షిణదేశమునుండి పాఱద్రోలి హిందూ స్వాతంత్ర్యమును జయప్రదముగ నెలకొల్పవచ్చునని యెంచి బల్లాలుని రాజధానియైన ద్వారసముద్రమునకు బోయి యతనిని గలసికొని మహమ్మదీయుల వలన హిందూ జనానీకమునకు రానున్న ముప్పును దెలియజెప్పి యతఁడు దాక్షిణాత్య హిందువులకెల్ల నాయకుఁడై జాతి సంరక్షణమునకు బూనుకొన్నగాని హిందూ ధర్మమును సంస్కృతియు దప్పక నశించునని నచ్చజెప్పి యొప్పించెను. బల్లాళుఁ డంతట దాక్షిణాత్య హిందువులకు నాయకుఁడై మహమ్మదీయులను దెలింగాణమునుండి తఱుముగొట్టుటకు తగిన సైన్యమును సహాయ మంపెను. ఆ సైన్యము వెంటబెట్టుకొని వచ్చి కాపనాయకుఁడు తెలింగాణములోని మహమ్మదీయ దళములను బాఱద్రోలి యాంధ్ర జాతీయ స్వాతంత్ర్యమును బునరుద్ధరించెను. [సశేషము]

ఎలుకా? ఇలా సందేహించుకుంటూ సందేహం తీరకుండా ఆ పడిపోయిన యింటి జాడ చుట్టూ నావతో ప్రదక్షిణం చేసి నావతోనే ఇంటికప్పుమీదను అడ్డుగీతలు నిలువుగీతలు గీసి, గట్లుదాటే ప్రవాహాన్ని తరిమి తునకు దేన్నీ సాధించలేక ముగ్గురూ కూడా నావలో చతికిలబడిపోయారు.

"మరి భూషయ్యా! కళేబరం కనిపించకపోతే పోయిరి! నీవన్నా కంఠధ్వనినైనా వినిపించవద్దూ?" అన్నాడు నిర్వాసి. భూషయ్య "కళేబరం కనబడగలిగితే కంఠధ్వని కూపిరి నేనే పోయగలను" అని నిర్వాసికి కాక పెడజవాబు చెబుతూ రెండో పెడకు [illegible] అరచేతులు బూరాగా ఊదాడు "కళ్యాణీ! కళ్యాణీ! నీ వెక్కడైనా ఉంటే పలుకు! కూయిడ్డావుటగా! ఆమె చెప్పింది. ఏ "డెబ్రిస్" క్రిందైనా వుంటే పలుకు! నిన్ను పైకి లేవనెత్తడానికి పడవ వేసుకు వచ్చాను—ఇంకెక్కడి కళ్యాణి? కళ్యాణీ! కళ్యాణీ!" అంటూ పడవలోనే మూర్ఛిల్లాడు భూషయ్య. నిర్వాసి "భూషయ్యా! మనం ఆ గంగా భాగీరథీ సమానురాల్ని కూడా యీ పడవలో కెక్కించుకుని "కుంయి" విన్నస్థలం తెలుసుకుని ఉండవలసినది. "ఇదేనా కళ్యాణి పడిన జాగా?" అని అడిగాడు. అప్పటికప్పుడే భూషయ్యకు స్పృహ తప్పింది. పడవవాడు "ఈ భూషయ్యే పోయినాడు తనకంటె ముందుగానని ఆ కళ్యాణమ్మగారే ఆలా అవతార మెత్తి ముండమోపు మోసియుండవచ్చు. ఈ వరదలో ఎవరు ముందర పోయేరో ఎవరు వెనుక పోయేరో ఎవరు ఎవరికి చెప్పి పోయారు? అన్నాడు. అంటూ పడవను వెనుద్రిప్పాడు.

పడవ వెనుదిరగడంలో పడవ పొడుగునా అడుగున ఏదో ధ్వనించినట్టయింది. ఆభరణాల్లా అగపించినట్టయింది ఎర్రగా కుంకుంపట్టై అలుక్కుపోయి. "ఓయోయ్యోయి! పడవక్రింద తగిలినట్టుగా వుంది కళ్యాణమ్మ కళేబరం!" అన్నాడు నిర్వాసి ఆ పడవ ఆసామీతో. భూషయ్య ఆ మాటతో స్పృహ దేతి "దొరికిందా? కళేబరం! నా కళ్యాణి కళేబరం!" అన్నాడు.

"కళేబరం దొరికిందంటేనే ఇంత సంతోషించేడు భూషయ్య. కంఠ ధ్వని వింటే ఎంత సంతోషించేవాడో" అన్నాడు నిర్వాసి. "కంఠధ్వని! కంఠధ్వని! దాన్ని ఎన్నిసార్లైనా వినగలను. కళేబరాన్ని చూచేది ఇదే కడసారి! కడసారి! కడసారి!" అని విస్తుపోతూ, తన భార్యయొక్క కళేబరాన్ని పడవవాడూ నిర్వాసి పైకెత్తి పట్టి పడవలో పెడుతూవుంటే, భూషయ్య వలవల ఏడ్చాడు.

# స్వాతంత్ర్య చంద్రిక



శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

విశదంబైన ప్రకాశభావ మెసఁగన్ విచ్చేసె నేకాదశీ
శశిబింబాంధ్ర నవాంశువుల్ జలధరచ్ఛాయానిరాసక్రియా
కుశలంబుల్ నిశియెల్లనుం బగటివెల్గుల్ గాఁగ నాశాధ్వనీ
న శరత్కాశ సుమాభమంజరులు మింటన్ దోరణాల్గట్టఁగన్

రాజకళయెల్ల దమయందె రాజిలంగ
శారదిక తారకా ప్రజాస్వామికముగ
పెలివచ్చిన జిల్గువెన్నెలలఁ బ్రాత
కలక తేరెను వెల్గు మాగానిచేలు.

ఎలయన్ వెన్నెలలందుఁ జెప్పఁటయె కానీ! యివ్వి, పువ్వారుఁ త
న్మూలా పూర్వాంధ్రధరాగ్రనాయక శిరఃకోటీరవైదూర్య కాం
తులలో వెల్గులు వల్గుచాలనఁ పుంజిందుల్ గాఁగఁ గాలంబు సం
దులలోనుండి వినిర్గమించెడు నవేందుస్వచ్ఛకాంతుల్ బలెన్.

కటలిన పంటవెన్నెలలు గాఁగ నెవండొ మహోపవాసియై
వదలిన ప్రాణసంతతులు వచ్చినఁ వెచ్చినకాంతి గాఁగ సం
బుదములు నష్టవచ్చినవె మున్నిపుడెంతయుఁబోల్చె, నష్ట, సం
పద లరుదేరిసంశటన బందుగు లౌదుర జ్ఞాతి శత్రువుల్.

బలిసి చకోరసంతతులు వచ్చిన వెన్నెల సొమ్ము చేసికో
వలయున క్రొత్తవెన్నెలల వాగులు కట్టలుకట్టి తిర్చు బో
దెలు సవరించి నద్దెసలఁ దెచ్చిన సాధుసుధాంఘలో దయో
జ్జ్వలముగ మల్లుమల్లుగఁ బ్రశాంత వియత్పదమెల్లఁ దోచఁగన్.

విశ్వనాధుని తనూ విభవముద్ధచ్ఛటా
నలుంతో వెన్నెల నత్తులాడి
శంకరాచల మహా సానుప్రదీప్త ని
ష్కూటములన్ గుజ్జనగూళ్లు మెసవి

విప్రయోగానలావృత చకోరప్రాణ
సంజీవకాంశు ప్రసారమొలసి
యింద్రియతర్పణా కృతిశైత్య సామ్రాజ్య
పట్టాభిరామమై పరిఢవిల్లి
ప్రౌఢసస్య గోపాలక పాలకంబు
వెన్నెల ప్రకాశ మియ్యది విస్తరిల్లి
తెలుఁగు మాగాణముల నాకులీవెమడుల
లవలీలలితకామనోజ్ఞ విలాస మొప్పె.

జయకృష్ణా గోదావరి సాధువారి పరిపాలిత
జయపినాకినీ సభంగ జలతరంగ పరితోషిత
జయ మహేంద్ర తనయాజల సంవర్ధిత దేశాంచల
జయసర్వ మహానదీకృత సస్యసంప దున్మీలిత !
జయ కవిత్రయోజ్జ్వలతర సాధుశిల్ప పరిపాలిత
జయశ్రీ శ్రీకృష్ణరాయ సారస్వత పరితోషిత !
జయ తంజాపురి మధురా సరసకావ్య సౌకుమార్య
జయ సర్వమహా సుకవీశ్వర కావ్యసమున్మీలిత
జయజయ నాత్యుష్ణశీత శాంతావని భాగరమ్య
జయ తీవ్రావేశ మహాశాంత భావయుత జనతా !
జయ దివ్య మహాద్వైత స్వచ్ఛభావ సందీపిత
జయ నానాద్వీప పూర్వసామ్రాజ్య మహాచరితా !
జయ జయ జయ వేదకాల సంవేదిత దిక్పురంధ్రి
జయ జయ జయ సకలాంధ్రీ!





# యూరోపియనుల ఆంధ్రభాషా చరిత్రసేవ



శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ

తంజావూరు, మధుర రాజ్యాలను తెలుగు నాయకరాజులు పరిపాలిస్తూవుండిన కాలములో క్రీ. శ. 1592 లో జెసూయిట్ పాదిరీలు దక్షిణ హిందూదేశానికి వచ్చి మధుర రాజ్యానికి రాజధాని అయినమధురలో మిషను స్థాపించి దేశములో క్రైస్తవ మతము వ్యాపింపజేయుటకు పూనుకొన్న నాటనుంచే యూరోపియనులు దేశభాషలను నేర్చుకొని వాటిలో కృషిచేయనారంభించినా రని చెప్పవచ్చును. క్రీ. శ. 1606 లో మధురకు వచ్చిన ఇటాలియను పాదిరి రాబర్ట్ డి నోబిలి ప్రజలలో క్రైస్తవము వ్యాపింపజేయుటలో క్రొత్తపద్ధతి అవలంబించినాడు. అతడు తాను రోమను బ్రాహ్మణుడనని చెప్పి ఆహారపద్ధతిని మార్చి సన్యాసివేషము ధరించి క్రైస్తవ ధర్మమున కిబ్బందిలేని బ్రాహ్మణాచారములను నిర్వర్తించి ధారాళముగా మాట్లాడుటయు, వ్రాయుటయు బాగా వచ్చేటట్లు సంస్కృతమును, దేశభాషలను బాగా నేర్చుకొని, హిందువుల మతవాఙ్మయము శ్రుతిపురాణో పేతాలు, మతగ్రంథాలు బాగా తెలుసుకొని హిందువులలో హిందువుగా, బ్రాహ్మణులలో బ్రాహ్మణుడుగా నటించి ఉన్నతకులములవారికి క్రైస్తవ మిప్పించుటకు పాటుపడసాగినాడు. హిందూదేశ భాషలలో పాండిత్య ప్రజ్ఞలు సంపాదించిన మొదటి యూరోపియను ఇతడే. ఇతడు తనకు క్రొత్తగా దొరకినదని యజుర్వేదమును సృష్టించి, అది కూటసృష్టి కాదనీ, ఇతర జెసూయిటు పాదిరీలవలెనే తానున్ను ప్రాచీన భారతీయ ఋషిసంతతిలో పుట్టినవాడనే అని చెప్పి మధురలోని బ్రాహ్మణ సభవారిని నమ్మించుటకు సర్వశక్తులా ప్రయత్నించినాడు. బ్రాహ్మణు లెవ్వరూ అతని యజుర్వేదాన్ని నమ్మకపోయినా ఏవైనా మనకు తెలియని సంహితలు ఉండకూడదా అని సందేహించినవారు కూడా లేకపోలేదు. క్రైస్తవులే అనుకొన్నారు అతనికి యజుర్వేద సంహిత దొరకుట నిజమని. దాదాపు రెండు శతాబ్దులదాకా బ్రాహ్మణులు కాకపోయినా సరే, దేశీయ ఇతరవర్ణాలవారు అది నిజమైనదనే భావిస్తూవచ్చారు. చివరికి సంస్కృతములో బాగా పాండిత్యము సంపాదించిన మద్రాసు సివిలు ఉద్యోగి ఎల్లిస్ అతని యజుర్వేదము వట్టి కూటసృష్టిఅనీ, మతవాఙ్మయవిషయకమయిన కూటసృష్టి దానికి సాటివచ్చేది మరొకటి లేదనీ ఋజువు చేసి దానినిగురించిన దుర్భ్రమ తొలగించినాడు. ఈ జెసూయిట్ పాదిరి ఆంధ్రదేశానికి రాకుండానే మధురరాజ్యములో తమిళ దేశములో ఉండే తెలుగు నేర్చుకొని తెలుగులో గ్రంథాలు వ్రాసినాడనీ, నోబిలి తరవాత మధురకు వచ్చిన బెషిపాదిరి (*Father Beschi*) కూడా మధుర, తంజావూరు రాజ్యాలలో రాజభాషగా ఉంటూవచ్చిన తెలుగు భాషను నేర్చుకొని అతడుకూడా తెలుగుభాషకు వ్యాకరణం ఒకటి వ్రాసినాడనీ అతని జీవిత చరిత్ర రచియించిన బెస్సిపాదిరి (*Father Besse*) చెపుతున్నారు. ఈవిషయాలు నిజమయినా కాకపోయినా తెలుగును నేర్చుకొని బైబిలును తెలుగులోనికి తర్జుమా చేసి దేశీయుల కందివ్వాలని ప్రయత్నించినవారు క్రైస్తవ మతబోధకులు—మిషనరీలు. యూరోపియను మిషనరీలు తెలుగులో చేసిన కృషిఫలముగా వచ్చిన తెలుగు గ్రంథములు — బైబిలుకు సంబంధించినవి— సువార్తలు.

తెలుగుదేశములో పనిచేసే మిషనరీలకు తెలుగు భాష మాట్లాడడము వ్రాయడము రావడ మవసరమని క్రైస్తవ మతబోధకులయిన యూరోపియనులు తమ మిషనరీలు తెలుగు నేర్చుకొనుటకై ఉపయోగపడవలెనని ముందుగా తెలుగుభాషకు, అంటే గ్రాంథిక భాషకు కాదు, వ్యావహారికభాషకు, వ్యాకరణములు వ్రాస్తూ వచ్చారు. ఈపనిని మొదట తలపెట్టినవారు ఆంధ్రదేశములో మొదట క్రైస్తవ మతవ్యాపనమునకు పూనుకొన్న కర్నాటిక్ మిషనువారు. జెసూయిటు పాదిరీలు ఈమిషనును 1702 లో ఆంధ్రదేశములో స్థాపించినారు. తెలుగుభాషలో గాఢపరిశ్రమ చేసిన మొదటి యూరోపియను స్కల్జ్ (*Schulze*). ఇతడు క్రైస్తవ వేదమయిన బైబిలును మొదటి

పర్యాయము తెనుగులోనికి అనువదించినాడు. ఇతడే మొదటిమారు 1747 లో యూరోపియనులకు ఆంధ్రాక్షరములను గురించి చెప్పినది. ఈ స్కల్ట్జ్ కే రివరెండు బెంజమిన్ స్కల్ట్జియస్ అని పూర్తిపేరు. ఇతడు మొదటిమారు క్రీస్తుమత సంబంధమయిన తెలుగు గ్రంథమును జర్మనీలోని ప్రస్యా దేశమున మాగ్డిబర్గుకు చేరిన హాలీపట్టణములో 1747 లో ముద్రించినాడు. 1746, 1747 సంవత్సరములలో తెలుగులో ముద్రితములైన రెండు గ్రంథములు శ్రీరామపురము కళాశాల పుస్తక భాండాగారములో ఉంటూ వచ్చినవి. కలకత్తా దగ్గర ఉండే శ్రీరామపురమునకు 1746 లో కొంత రాంగ్ల క్రైస్తవ మత బోధకులు వచ్చి చేరి 'శ్రీరామపురము మిషన్' అనే పేర ప్రసిద్ధి వహించారు. వీరు స్థాపించిన కళాశాలా పుస్తకభాండాగారములోనివే ఆ గ్రంథాలు. 1746 లో ముద్రితమయినది స్కల్ట్జియస్ రచించిన గ్రంథము దీనిలో ప్రశ్నోత్తర రూపమున క్రీస్తుమతమునకు సంబంధించిన విషయములు, ప్రార్థనాదులు ఉన్నవి; 1747 లో ముద్రితమయిన గ్రంథము అరవములో నుంచి తెలుగులోనికి తర్జుమా. దీనిలో నిజమైన క్రైస్తవుడు తన జీవితమును గడపవలసిన మార్గములను నిర్దేశించే నూరువిధు లున్నవి. ఈ అనువాదము చేసినది కూడా స్కల్ట్జియసే. శ్రీరామపురము మిషనువారు 1804 వ సంవత్సరములో నాగరాక్షరములు పోతపోసి మొదటిమారు దానిలో అచ్చు ప్రారంభించినారు; తరువాత తెలుగు, కన్నడము, మహారాష్ట్రము మొదలైన దేశభాషలకుకూడా అచ్చులు పోయించినారు. 1806 లో మద్రాసులో తెలుగు ముద్రణము ఆరంభమయినది. 1807 లో మద్రాసులో తెలుగు వ్యాకరణము అచ్చయినది. 1810 లో లూకాసువార్త తెలుగులో అచ్చయినది.

క్రైస్తవ మిషనరీలకువలెనే కుంఫిణీ ఉద్యోగులయిన సివిలియనులకుకూడా దేశపరిపాలనము చక్కగా సాగించేటందుకు దేశీయుల దేశభాష తెలుసుకోవడము, నేర్చుకోవడము ఆవశ్యకమయినది. 1766 నాటికే తెలుగుదేశములోని కోస్తా ప్రాంతములో చాలాభాగము కుంఫిణీవారి క్రిందికి వచ్చినది. 1800 లనుంచి ఇప్పుడు రాయలసీమ అనే ప్రాంతమునకు కూడా కుంఫిణీవారు అధికారులైనారు. అందువల్ల ఆంధ్రదేశములో పరిపాలనము సాగించుటకు, ఆంధ్రదేశీయులతో వ్యవహారించేటందుకు సివిలు ఉద్యోగులు తెలుగుభాష తప్పనిసరిగా నేర్చుకోవలసి వచ్చినది. తెలుగుభాషను గురించి సివిలు ఉద్యోగులు నేర్చుకొనుటకు ఇంగ్లీషులో గ్రంథాలు లేకపోయినవి. ఈ కారణంచేత తెలుగునుగురించి ఇంగ్లీషులో గ్రంథాలు వ్రాయించడమూ ముద్రించడమూ అవసరమై ఆనాటి కుంఫిణీ ప్రభుత్వమువారు ఇట్టి కృషికి గొప్ప ప్రోత్సాహమిచ్చినారు; అదీగాక దేశీయులు ఇంగ్లీషు భాష నేర్చుకొనేటందుకు కూడా ఉపకరించే గ్రంథాలు తయారుచేయించుటకును పూనుకొన్నారు. ఈవిధముగా కుంఫిణీ ప్రభుత్వమువారు ద్రావిడ భాషలలోని కృషికి ప్రోత్సాహమిచ్చుట 1803 నుంచి ఆరంభము. ప్రభుత్వమువారిచేత నియమితులైన సెంటు జార్జికోట కళాశాల బోర్డువారు ద్రావిడభాషలలో గ్రంథాలు సమర్థులయినవారిచేత రచియింపించుటకు, పండితులు రచియించిన గ్రంథాల కాపీరైటు కొని అట్టివారిని గ్రంథరచనకు ప్రోత్సహించుటకు, కొన్ని గ్రంథాలను ప్రకటించుటకు ప్రారంభించినారు. ఈ బోర్డులో యఫ్. డబ్ల్యు. ఎల్లిస్, ఏ. డి. క్యాంబెల్ మొదలైనవారుండేవారు. బోర్డుకు అధ్యక్షులైన ఎల్లిస్ సంస్కృత తమిళభాషలలో బాగా పాండిత్యము సంపాదించినవారు. ఈ బోర్డులో సభ్యుడూ దానికి కార్యదర్శి అయిన ఏ. డి. క్యాంబెల్ తెలుగు బాగా వచ్చినవాడు. ప్రభుత్వమువారికి ముందుగా చాలా అవసరమైన గ్రంథాలు తెలుగువ్యాకరణములూ, నిఘంటువులూను. తెలుగు—ఇంగ్లీషు నిఘంటువు తయారుచేయుటలో ఉపయోగపడుతుందని కాలేజిబోర్డువారు సిఫారసు చేయుటచేత కుంఫిణీ ప్రభుత్వమువారు మామిడి వెంకయ్యగారు వ్రాసిన ఆంధ్రదీపిక అనే తెలుగు నిఘంటువు కాపీరైటును వేయి వరహాలకు కొన్నారు. క్యాంబెల్ తెలుగులో వ్యాకరణము వ్రాయవలెనని తెలుగులో ఉన్న వ్యాకరణాలన్నీ చదివి ఇంగ్లీషులో తెలుగుభాషకు వ్యాకరణము వ్రాసినారు. ఈ తెలుగు వ్యాకరణ రచనలో ఎల్లిసును, సెంటు జార్జికోట కళాశాలలోని పండితులు, ముఖ్యంగా ఉదయగిరి నారాయణయ్యగారున్ను, పండిత పట్టాభి రామశాస్త్రిగారున్ను అతనికి తోడ్పడినారు. ఉదయగిరి వెంకట నారాయణయ్యగారు క్యాంబెలుకు తెలుగు నేర్పిన గురువు. పట్టాభి రామశాస్త్రి గారు ఆ కళాశాలలోని సంస్కృతాంధ్రాధ్యాపక ప్రముఖుడు. క్యాంబెల్ తన తెలుగు వ్యాకరణమును గవర్నర్ జనరల్ ఎర్ల్ ఆఫ్ మోయిరా, కె. జి. (1814)కి అంకిత మిచ్చినారు. క్యాంబెల్ తెలుగు వ్యాకరణము కాపీరైటును ప్రభుత్వమువారు కొని ఆ వ్యాకరణమును కళాశాల ముద్రణాలయములో 1816 లో ముద్రించి ప్రకటించినారు. ఈ వ్యాకరణం రచించిన సందర్భములోనే తెలుగులో సంస్కృతపదాలెక్కు

వని అతనికి తెలిసి వచ్చినది. అయినప్పటికీ తెనుగు సంస్కృతజన్యము కాదనీ, వాక్యరచనాపద్ధతిననుసరించీ, ఇంకా ఇతరవిషయముల ననుసరించీ చూస్తే తెలుగుకు ఇతర దాక్షిణాత్యభాషలతో ఎక్కువ సంబంధము కలదనీ మొట్టమొదట చెప్పినవాడు క్యాంబెల్ — ఇది కాల్డ్వెల్‌కు చాలాకాలము పూర్వమే. 1849 లో ఈ వ్యాకరణము మూడవమారు అచ్చు పడినది. క్యాంబెల్ వ్రాసిన రెండవ గ్రంథము తెలుగు—ఇంగ్లీషు నిఘంటువు. దీనిని ఎఫ్. డబ్ల్యు. ఎల్లిసకు అంకిత మిచ్చినాడు క్యాంబెల్. ఇది ఎప్పుడచ్చయినదో తెలియదు కాని దీని రెండవకూర్పు 1848 లో హిందూ ముద్రాక్షరశాలలో ముద్రిత మయినది. ప్రభుత్వమువారు దీని కాపీరైటు కొని సెంటుజార్జికోట కళాశాల ముద్రణాలయములోనే అచ్చొత్తించినారు. ఈ నిఘంటువును తయారు చేయుటలో క్యాంబెల్‌కు ఆంధ్రదీపిక చాలా తోడ్పడినది.

అది యూరోపియనుల దేశభాషావ్యాకరణ, నిఘంటు రచనాకాలము. క్రీ. శ. 1800 లకు పూర్వము అంటే ఇంగ్లీషువారికి పూర్వము ఫ్రెంచివారికికూడా తెలుగుదేశముతో ఎక్కువ సంబంధము ఉండుటచేత ఆనాటికి తెలుగు ఫ్రెంచి నిఘంటువులుకూడా వచ్చినవి. ఇటువంటివి రెండు తెలుగు-ఫ్రెంచి నిఘంటువులు కూడా నిఘంటు రచనలో క్యాంబెల్‌కు తోడ్పడినవి. మెక్కరెల్, ఎ. డాల్రింపుల్ అనేవారు కూడా తెలుగు నిఘంటువులను రచించినట్లు తెలుస్తున్నది. కాని ప్రభుత్వ ప్రోత్సాహము లభింపకపోవుటవల్ల ఇవి ముద్రితమైనట్లు కాన్పింపదు. విలియమ్ బ్రౌను కూడా ఒక తెలుగు వ్యాకరణము వ్రాసినాడు కాని దానిని ప్రభుత్వమువారు తీసుకోలేదు. కాని యితడు రచియించిన జెంటు వొకేబ్యులరి (*Gentoo Vocabulary*) కాపీరైటునుమాత్రం ప్రభుత్వమువారు కొన్నట్లు 1823 నాటి ప్రభుత్వపు రికార్డులవల్ల తెలుస్తున్నది. ఈకాలములోనే కళాశాలబోర్డుసభ్యుడైన జే. సి. మారిస్ అలపెట్టిన తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు 1835 లో ప్రకటితమయినది. ఈ నిఘంటు రచనలో మారిస్ గారికి సెంట్ జార్జికోట కళాశాలలోని ఆంధ్రాధ్యాపకుడు క. సుబ్రహ్మణ్యశాస్త్రి గారు తోడ్పడినారు. మారిస్ మరొక తెలుగును గూర్చిన గ్రంథము (*Elementary work on Telugu*) రచించినట్లును, దానినికూడా ప్రభుత్వమువారు కొని ప్రకటించినట్లును తెలుస్తున్నది. జే. సి. మారిస్ కాక అతని సోదరుడు హెచ్. మారిస్ కూడా తెలుగున ఏదో గ్రంథము వ్రాసినట్లు కనబడుతుంది. కెప్టెన్ హ్యాక్స్టర్ అరేబియా రాత్రుల కథలను (*Arabian nights*) తెలుగులోనికి అనువాదము చేసినాడు. క్యాంబెల్, మారిస్, విలియమ్ బ్రౌన్‌లు మాత్రమే కాక తెలుగుభాషకు ఇంగ్లీషుభాషలో వ్యాకరణములు వ్రాసినవారు మరియిద్దరున్నారు. వీరిలో ఆర్డెన్ ఒకడు. రెండవవాడు చార్లెస్ ఫిలిప్ బ్రౌన్. మిగిలిన వారందరు చేసినకృషి ఒకయెత్తు, సి. పి. బ్రౌన్ చేసిన కృషి ఒకయెత్తున్నూ. తెనుగుభాషకు అఖండసేవ చేసి దానినుద్ధరించిన కుంపిణీ ప్రభుత్వపు సివిలు ఉద్యోగులలో సి. పి. బ్రౌను అగ్రగణ్యుడు. ధవళేశ్వరము ఆనకట్టకట్టిన కాటన్ ఆంధ్రుల కెట్లా చిరస్మరణీయుడో తెలుగు వాఙ్మయమునకు అపారసేవ కావించిన బ్రౌనును అంతటి చిరస్మరణీయుడే.

## చార్లెస్ ఫిలిప్ బ్రౌను :

చార్లెస ఫిలిప్ బ్రౌను సంగ్రహ జీవిత మిది: ఇతడు క్రీ. శ. 1798 లో జన్మించినాడు; రెవరెండ్ డేవిడ్ బ్రౌను కుమారుడు. ఇతడు మద్రాసు సివిలు సర్వీసు ఉద్యోగములో 1817 లో ప్రవేశించి చాలా సంవత్సరములు గడిపినాడు, జ్యుడిషల్ మొదలైన శాఖలలో తెలుగుదేశములోని కడప, మచిలీపట్నము జిల్లాలలో, పనిచేసి పారసీ, సంస్కృతము, హిందూస్తానీ భాషలలోనే కాక అంతవరకు సివిలు ఉద్యోగులచేత ఉపేక్షతో చూడబడుతూ వచ్చిన తెలుగు భాషలోను, తెలుగు వాఙ్మయములోనుకూడ గొప్ప పాండిత్యమును సంపాదించినాడు. అతనికి తెలుగుభాషలోను వాఙ్మయములోనుగల అపూర్వాధికారముల వల్లనే, తెలుగుకు చేసిన సేవవల్లనే ఇప్పటికీ తెలుగువారు అతనిని సంస్మరిస్తూ వుంటారు. 1838వ సంవత్సరములో బ్రౌను పారసీ అనువాదకుడుగాను (*Persian translator*) 1846 లో పోస్టుమాస్టరు జనరలుగాను, మద్రాసు ప్రభుత్వానికి తెలుగు అనువాదకుడుగాను నియమింపబడెను. ఈ వుద్యోగములనుమాత్రమే కాక అతడు కొంతకాలము ఎడ్యుకేషనలు కౌన్సిలు సభ్యుడుగాను, మద్రాసు బ్యాంకికి గవర్నమెంటు డైరెక్టరుగాను, కళాశాలా పుస్తకభాండారము (*College library*) లోని ప్రాతప్రతులకు 'క్యూరేటరు'గాను పనిచేసినాడు. అతడు ముప్పైయెనిమిది సంవత్సరములు ఉద్యోగముచేసిన అనంతరము 1855 వ సంవత్సరములో తన ఉద్యోగమునకు రాజీనామా ఇచ్చినాడు.

బ్రౌను వ్రాసిన గ్రంథములలో ముఖ్యమయినవి ఆతని నిఘంటువులు—తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు (1852); ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు (1852);

మిశ్ర నిఘంటువు తెలుగుదేశములో వాడుకలో ఉండిన అన్యదేశ్యములతో కూడినది (1854). తెలుగు-ఇంగ్లీషు నిఘంటువును ఇతడు 1824 లో మొదలు పెట్టినాడట. తెలుగులో తాను చేసిన కృషినిగురించి అతడే ఈవిధముగా వ్రాసుకొన్నాడు:

"నేను ఉద్యోగములో ప్రవేశించినయేడే 1817లో తెలుగు అక్షరాలు నేర్చుకొన్నాను. 1822 లో తెలుగులో సులువుగా, ధారాళముగా సంభాషింప నేర్చినాను. 1824 లో నేను తెలుగు పద్యకావ్యాలు చదవడం ఆరంభించినాను. ఆ సంవత్సరములోనే నేను తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు రచియించుట కారంభించి మధ్య మధ్య విరామములతో పదేండ్ల పాటు కృషిచేసినాను. 1830 లో నేను తెలుగు - ఇంగ్లీషు నిఘంటువును ఇంగ్లీషు - తెలుగు నిఘంటువుగా మార్చి వ్రాయుట కారంభించి దానిని 1832 వ జూలై 1వ తేదీని పూర్తిచేసినాను. 1838లో దానినితిరిగి సంస్కరించి కుదించి యిప్పుడున్న రీతికి తెచ్చినాను; జాన్సను ఇంగ్లీషు నిఘంటువుకు తెలుగు లిఖిమాను 1840 లో పూర్తిచేసినాను. జాన్సను నిఘంటువు తెలుగు తర్జుమాను పునఃపరిశీలన చేసినాను. దానితో గ్రంథమంతా తిరిగి వ్రాయవలసి వచ్చినది-క్రొత్తగా. చిట్టచివరివారు దానిని సంస్కరించుటకు 1841 లో మొదలుపెట్టి 1842 ఆగస్టుమాసమునాటికి 'వ' అనే అక్షరమువరకు పూర్తిచేసినాను. ఈవిధముగా పనిచేస్తూ వచ్చినకొద్దీ నాకు అనుభవము హెచ్చి అంతవరకు మొదట వ్రాసినదానితో అసంతృప్తి జనించి మరల 1843 లో 'వి' అనే అక్షరమువద్దనుంచి మొదటినుంచీ మొదలుపెట్టినాను."

సి. పి. బ్రౌను వ్రాసిన గ్రంథములు అనేకములు. వీటిలో అనేకములు తెలుగుదేశ చరిత్రకు మాత్రమేకాక దక్షిణ హిందూదేశ చరిత్రకు ఉపకరించేవీ, సంస్కృతాంధ్ర భాషా పరిజ్ఞానమునకు ఉపకరించేవీ చాలా ఉన్నవి. అతడు మిరాసి హక్కులకు సంబంధించిన మూడు గ్రంథాలను, రాజుల యుద్ధము లనే పేరుతో ఉండే అనంతపుర చరిత్రను (1853), ఆనాడు తెలుగుదేశములో వాడుకలో ఉండిన తెలుగు కథలను (1855), మహారాష్ట్రములోనుంచి హైదరలీ, టిప్పుసుల్తానుల జీవితచరిత్రల అనువాదములను కూడా రచించి ప్రకటించినాడు. అతని రచనల పట్టిక ఈ దిగువను ఇస్తున్నాను. అతని రచనలలో మిక్కిలి ముఖ్యమయినది 1866 లో అతడు రచించిన స్వీయచరిత్ర. ఇది కేవలము తన బంధుమిత్రులు చదువుటకు మాత్రమే రచించినాడు. అతడు ఆకాలములో మద్రాసులో ప్రకటన అవుతూవుండిన 'లిటరేచర్ అండ్ సైన్సు' అను పేరుగల పత్రికకు తరచుగా వ్యాసాలు వ్రాస్తూ వచ్చాడు. ఇతని గ్రంథాలలో కొన్ని అరవము, కన్నడము, హిందూస్థానీ భాషల లోనికి అనూదితము లయినవి. అతడు ఇంగ్లాండుకు వెళ్లిన తరువాత యూనివర్సిటీ కళాశాలలో ఆంధ్రాచార్యపదవియందు నియుక్తుడైనాడు. సంస్కృతాంధ్రములమీద అతనికిగల అభిమానాదరములచేత ఎన్నో సంస్కృత, ఆంధ్ర తాళపత్ర గ్రంథాలను అతడు సేకరించినాడు. ఇట్లా సేకరించిన తాళపత్ర గ్రంథాలు రెండు వేలదాకా ఉన్నవి. వీటిలో కొన్నిటిని అతడు డబ్బిచ్చి సంపాదించినాడు. ఏతద్గ్రంథ సంపాదనలో బ్రౌను పండితులకు, పండితులు బ్రౌనుకు వ్రాసినజాబులు ఎన్నో యిప్పటికీ భద్రముగా ఉన్నవి. "1825 లో ఆంధ్ర భాష మృత ప్రాయముగా నుండెను. ముప్పయి సంవత్సరాలలో నేను దానికి జీవము పోసినా"నని బ్రౌను వ్రాసినాడు. అది యథార్థము. ఆనాడాయన అమిత శ్రమకు ఓర్చి ఆంధ్రగ్రంథాలను సేకరించకనే పోతే నాటిలో చాలాభాగ మీపాటికి నాశనమయి యుండేవి. బందరు మొదలైన పట్టణాలలో సదరదాలతు కోర్టు జడ్జిగా ఉండినప్పుడు చాలాధనము వ్యయముచేసి చాలా గ్రంథాలు సంపాదించినాడు. జూలూరి అప్పయ్య, కే. గురుమూర్తిశాస్త్రి, నాదెళ్ల పురుషోత్తమ పరబ్రహ్మశాస్త్రి మొదలైన పండితు లనేకులు గ్రంథసంపాదనములోను, సంపాదించిన ఆంధ్ర గ్రంథములను పరిష్కరించుటలోను అతనికి చాలా తోడ్పడినారు. వారి నాదరించి వారికి విరివిగా ధనము సంగినాడు.

ఇతనిమీద కవులు చెప్పిన పద్య మిది:

నూర్లు లెక్క సేయక
పేర్లకెక్కిన విబుధవరుల బిలిపించుచు వే
మార్థమిచ్చు వితరణి
చార్లసు ఫిలిప్సు బ్రౌను సాహెబు కరుణన్.

ఆయన పండితులకు, పండితులాయనకు వ్రాసిన ఉత్తరాలు పరిశీలించినట్టయితే ఎంత శ్రమపడి ఆయన ఈ గ్రంథాలు సంపాదించినాడో విదితమవుతుంది. గ్రంథవిస్తర భీతిచేత ఆ జాబులలోని కొద్ది భాగాల నయినా ఇక్కడ ప్రకటింపలేకున్నాను. అతడు సేకరించిన గ్రంథాలను 1845 లో మద్రాసులోని 'లిటరరీ సొసయిటీ'కి ఇచ్చివేసినాడు. ఇవి తరువాత మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో నికి చేరినవి. నేడు మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక

భాండాగారములో ఉన్న సంస్కృతాంధ్ర గ్రంథములనేకములు అతడు సంపాదించినవే. పూండ్ల రామకృష్ణయ్యగారు పోలవరం జమీందారు, కొచ్చెర్లకోట వెంకటకృష్ణారావు బహద్దరువారు, కందుకూరి వీరేశలింగంపంతులుగారు మొదలైనవారు తరువాతి కాలంలో ప్రకటించిన ఆంధ్ర ప్రబంధాలకీ బ్రౌను గ్రంథ సంచయమే ఆధారము.

బ్రౌనుద్వార ఆంధ్రదేశములోని వేరు వేరు ప్రాంతాల వేరు వేరు వృత్తులవారూ, ఉన్నతకులాల వారు ఎట్లా మాట్లాడుతారో, అర్జీలు, న్యాయస్థానాలలో దాఖలుచేసే పత్రాలు మొదలైన వెట్లా ఉంటవో పరిశీలించి ఆంధ్ర వ్యావహారిక భాషాతత్వమును కనిపెట్టుటకును, ఆంధ్రదేశములోని వేరు వేరు ప్రాంతాలలోని వ్యావహారిక భాష ఎట్లా ఉంటుందో విచారించుటకును ఉత్తరాలు, వృత్తాంతాలు, అర్జీలు, పత్రాలు మొదలైనవి వేరు వేరు ఆంధ్రప్రాంతాలనుంచి తెప్పించినాడు. ఈ సాధనసామగ్రి పదహారు సంపుటాలున్నది. ఈ సంపుటాలను పరిశోధించి బ్రౌనుకాలమునాటి ఆంధ్రదేశ ఆర్థికస్థితి, భాష, ఆచార వ్యవహారాలు మొదలైనవి తెలుసుకోవచ్చును.

బ్రౌను తెలుగుదేశానికి చేసిన మరో ఉపకారము – కలనల్ కాలిన్ మెకంజీ సంపాదించిన దేశ, గ్రామ వృత్తాంతములు క్రిమిదష్టములై నశిస్తూ ఉండగా వాటిని తిరుగ వ్రాయించి ఉద్ధరించుట. దీనినిగురించి తరువాత వ్రాసెదను.

సి. పి. బ్రౌను 1884 వ సంవత్సరములో కాలధర్మమునొందినాడు. ఆంధ్రభాషకు వాఙ్మయమునకు మహోపకారముకావించిన సి. పి. బ్రౌను తెలుగువారికి చిరస్మరణీయుడు, వంద్యుడు. ఈతని రచనలు—మరికొన్ని.

(1) Prosody of the Telngu and Sanskrit languages explained; (2) Vemana's Verses - Moral religious and Satirical; (3) Familiar analysis of Samskrit prosody; (4) New Telugu version of St. Luke; (5) Grammar of the Telugu language; (6) Cyclic tables of Hindu and Muhammadan chronology of the Telugu and Kannada countries; (7) English Hindusthani phraseology; (8) Ephemeris showing the corresponding dates according to the English, Telugu, Malayalam and Muhamadan calenders 1751—1850; (9) Dialogues in Telugu and English; (10) Vakyavali or exercises in idioms, English and Telugu; (11) *Zilla* dictienary in the Roman character; (12) A titular memory; (13) Carnatic chronology, the Hindu and Mahammadan method of reckoning time, explained with symbols and Historic records; ఇంకా ఎన్నో ఉన్నవి—వ్యాసములు మొదలైనవి.

## కలనల్ కాలిన్ మెకంజీ

తెలుగుదేశమునకు సి. పి. బ్రౌనువలెనే సేవ చేసిన మరొక మహనీయుడు కాలిన్ మెకంజీ. ఇతడు ఇంగ్లాండునకు చెందిన పశ్చిమ ద్వీపాలలో స్టార్నొవేలో క్రీ. శ. 1754 లో జన్మించినాడు. 1782 లో హిందూదేశమునకు వచ్చి కుంఫిణి ప్రభుత్వములోని మద్రాసు ఇంజనీర్లలో చేరినాడు. ఇతడు బ్రౌనుదొరవలె ప్రత్యేకముగా తెలుగుదేశము నిమిత్తము, తెలుగుభాష నిమిత్తము కృషి చేయలేదు కాని ఇతడు దక్షిణ హిందూదేశ చరిత్రమును, తద్దేశీయుల ఆచార వ్యవహార మతాదికములను తెలుసుకొనుటకు చేసిన కృషిలో చాలాభాగము తెలుగుదేశమునకు ఉపకారకమయినది. ఈ దేశమునకు వచ్చిన తరువాత మెకంజీకి హిందూదేశీయులకుగల శాస్త్ర పరిజ్ఞానమెట్టిదో, వారి వాఙ్మయమెట్టిదో, వారి మతసర్వ సిద్ధాంతములు ఆచారములు ఎట్టివో, శాస్త్ర గ్రంథము లెట్టివో తెలుసుకోవలెనని కుతూహలము కలిగినది. అతను స్వయముగా గణితశాస్త్రజ్ఞుడు. ఆ శాస్త్రమంటే అతని కమితాభిమానము. అందువల్ల అతడు ఈ దేశవాసుల విజ్ఞాన వాఙ్మయాదులను గురించి తెలుసుకోవాలని అతనికి ఆకాంక్ష కలిగింది. కాని ఉద్యోగములో చేరిన పద్నాలుగేండ్లవరకు అతని కోరిక తీర్చుకొనుటకు అవకాశము కలుగలేదు. చివరికి 1796లో అతనికి ఏలూరునివాసియైన కావలి వెంకట బొర్రయ్య అనే బ్రాహ్మణునితో గలిగిన పరిచయమువల్ల భారతీయ విజ్ఞాన సౌధములో ప్రవేశించుటకు అవకాశమేర్పడినది. బొర్రయ్య తన బుద్ధి విశేషము చూపి కృషి చేసినప్పటినుంచి భారతీయ విజ్ఞానమును గ్రహించుటకు అతనికి క్రొత్త దోవ దొరికినది. అతడు తన సొంతధనము వెచ్చించి వేంకట బొర్రయ్యను గ్రామములలో తిరిగి వాటి వృత్తాంతమును, అందలి దేవాలయముల వివరములను, వాటిమీద శాసనములను, ఆయా గ్రామములలో దొరికిన గ్రంథములను సేకరింపవలసినదని నియోగించెను. సాధన సామగ్రి ఎక్కువగా దొరుకుతూ ఉండుటవల్లను, దొరకిన చారిత్రక సామగ్రి చాలా క్రొత్తదీ తన అభిరుచిని, సంపాదించేదీ

అపుడు వల్లను మరి యిరువురను నియోగించి, వారిచేత పని గైకొనవలసినదని బొర్రయ్యకు ఆదేశించెను. బొర్రయ్య చాలా చిన్నవాడు. అఖండ ప్రతిభావంతుడు. ఈపనిలోనికి దిగినకొద్దీ అతనిలో సహజముగా ఉండిన పరిశోధనా శక్తి ఉద్దీప్తమయినది. అప్పటికింకా దక్షిణ హిందూదేశ దేవాలయాలలో కానవచ్చే శాసనాలు క్రీస్తుశకము పది పదకొండు శతాబ్దులకు పూర్వపువి చదివినవారూ లేరు; చదివి అర్థముచేసుకొన్నవారూ లేరు. అందులోను అవి కన్నడభాషలో ఉండిన శాసనాలయితే మరీ చిక్కు. పది పదకొండు శతాబ్దులకు పూర్వపుకన్నడభాష ఆతరువాతి శతాబ్దుల భాషకు భిన్నమయినది. ఇటీవలి కాలానికి వచ్చినకొద్దీ మనకు ఆ కన్నడభాష అర్థమగును కాని పూర్వానికి పోనుపోను అర్థముకాదు. ప్రాచీనకన్నడభాషకు హళెకన్నడమనీ, ఇటీవలి కన్నడభాషకు హొస కన్నడమనీ పేరు. 1796-1800 ల ప్రాంతాననే బొర్రయ్య క్రీస్తుశకము పదవ శతాబ్దికి పూర్వపు శాసనముల లిపిని సాధించి వాటిని చదవడమేకాకుండా హళె కన్నడభాషను గూడా సాధించి ఆ ప్రాచీన భాషలోని శాసనాలకుకూడా అర్థము తీయగలిగినాడు. ఈ విషయముగా చూస్తే బొర్రయ్య మన ఆంధ్రదేశ పరిశోధకులలో మొట్టమొదటివాడు - అంతేకాదు, భారతీయచరిత్ర పరిశోధకులలోనే మొదటి వాడనవచ్చును. ఇంకా ఉన్నది - ప్రాచీన శాసనార్థము వెల్లడి అవడముతో మెకంజీకి మన దేశచరిత్ర కవాటము దానంతట అదే తెరుచుకొన్నది. బొర్రయ్య, అతని సహచరులు సంపాదించి తెచ్చిన వృత్తాంతమును దుబాసి బొర్రయ్య చేత చదివించుకొని ఇంగ్లీషులోని కనువాదము చేయించుకొని మెకంజీ 'ఏషియాటిక్ ఆన్యుయల్ రిజిస్టరు', 'ఏషియాటిక్ రిసెర్చెస్', 'రాయల్ ఏషియాటిక్ సొసయిటీ' పత్రిక, మద్రాసు 'లిటరేచరు అండ్ సైన్సు' అనే పత్రికలకు హిందూదేశ చరిత్రమును గురించీ, మతములు మొదలైనవాటిని గురించీ వ్యాసములు వ్రాస్తూ వచ్చినాడు; హిందూ దేశమునకు సంబంధించిన నూతన విజ్ఞాన మాంగ్లపత్రికలలో ప్రవహింప దొడగినది. కాని బొర్రయ్య సహాయసంపద మెకంజీకి చిరకాలము దక్కినది కాదు. బొర్రయ్య చాలా లేతవయసులోనే పాతికేండ్లయినా నిండకమునుపే పరమపదము పొందినాడు; కాని అతని సోదరుడు వెంకట లక్ష్మయ్య తన అన్నగారి అడుగుజాడలలో నడచి మెకంజీ మెప్పుకు పాత్రమయినాడు. టీపు సుల్తానుతోడి మైసూరు యుద్ధములో శ్రీరంగపట్నము పడిపోయినపిదప 1810 వరకు మెకంజీ మైసూరు దేశములోను దాని ఉత్తరపు, తూర్పు సరిహద్దు ప్రాంతాలా పర్యటిస్తూ వచ్చినాడు. తన పండితులను ఈ దేశములలో పర్యటింప నియోగించుటచేత మెకంజీ సంపాదించిన వృత్తాంత సంచయములో తెలుగు జిల్లాలకు సంబంధించిన సాధన సామగ్రి ఎక్కువగా ఉన్నది. 1810 లో అతడు మదరాసు సర్వేయరు జనరలయి పిదప కొద్దికాలము కుంఫిణీ ప్రభుత్వాదేశమున 1811-1815 లలో జావాకు వెళ్ళి ఆ కడపటి వత్సరములో మద్రాసుకు వచ్చినాడు. అటు తరువాత కొంతకాల మక్కడ ఉండి ఆ వెనుక అతడు కొంతకాలము హైదరాబాదు రాజ్యములో పనిచేసి 1816 లో సర్వేయరు జనరల్ ఆఫ్ ఇండియాఅయి తుదకు కలకత్తా వెళ్ళినాడు. అక్కడ ఉండగానే అతడు మే 1821 లో లోకాంతరగతుడైనాడు. పాపము, విశేషము తన సొంత డబ్బు వెచ్చించి సంపాదించిన చరిత్ర సామగ్రిని బాగా చదివి జీర్ణముచేసుకొని ఎంతో వ్రాయవలెననుకొన్నాడు; చివరికి హిందూదేశ చరిత్రమయినా వ్రాయవలెనని 1818 నుంచి ప్రయత్నిస్తూనే వచ్చాడు. కాని సాగలేదు. జావాకు వెళ్ళినప్పుడు కూడా అతడా దేశచరిత్ర తెలుసుకోవలెనని కొంతమందిని నియోగించి ఇక్కడ వ్రాయించినట్టుగానే తద్దేశ వృత్తాంతమును అక్కడా వ్రాయించినాడు- తన సొంత సొమ్ము ఖర్చుపెట్టుకొని. అతని విజ్ఞాన పిపాస అటువంటిది.

మెకంజీ పండితులను పెట్టి సంపాదించిన గ్రామ, దేశవృత్తాంతములూ, చారిత్రకసామగ్రీ ముఖ్యముగా కృష్ణానదికి దక్షిణాన ఉండేదేశానికి సంబంధించినది. అతడు సంపాదించిన వాటిలో సంస్కృతము, తెలుగు కన్నడము, అరవము, మలయాళము, ఓఢ్రము, మహారాష్ట్రము, హిందీ, ఫారసీ, అరబ్బీ, హిందూస్తానీ, జావా, బర్మా భాషలకు సంబంధించిన వ్రాతప్రతులు 1568 గ్రంథాలు ఉన్నవి. ఇవికాక చరిత్రకు, కులాచారాదులకు సంబంధించినవీ, స్థానిక వృత్తాంతములూ 2,070 ఉన్నవి; అతడు సంపాదించిన శాసనప్రతులు 8,076; స్తూపాల, ఇతర పురాతన భవనాల ప్లానులు 79; శిల్పాల చిత్రాలు 2,630; నాణెములు 6,218; 106 విగ్రహాలు; ప్రాచీన శిథిలావశేషములు 40. ఇంతటి సాధన సామగ్రి సంపాదించుటకు, కొనుటకు విజ్ఞానపిపాస కొద్దీ అతడెంతటి విస్తారమైన ద్రవ్యమును వెచ్చించి ఉండాలో ఊహించుకోవచ్చును; దాదాపు 15,000 ల పౌనులో అంతకంటెనూ ఎక్కువగానో వెచ్చించినట్లు తెలుస్తున్నది. గవర్నరుజనరల్ మార్క్వెస్ ఆఫ్ హేస్టింగ్సు మెకంజీ మరణానంతరము ఈ యమూల్య చారిత్ర

కవృత్తాంతసంచయమును ఆతని భార్యవద్దనుండి పది వేల పౌనులిచ్చి కొనెను; కలకత్తా గవర్నమెంటువారు 3,200 రూపాయలిచ్చి ఇంకా కొన్నింటిని దీసికొనిరి. మెకంజీ వ్రాయించిన వృత్తాంతములకు మెకంజీసంచయమనీ, మెకంజీ వృత్తాంతములనీ పేరు. వీటిలో చాల భాగము గ్రామచరిత్రలూ, వంశచరిత్రలూను. గ్రామచరిత్రలకు కైఫీయతులనినీ పేరు. వీటిలో చాలా భాగము క్రిమికీటక దష్టమవుతూవుండగా చార్లెస్ ఫిలిప్ బ్రౌను వీటికి మరల మంచి కాగితములమీద ప్రతులు వ్రాయించి పదిలపరిచెను. బ్రౌను ప్రతులు వ్రాయించినవానికి ఇప్పుడు స్థానిక చరిత్రలంటారు. ఇవి 62 సంపుటాలున్నవి. ఇంకా ప్రతులు వ్రాయించవలసిన మెకంజీ వృత్తాంతములు చాలా ఉన్నవి. వీటిలో చాలాభాగము పురుగులు కొట్టివేసినందున చాలా పాడైయునవి. ఈ మెకంజీ సంపాదించిన మొత్తము సంచయములో కొంత ఇంగ్లాండులో ఉన్నది; ఇక కొంత కలకత్తాలో ఉన్నది; వేరొక కొంత మద్రాసు ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారములో ఉన్నది. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని మెకంజీరికార్డులు దక్షిణదేశమునకు సంబంధించినవే. ఈ గ్రామవృత్తాంతములు 1796, 1800 ల ప్రాంతాన వ్రాయించినవి. అందువల్ల ఇవి మన దేశచరిత్రకెంతో ఉపయోగపడును. ముఖ్యముగా మన దేశానికి సంబంధించిన విజయనగర చరిత్రకు, అటు తిరువాతి కాలపు చరిత్రకు ఈ వృత్తాంతములు అమూల్యము లయినవి. మన కెక్కడాను దొరకని చరిత్రవిశేషము లిందు దొరకును. వీటిని ముద్రింప కొంత ప్రయత్నమిదివరలో జరిగినదికాని అది సాగలేదు. ఈ మెకంజీసంచయములో విశేషము తెలుగులో ఉండుటచేత మద్రాసు విశ్వవిద్యాలయమునకు దీనిని ప్రకటించుటకు శ్రద్ధ లేకపోయినది. ఆంధ్రరాష్ట్రము వచ్చినది గనుక ఈ మెకంజీ వృత్తాంతములను ప్రభుత్వమువారిచేత తగురీతిని ప్రకటింప జేయుటకు చరిత్రాభిమానులు ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను. బ్రౌను దొర ఆంధ్ర వాఙ్మయానికి చేసిన కృషి కలనల్ కాలిన్ మెకంజీ చరిత్రకు కళకు చేసినాడు. అమరావతీస్తూప శిల్పచిత్రకళా ప్రాశస్త్యమును లోకానికి మొదటిమారు వెల్లడించి దాని మీద అభిమానము కలిగించినవాడు మెకంజీ.

ఈ విధముగా తెలుగుదేశమునకు సంబంధించిన శాసనములు కళ మొదలైనవాటిని గురించి పనిచేసిన యూరోపియనులు రాబర్టు సూయెల్, బర్గెస్, ఫ్లీటు, హుల్ష్, ఇలియటు మొదలైనవా రెందరో ఉన్నారు కాని వారెవ్వరూ ప్రత్యేకముగా తెలుగుదేశమునకు సంబంధించిన విషయములను గురించి మాత్రమే కృషి చేసినవారు కారు. వారినిగురించి ప్రత్యేకముగ వ్రాయనక్కరలేదు. ఆటవేల తెలుగు పలుకుబడిని బాగుగా గమనించి ఒక నిఘంటువు తయారు చేసినవాడు గెల్లటి. తెలుగుదేశమునకు సంబంధించిన శాసన, చరిత్రాది విషయములను గురించి కృషిచేసిన నిఘంటువులు మొదలైనవి వ్రాసిన మహనీయుల కందరికీ జోహారులు.



వ్యోమముల హాసరేఖ కను
    మాయదు నేటికి బాడువడ్డ, నే
నోములు నోచి పాడుకొనె
    నో యిట - నేస్తవనీయ శిల్పమున్
గోముగ నోమెనో చిలికి
    కొంచు నుదాత్త రసప్రపూరముల్.

కసవును మేసి క్రొవ్వి మది
    గర్వమునన్ జిలు అంకె వేయు నా
పసరము గిట్టివన్ మొరడు
    వారు తృణంబులు మోసులెత్తు, దు
ర్వ్యసన జిఘత్సురున్ బోలియు,
    రమ్యకళాగారము కొన్న తేని తా
రసపడు మంచిరోజులు ని
    రాశను దాసులుగారు హైందవుల్.

*　　　*　　　*　　　*

మును సులతాను కంట్లనిడి
    పోయిన దుఃఖ నవాంజనాల తీ
రిన తమసాల పిండుల హ
    రించి, స్వతంత్ర నవోదయ శ్రియా

తను తపనీయ దీధితులు
    దారత జిందుచు నున్నవందు, లే
నును జివురెత్తె భగ్న కళ
    నూత్న వికాసము బొంద క్రమ్మరన్.

కాలము తప్పివచ్చి తిరు
    గంబడిపోయిన సోమనాథ దే
వాలయ భాగ్యరేఖ, నెర
    లాడిన దింకొకమారు సల్కులో
ద్యోతితమై విశృంఖలగ
    తిన్ - మొరయించుచు ఘంటికా నినా
దాల, స్వతంత్ర భారతి కు
    దాత్త కుతూహల ముప్పతిల్లగన్.

ఈ జగమేలు సామి వసి
    యించెడు నాలయ గోపురాగ్ర వి
భ్రాజిత హేమకుంభ పరి
    రంభణలాలస వృత్తి తారకా
రాజియనుంగు రాజు నిశి
    లన్ బయనించు వియత్పథాన నీ
రాజన మిచ్చుచున్ శుభ క
    రంబుగ వెన్నెల కప్పురాలతోన్.



# మధురనేలిన తెలుగురాణి



శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

భారతావనిలో రాజ్యము చేసిన నారీమణులు కొందరు కలరు. స్వయముగా రణరంగములకు నడిచి వైరివీరులతో సమరము సాగించిన సాహస బాల సంపన్నలును వారిలో కొందరు లేకపోలేదు. అసాధారణమైన రాజనీతిని ప్రదర్శించి, రాజ్యమునందు శాంతి భద్రతలు సుస్థిరముగ నెలకొల్పిన రాజనీతి విశారదలును నున్నారు. అయినను రాణి మంగమ్మ వలె వారిలో ఎవ్వరును శాశ్వతయశస్సు సంపాదింపలేకపోయినారు. నేటికిని దక్షిణాపథములో మహారాణి మంగమ్మ పేరు వాడుకలోనే యున్నది. ఆమె నిర్మించిన సత్రములు, కట్టించిన భవనములు, త్రవ్వించిన తటాకకూపములు, వేయించిన రాజమార్గములు- మొదలైనవి మంగమ్మ మహారాణి పేరుప్రతిష్ఠలను దేశదేశాలవారికిని తెలియజేయుచున్న శాశ్వతకీర్తిస్తంభములు. క్లిష్టపరిస్థితులలో ఆమె సింహాసనము నలంకరించెను. ఆనాటి రాజకీయ వాతావరణము అప్రశాంతముగ నుండెను. అయినను ధైర్యము వీడక, ఆ విషమ పరిస్థితుల నెదుర్కొని తన రాజ్యమును శత్రువుల బారినుండి సంరక్షించి శాంతి భద్రతలు నెలకొల్పెను. రాణి మంగమ్మయే అప్పుడు లేకపోయినచో తంజావూరు నాయక రాజ్యమువలె, మధుర నాయక రాజ్యముకూడ త్వరలోనే పతనమై యుండెడిది. అనగా తెలుగువారి పరిపాలనాధికారము క్రీ. శ. 1706 తోనే అంతమై యుండెడిది. అట్లుకాక ఇంకను ముప్పది సంవత్సరములవరకు తమిళనాడులో తెలుగువారు పరిపాలింప గలిగిరన్నచో, ఆ కీర్తి మహారాణి మంగమ్మగారికి చెందుచున్నది.1

రాణి మంగమ్మ చొక్కనాథనాయనింవారి పట్టమహిషి. చొక్కనాథనాయనయ్య తంజావూరు పాలకుడగు విజయరాఘవరాయలతో సఖ్యసంబంధము నేర్పరచుకొను తలంపుతో అతని కుమార్తెను వివాహము చేసికొన నిశ్చయించెను. తద్విషయమును చొక్కనాథనాయనయ్య ఒక ప్రముఖోద్యోగి మూలమున రాయలకు తెలియజేసెను. కాని రాయలా యుద్యోగిని గౌరవముగ చూడలేదట! మీదు మిక్కిలి అతని నవమానించెనట! విజయరాఘవరాయలు తన కొమరితను చొక్కనాథునికిచ్చి వివాహము చేయ నిరాకరించుటచే, కడపట ఇరువురికిని యుద్ధము సంభవించెను. ఆ యుద్ధమునకు మరికొన్ని కారణములున్నను, ఈ వివాహ విషయము కూడ ప్రబలహేతువులలో ఒకటియని విశ్వసింపబడుచున్నది. ఈ విషయమును కొన్ని చారిత్రక లేఖనములు కూడ స్పష్టము చేయుచున్నవి.2

విఫల మనోరథుడైన చొక్కనాథుడు విజయరాఘవరాయలతో యుద్ధమునకు సన్నద్ధుడై, ఆ యుద్ధభారమును దళవాయి సముఖము వెంకటకృష్ణప్ప నాయకుని పైనను, దేశాధ్యక్షుడు చిన్నతంబి మొదలి పైనను వేసెను. సముఖము వెంకటకృష్ణప్పనాయకుని నాయకత్వముక్రింద మధుర సైన్యములు తంజావూరుకు చని కొలకొలుపు తంజావూరి దుర్గమును ముట్టడించెను. అప్పుడు వెంకటకృష్ణప్పనాయకుడు రాయలను సందర్శించి చొక్కనాథునితో సఖ్య సంబంధము నేర్పరచుకొనుట శ్రేయస్కరముగ నుండుననియు, లేనిచో అనర్థములు వాటిల్లుననియు సవినయముగ విన్నవించెను. కాని పూర్వ వైరములను మనసునందుంచుకొన్న రాయలు మధుర దళవాయి మాటలను పెడచెవిని బెట్టెను. అందువలన మరల మధుర సైన్యములు దుర్గమును ముట్టడించెను. తంజావూరి పక్షమున దళవాయి రంగప్పనాయుడు, వీరబాణం చిన్నరామయ్య మున్నగువారు శత్రువుల నెదుర్కొనిరి. ఉభయులకు కడపట భయంకరమగు సంగ్రామము జరిగెను. ఇరుపక్షములందును విపరీతముగ నష్టమేర్పడెను. 'కొందరు

---

*1. Her vigour and diplomacy gave the Nayak kingdom a longer tenure of life than it would otherwise have had.*

*Satyanatha Iyer "The History of the Nayaks of Madura"*

2 తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర.

మధుర రాజైన తిరుమలరాయని చరిత్రము.
(ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము, మదరాసు.)

చాలా గాయాలు తీసుకొనినారు. కొందరు దప్పి తాళలేక క్రిందపడి పొర్లాడుచున్న కొల్వులుగా వచ్చే రక్తాన్ని జలము అని భ్రమచేత పానం చేసినారు.'[1] తుదకు తంజావూరు దుర్గము దళవాయి వేంకటకృష్ణప్ప నాయకుని హస్తగత మయ్యెను. అప్పటికిని మధుర దళవాయి అచ్యుత విజయరాఘవరాయలను సమీపించి పెండ్లివిషయమును ప్రస్తావించెను. అపుడు రాయలు దైవధ్యానమున నుండెను. అతని కుమారుడు మన్నారుదాసుకూడ తండ్రి దగ్గరనే యుండెను. తంజావూరు ముట్టడింపబడినప్పటికిని రాయలు మాత్రము తన కుమార్తెను చొక్కనాథుని కిచ్చి వివాహముచేయ నిరాకరించెను. ఈ హేతువుచే భగవద్ధ్యానమున నున్న రాయలను మధుర సైన్యాధ్యక్షుడు తన కరవాలమునకు బలిగొనసాగెను. పిమ్మట మన్నారుదాసు కూడ హత్యగావింపబడెను. ఇటుల తండ్రి కొడుకు లిరువురును చంపబడిరి. ఈ విషాద విషయాదికము తంజావూరి యంతఃపురాంగనలకు తెలిసెను. అంత రాచకన్నియలంపదు ప్రాణత్యాగ మొనర్చిరి.

ఇటుల త్రిశిరఃపురమువారితో యుద్ధము ముగిసిన పిమ్మట చొక్కనాథనాయనయ్య చంద్రగిరి దూపకల్ కు చెందిన దళవాయి తుపాకుల లింగము నాయుని కుమార్తె మంగమ్మను వివాహము చేసికొనెను. ఈ విషయము 'మధురరాజైన తిరుమలరాయని చరిత్ర' మునందు దీర్ఘముగ చెప్పబడినది. "చంద్రగిరి తుపాకుల లింగమనాయుని వారి కుమార్తె మంగమ్మగారు మహా రూపయౌవన సౌందర్యవతియై యుండే వర్తమానం విని శ్రీ రాజా చొక్కనాథనాయనివారు తుపాకుల లింగమనాయని వారికి తన మనుష్యులనంపించి......మంగమ్మను వివాహం చేసుకొని"నారు. ఈ వివాహము తంజావూరు యుద్ధానంతరము జరిగెననుట స్పష్టము కావునను, తంజావూరుయుద్ధము 1674 సంవత్సరమున జరిగినందువలనను, చొక్కనాథ నాయనయ్య మంగమ్మను 1674-75 సంవత్సర ప్రాంతమున వివాహము చేసికొని యుండవచ్చును. కాని యీ నిర్ణయము సంశయాస్పదముగ నున్నది. చొక్కనాథనాయని మరణానంతరము అతని కుమారుడు (యువరాజ) ముద్దు వీరప్ప నాయనయ్య సింహాసనమునకు వచ్చెను. ఇతడు సింహపీఠ మలంకరించునాటికి సుమారు ఏడేండ్ల వయస్సువాడు. ఏడు సంవత్సరములు మాత్రమే ముద్దు వీరప్పనాయుడు రాజ్యము చేసినట్లు తెలియుచున్నది.[2] కనుక పదునాలుగు సంవత్సరములు మాత్రమే యితడు జీవించి యుండెనని చెప్పవలసి యున్నది. అయితే ముద్దు వీరప్పనాయడు మరణించునాటికి, అతని పట్టమహిషియగు ముద్దమ్మ గర్భము ధరించియుండెను. అనగా పదునాలుగు సంవత్సరముల వయస్సు వచ్చునాటికే యువరాజ ముద్దు వీరప్ప నాయనయ్య పిత్రుస్థానము నలంకరింప నర్హుడయ్యెనని నుడువవలయును. ఇదియే నిజమైనచో, 1674-75 సం॥ ప్రాంతమున వివాహము జరిగిన మంగమ్మగారికి 1675-76 ప్రాంతమున పుత్రోదయమైనట్లు చెప్పవలసి యున్నది. అసలు ముద్దువీరప్పనాయుడు మంగమ్మకు జన్మించినవాడు కాడేమో అని కొందరు తలచుచున్నారు. 1687 సం॥ మందు వేయబడిన యొక శాసనమున ముద్దమ్మ యను నామె ముద్దు వీరప్పనాయుని తల్లిగా చెప్పబడినది. కాని ముద్దు వీరప్పనాయనయ్య మంగమ్మగారి కుమారుడే యని యీ క్రింది యాధారమువలన సువిదిత మగుచున్నది.[3]

"చొక్కనాథ మహీంద్రుడు వారిఁ జచ్చిన
ప్రకటంబుగ నటు బలెఁ దన కొడుకగు
రంగకృష్ణ ముద్దు వీరాఖ్యుఁ డీల్గిన......"

ఇది యెట్లున్నను, యువరాజ ముద్దు వీరప్పనాయని కుమారుడు విజయరంగ చొక్కనాథనాయనయ్య పసిబిడ్డగా నున్నందువల్ల ఆయన అవ్వయైన మంగమ్మ బిడ్డను బిడ్డగా కూర్చుండబెట్టుకొని'[4] సంరక్షణకర్తగా మంగమ్మ రాజ్యము చేసెననుట సుస్పష్టము.

రాజకీయము లనిన మంగమ్మగారికిగల యాసక్తి నిరుపమానము. వస్తుతః చాల తెలివితేటలుగల మగువ ఆమె. తన తెలివితేటలతో గడించిన రాజకీయ విజ్ఞానమును జోడించి రాజ్యము చేసినది కావున, మంగమ్మ పరిపాలన దృష్ట్యా చిరయశస్సు గడించినది. చొక్క-

---

1 మధుర రాజైన తిరుమలరాయని చరిత్ర.
(చెన్నపురి ప్రా. లి. పు. భాండాగారము)

2. 7 సం॥లు రాజ్యము చేసెనని 'మదురైత్తల వరలారు' (తమిళము) నుడువు చున్నది

9 సం॥లు రాజ్యము చేసినట్లు మధుర రాజైన తిరుమలరాయని చరిత్రయందున్నది.

3 వికటకవి గోపాలరాయఁడు మంగమ్మపై నొక ప్రత్యేక గ్రంథము రచియించెను. ఆ గ్రంథమే 'మధురమంగాపుంశ్చలీలీలావిలాసము-' పయిపాదము లీ గ్రంథమునందలివి.

ప్రా. లి. పు. భాం మద్రాసు.

4 ఈ విషయము 'మదురైత్తల వరలారు'లోఁ గలదు. వివరములకు నా 'మధురానగర చరిత్ర'ను జూడుఁడు. (ఆగస్టు, 1952 భారతి)

నాథనాయని మరణానంతరము మంగమ్మ సహగమన మాచరింపకుండుటకు ఈ రాజకీయానురక్తియే ప్రబల హేతువని నుడువవచ్చును. కాని రాజకుటుంబములందు భర్తృ మరణానంతరము భార్య సహగమన మాచరించుట ఆనాడు పరిపాటిగ నుండెను. ఈ ఆచారము నుల్లంఘించి రాజ్యమేలినవన్న మంగమ్మగారు మహా సాహసురాలనియు, సంస్కరణాభిలాషిత్వము కలదనియు చెప్పుటకు అత్యుక్తి కాదు. కానేరదు కూడ. గర్భవతిగానున్న తన కోడలు ముద్దమ్మ పతి మరణించినంతనే చితి నెక్కుటకు యత్నించినది. కాని మంగమ్మ యామెను వారించెను. అయినను పురుష సంతానము కలిగిన పిమ్మట, ముద్దమ్మ ఆత్మహత్య చేసికొని ప్రాణములు వీడెను. అనంతర మా శిశువునకు మూడు నెలలు రాగానే, అతనిని (విజయరంగ చొక్కనాథుడు) సింహాసనము నధిష్ఠింపజేసి మంగమ్మ యతని పేరున రాజ్యవ్యవహారములు స్వయముగా పర్యవేక్షింప జొచ్చెను. పరిపాలన దృష్ట్యా ఆమె విశేష విఖ్యాతి నార్జించినను కలుషితశీల యని విఖ్యాతితో సమానస్థాయిలో నున్న నపకీర్తిని గూడ గడించెను.

మంగమ్మగారు అధికారమునకు వచ్చునాటికి భారతావనిలో మొగల్ చక్రవర్తులు ప్రబలులై యుండిరి. దక్షిణాపథముకూడ వారి యధీనములో నుండెను. మైసూరు పరిపాలకుడును, హగలు సిగ్గలు రాయడునగు చిక్కదేవరాయ లంతటివాడే మొగల్ చక్రవర్తులకు సామంతుడై రాజ్యాధికారము చేయుచుండెను. తంజావూరు పాలకుడును సామంతుడుగానే వ్యవహరించుచుండెను. అందువలన గత్యంతరము లేక మహారాణి మంగమ్మయు మొగల్ సార్వభౌముల యాధిపత్యమును శిరసావహించెను. 1697 సం॥న మొగల్ సేనాని జుల్ఫికర్ ఖాను దక్షిణాపథమున కేతెంచినపుడు మంగమ్మ యతనికి బహుమానములు విశేషముగా నొసగి అతని యాదరాభిమానములకు పాత్రురాలయ్యెను. తుదకు మొగల్ సైన్య సహాయముతో కోల్పోయిన రాజ్య భాగములను గూడ మంగమ్మ సంపాదించెను. ఈవిధముగ ఆమె రాజ్య విస్తీర్ణత నుద్దేశించి పాటుబడుచున్న సమయమున మైసూరు చిక్కదేవరాయలవారి యాజ్ఞానుసారము దళవాయి కుమారయ్య (1690-94 సం॥ల ప్రాంతమున) తిరుచిరాపల్లిని ముట్టడించుటకు యత్నించెను. కాని మహారాష్ట్రులు మైసూరును ముట్టడించుటచే దళవాయి కుమారయ్య స్వదేశమునకు మరలిపోవలసి వచ్చెను.

తిరుమలశౌరి నాయకేంద్రుని కాలమునుండియు తిరువాంకూరు పరిపాలకులు పాండ్య (మధుర) మండలాధీశ్వరులయెడ వినయ విధేయతలు ప్రకటించుచు సక్రమముగ కప్పము చెల్లించుచుండిరి. ముద్దు వీరప్ప నాయని కాలమునగూడ వారు విధేయులై యుండిరి. కాని మంగమ్మగారి కాలములో తిరువాంకూరు నేలు రవివర్మ కప్పము చెల్లింప నిరాకరించెను. కావున మంగమ్మ దళవాయి నరసప్పయ్యను రవివర్మను శిక్షించుటకు తిరువాంకూరుకు పంపెను. నరసప్పయ్య చాల గొప్పవాడు. దళవాయి రామప్పయ్యవలె నితడును మహా స్వామిభక్తుడు. దళవాయి నరసప్పయ్య నాయకత్వముక్రింద మధుర సైన్యములు 1697 సం॥న తిరువాంకూరు ముఖ్యపట్టణము కోర్కుళమును ముట్టడించెను. రవివర్మ నరసప్పయ్యను ప్రతిఘటించెను. కాని లాభము లేదయ్యెను. ఈ విజయముతో తిరువాంకూరు మంగమ్మగారి హస్తగతమయ్యెను.

తిరువాంకూరు యుద్ధము ముగిసిన మూడు సంవత్సరములకు, అనగా, 1700 లో తంజావూరు పాలకుడు షహాజీ మధురకు చెందిన కొన్ని పట్టణములను ముట్టడించెను. ఈవిషయమును తెలిసికొన్న వెంటనే దళవాయి రామప్పయ్య ససైన్యముగ వెడలి తంజావూరు సైన్యములను ప్రతిఘటించెను. మంగమ్మ మొగలుల సహాయమునుగూడ పొందెను. ఈ యుద్ధములో తంజావూరి సైనికులు చాలమంది మృత్యువువాత పడిరి. తంజావూరి సైన్యము కొలరూన్ నదిని దాటునపుడు, దళవాయి నరసప్పయ్య యా సైన్యమును సంహరించి విజయము సాధించెను. కడపట తంజావూరు పాలకుడు నరసప్పయ్యతో సంధి చేసికొనెను. మధుర వారికి విజయము లభించినను అచిరకాలముననే యొక విచిత్ర సంఘటన మూలమున మధుర, తంజావూరు పాలకులు మిత్రులయిరి. మైసూరి చిక్కదేవ రాయలు విశేషవిఖ్యాతి నార్జించిన యుద్ధవీరుడే కాక బుద్ధికుశలతగల పరిపాలకుడును. కావేరీనదీ జలమును తన దేశమునకు తెచ్చుకొన నభిలషించి అతడు కావేరిపై నొక ఆనకట్ట నిర్మించెను. ఇది మధుర తంజావూరు పాలకుల కాగ్రహము కలిగించెను. అంత వారిరువురును కలసి చిక్కదేవరాయలను ప్రతిఘటింపదలచిరి. అంతలో వర్షములు విరివిగ కురియుటచే వల్లువలువచ్చి ఆనకట్టను ధ్వంసమొనర్చెను. కావున మధుర తంజావూరు పాలకులు యుద్ధమును విరమించిరి.

ఈవిధముగ అనేక పర్యాయములు శత్రువులబారి నుండి మధురను మంగమ్మ సంరక్షింపగలిగెను. 1698 సంవత్సరమున తిరుమల సేతుపతి విరుదవిరాజితు

డును, యరవదేశాధిపతియునైన కిళవన్ సేతుపతి మధురను ముట్టడించెను. కాని దళవాయి నరసప్పయ్య ప్రదర్శించిన ధైర్యోత్సాహములకు ఫలితముగ యరవ వీరులకు జయము లభింపలేదు. మరల 1702 లో మంగమ్మకును, కిళవన్ సేతుపతికిని యుద్ధము సంభవించెను. తంజావూరు పరిపాలకుడు ఈ యుద్ధమున మధురవారి పక్షము వహించెను. మధురను పలుమారులు యుద్ధములనుండి సంరక్షించిన దళవాయి నరసప్పయ్య ఆధ్వర్యమున మధుర సైనికులు యరవ వీరుల నెదుర్కొనిరి. కాని యరవవీరులు సామాన్యులు కారు. మహా బాహుబల సంపన్నులు. దురదృష్టవశాత్తు యుద్ధము ముగియకమునుపే దళవాయి నరసప్పయ్య వీరస్వర్గము నలంకరించెను. అంతిమవిజయము సేతుపతికే లభ్యమయ్యెను. ఈ విజయము ఫలితముగ కిళవన్ సేతుపతి పాండ్యమండలముతో గల సంబంధ బాంధవ్యములను తెగత్రెంపులు చేసికొని, యరవదేశము రామనాథపురము స్వతంత్ర రాజ్యమని ప్రకటించెను. నాటినుండియు తిరుమల సేతుపతి యధికారము దక్షిణాపథమునందు బాగుగ వ్యాప్తము కాజొచ్చెను. రామనాథపురమునకు చుట్టుప్రక్కల నున్న పట్టణములను కైవసము గావించుకొని సేతుపతి తన రాజ్య విస్తీర్ణమునకు పాటుబడెను. పిమ్మట 1709 సంవత్సరములో కిళవన్ సేతుపతి తంజావూరు సైన్యములతో పోరాడి విజయము పొందెను.

మంగమ్మగారి కపజయము కలిగినది ఒక్క సేతుపతితో గావించిన యుద్ధమునందే. దళవాయి నరసప్పయ్య సహకార సానుభూతులను సముపార్జించిన మంగమ్మ అపజయ మనుమాట నెరుగదు. ఒకతట్టు మొగలు చక్రవర్తులును, మరియొకవైపు మైసూరు పాలకుడు చిక్కదేవరాయలును, ఇంకొకప్రక్క తంజావూరు ప్రభువును, మరి యింకొకవైపు యరవదేశాధిపతి తిరుమల సేతుపతి బిరుదవిరాజితుడు కిళవన్ సేతుపతియు, వేరొకవైపు తిరువాంకూరు ప్రభువు రవివర్మయు—మంగమ్మ కాలములో మధురను కబళింపవలయునని తలచిరి. కాని మంగమ్మ ప్రదర్శించిన ధైర్యోత్సాహములును, సమయానుకూలముగ సంచరించిన విధమును, సహజముగ నామెకుగల తెలివితేటలును, రాజకీయానురక్తియు శత్రువుల యాటల నరికట్టినవి. లేకున్నచో రాణి మీనాక్షి కాలములో గాక, రాణీ మంగమ్మ కాలమందే మధుర నాయక రాజ్యము పతనస్థితికి వచ్చియుండెడిది. అందువలననే రాజకీయముగా రాణి మంగమ్మకు శాశ్వత యశస్సు లభించినది; ఆమె చరిత్ర వినువీధిలో ధ్రువతారవలె ప్రతిభాసించుచున్నది.

రాజకీయముగా మంగమ్మగారు సముపార్జించిన చిరయశస్సు ఒక యెత్తు, ఆమె చేసిన దానధర్మముల వలనను, ప్రదర్శించిన మత సహనమువలనను గడించిన శాశ్వతకీర్తి ఒకయెత్తు. ఆమె పొందిన రాజకీయ విజయములు కాలగర్భములో కలసిపోయినను, ఆమె కావించిన దానధర్మములు నేటికిని కీర్తి పతాకలై రెపరెపలాడుచు వెలుగుచునే యున్నవి. ఈ హేతువును పురస్కరించుకొనియే భారతావనిలో రాజ్యము చేసిన నారీమణులలో మంగమ్మ సాటిలేనిదని నుడువ వలసి వచ్చినది. మధుర నాయక రాజు లందరివలెనే, మంగమ్మకూడ మత సహిష్ణుతను ప్రదర్శించిన విశాల హృదయ. దేవాలయములకు దానధర్మములు విరివిగా చేసినట్లే, ఆమె మహమ్మదీయ, క్రైస్తవ దేవాలయములకును దానధర్మములు చేసినది.

మంగమ్మ మత సహిష్ణుతను పురస్కరించుకొని క్రైస్తవ మత ప్రచారకులు మత ప్రచారమును బాహాటముగ చేసికొనుచుండిరి. మహమ్మదీయులు కూడ మంగమ్మగారి యాదరాభిమానములకు పాత్రులై యుండిరి. 1692, 1701—సంవత్సరములలో ఆమె కొన్ని మసీదులకు దానధర్మములు చేసినట్లు మన కామె వేయించిన శాసనములవలన విదితమగుచున్నది. ఇట్లు మంగమ్మ మతసహనమును ప్రదర్శించుచు రాజ్యము చేయుచున్న కాలములో రామనాథపురమున నొక విచిత్ర సంఘటన జరిగెను. కిళవన్ సేతుపతి దగ్గరి చుట్టములలో నొకడు క్రైస్తవమతము స్వీకరించెనట! అతడే కిళవన్ సేతుపతికి పిమ్మట సింహాసనమునకు రావలసినవాడు. కనుక అతని మత స్వీకారము ప్రజలకు మిక్కిలి అసహ్యముగ తోచెను. క్రైస్తవ మతబోధకులవలన మున్ముందు మరెట్టి యరిష్టములు సంభవించునోయని తలచి యరవలు క్రైస్తవ మత ప్రచారకుల నిర్బంధింపసాగిరి. రామనాథపురమునను న్న చర్చినికూడ ధ్వంసము చేసిరట! దీనిని బట్టి చూచినచో, మంగమ్మ ప్రదర్శించుచు వచ్చిన మతసహనము నిరుపమానమని తెలియుచున్నది.

ఇక మంగమ్మగారు దేవాలయములకు గావించిన దానధర్మములను ప్రతిపాదించు [illegible] యింప జేసిన [illegible] ననేకములు. మధుర మీనాక్షీ సుందరేశ్వరాలయమునకును, [illegible] మునను న్న [illegible] స్తీశ్వర దేవాలయమునకును దానములు చేసినట్లు విదితమగుచున్నది. [illegible] వంటి మను స్థలమున మంగమ్మ యొక్క సత్రము కట్టించి దానికి భూదానముగూడ చేసెను. అట్లనే శివలూరు, తపంపట్టి మున్నగు స్థలములందును సత్రములును, ధర్మ

చావడులును, నిర్మించెను. పెక్కు ప్రదేశములందు చెరువులును బావులును త్రవ్వించినది. నేడు మంగమ్మగారు కట్టించిన భవనములలో కొన్ని ప్రభుత్వ కార్యస్థానములుగా నున్నవి. మధుర రైల్వే స్టేషను సమీపముననున్న సత్రము మంగమ్మగారి పేరున వ్యవహరింపబడుచున్నది. ఇట్టుల తమిళ నాడులో మంగమ్మగారి నామము మారుమ్రోగుచు నుండుట ఎంతయు సంతసింపదగిన విషయము. ఈమె దాన నిరతిని సుస్పష్టమొనరించుచున్న రుచికరములగు కొన్ని కథలు నేడును ప్రచారములో నున్నవి.

"ఒకనాడు విడెము వేసికొనుచు మంగమ్మ పొరపాటుగ ఎడమచేతితో వక్కపొడిని నోటిలో వేసికొనెనట. చేసిన తప్పును గ్రహించిన పిమ్మట, ఆమె ప్రాయశ్చిత్తము చెప్పవలెనని పండితులను ప్రశ్నింపగా వారామెను విశేషముగా దాన ధర్మములు చేయుమనియు, అదియే ప్రాయశ్చిత్తమనియు నుడివిరట. నాటినుండియు మంగమ్మగారు దానధర్మములు చేయ దొడగెనట!" ఇది విశ్వాస్యము కాదు. విలయాన మధుర నాయక రాజులెల్లరు దానశీలురు. ఇట్టి దాన నిరతి వారికి వెన్నతో పెట్టిన విద్య. అరుహన్నిబ్బర గండ పెరుద (డెబ్బదిరెండు పాళెములను జయించిన వాడు) విరాజిల్లిన శ్రీ విశ్వనాథ నాయనయ్య మొదలుకొని మధుర నేలిన కడపటి మహారాణి మీనాక్షి వఱకునుగల నాయక రాజులందరును దాన కర్ణులుగా ప్రసిద్ధికెక్కిరి. కావున పండితులు చెప్పిన నాటినుండియు మంగమ్మగారు దానధర్మములు చేయ మొదలిడెననుట హాస్యాస్పదముగ నుండును. మరి యొక మధుర గాథనుగూడ నుదాహరించుచున్నాను.

"రాజనీయమున విశేష విఖ్యాతి గడించిన మైసూరు చిక్కదేవరాయలు ప్రతినిత్యము తన ధనాగారములో కొంత ధనమును పదిలపఱచిన పిమ్మట నే యతడు మరియొక పనిని చూచెడివాడట. అతడట్టి దానశీలుడు. మరణానంతరము అతడు నరకలోకమునకు పోయెను. పిమ్మట కొన్నాళ్లకు యమభటులు ఆలోకనిని తీసికొనివచ్చుటకుమారుగా మరియొకనిని పొరపాటున నరకలోకమునకు తీసికొని వచ్చిరట. అతడు మైసూరు పౌరుడు. అంత చేసిన పొరపాటును గుర్తించిన యమభటులు ఆ పౌరుని మైసూరునకు పంప నిశ్చయించిరట. అప్పుడు చిక్కదేవరాయలు ఆ పౌరునితో తాను నరకమున పలుబాధలు పడుచుంటిననియు, అచిరకాలములోనే మధుర నేలుచున్న మంగమ్మగారు మరణించుననియు, ఆమె దాననిరతిని దేవలోకవాసులు వేనోళ్ళ పొగడుచున్నారనియు, కావున నామెకు ఘనమైన స్వాగతము లభించుననియు నుడివెనట. పిమ్మట నా పౌరుడు మైసూరునకు వచ్చి యావద్వృత్తాంతమును చిక్కదేవరాయల కుమారునికి తెలియజేసెను. నాటినుండియు నతడు దానశీలుడై దానధర్మములసంఖ్యాకముగా చేసి చిక్కదేవశౌరికి స్వర్గలోకప్రాప్తియగునట్లు చేసెనట!"

ఈ కథయందలి సత్యాసత్యములా సర్వసాక్షికే తెలియును. ఈ కథ కేవలము కల్పితగాథయని నుడువ వలెను. కాని మంగమ్మగారి దానశీలమును మైసూరు చిక్కదేవశౌరిగారి లోభగుణమును వ్యక్తముచేయు నుద్దేశముతో ప్రజలీ కథను కట్టియుందురు. కాళ్ళు చేతులులేని కట్టుకథయేయైనను, ఇది యానాటి తెలుగుల విశాల హృదయమును, దాన నిరతిని కన్నులకు కట్టినట్లుగా తెలియజేయుచున్న మధురగాథ. కాని యొక్క విషయము మాత్రము సుస్పష్టము. మైసూరు చిక్కదేవశౌరి మరణానంతరమే, అనగా 1706 లో మంగమ్మ మరణించెను.

ఈ దానగుణమువలననే మంగమ్మ చిరయశస్సును సాధించినది. ఇంకను మంగమ్మగారి విశిష్ట గుణములలో ముఖ్యముగా పేర్కొనదగినది ఆమె సంఘ సంస్కరణాభిలాష. మూఢ విశ్వాసములకును, దురాచారములకును పట్టుగొమ్మగానున్న ఆ కాలములో సంఘమును, సాంఘికాచారములను ప్రతిఘటించెనన్నచో మంగమ్మ మహాసాహసురాలనియు, దురాచారములందు విశ్వాసములేని మహిళయనియు నూహింపవలసియున్నది. పతి పోయిన వెంటనే చితి నెక్కుట యానాడు బహుళ ప్రచారము నందుకొనియున్న దురాచారములలో నొకటి. దీనిని ముఖ్యముగ రాజకుటుంబముల వారాచరించుచుండిరి. తంజావూరు విజయరాఘవరాయల మరణానంతరము, తంజావూరి అంతఃపురాంగన లెల్లరు చితి పేర్చుకొని, అందులోపడి మరణించిరి. మధుర నేలిన ముద్దు తిరుమలశౌరి నాయనయ్య (1623-59) మరణానంతరము, అంతఃపురముననున్న అతని ఇన్నూరుమంది భార్యలును సహగమన మాచరించిరట! అటులనే యఱవ దేశాధిపతియగు కిళవన్ సేతుపతి (తిరుమల సేతుపతి) మరణానంతరము అతని నలువదియేడుగురు భార్యలును సహగమన మాచరించిరట. వీనిని పురస్కరించుకొని చూడగా చొక్కనాథుని మరణమునకు పిమ్మట మంగమ్మ సహగమనమాచరింపకుండ, తరువాతి కాలమున రాజ్యమును చేసినదన్నచో ఆమె ఎట్టి సాహసురాలో మన మూహించుకోవలసినదే. మీదు మిక్కిలి

కోడలు ముద్దమ్మ (మూడవ ముద్దు వీరప్ప నాయుడు) సహగమన మాచరింప సన్నద్ధముకాగా మంగమ్మ యామెను వారించెను. పిమ్మట పురుషసంతానము కలిగినతోడనే ముద్దమ్మ ఆత్మహత్య చేసికొని ఏకపత్నీవ్రతుడును, 1 మహా ధర్మపరుడునైన తన భర్తను కలుసుకొనెను. ఇటుల మంగమ్మ సహగమనమునకు తాను తిలోదకములు వదులుటయేకాక తదాచారమును రూపుమాపుటకును యత్నించెనని నుడువదగును. 2

మంగమ్మ సంఘసంస్కారాభిలాషిత్వమును పై విషయములు చెప్పక చెప్పుచున్నవిగదా! ఈ చారిత్రిక విషయములేకాక జనసామాన్యము సతతము చెప్పుకొను కథ యొకటి మంగమ్మ సంస్కారప్రియత్వమునకు మెఱుగులు దిద్దుచున్నది.

"మధురానగరంలో పట్టునూలుకరణులను చేనేతపారిశ్రామికులున్నారు. వారు సదాచార సంపన్నులు. వారి యాచార వ్యవహారములు చాల వఱకు బ్రాహ్మణాల యాచార వ్యవహారములను బోలి యుండును. బ్రాహ్మణులవలె, వారును ఉపాకర్మ మాచరించుచుండిరి. ఆ విషయము నెఱిగిన మధురా నగరాధికారి వారిని శిక్షింపనెంచెను. పిమ్మట పట్టునూలు కరణులు నగరాధికారి నడతను మంగమ్మగారికి విన్నపము మూలమున తెలియజేసిరి. అప్పుడు పట్టునూలు కరణు లుపాకర్మాధికారము కలిగియున్నారో లేదో యను విషయమును తెలిసికొను నుద్దేశముతో మంగమ్మ యొక పండిత పరిషత్తు నేర్పాటు చేసెను. పండిత పరిషత్తు పట్టునూలుకరణాల పక్షమే పలికెను. తోడనే మంగమ్మగారొక పత్రమును పండిత పరిషత్తు నిర్ణయమును వ్రాయించి యా పత్రమును పట్టునూలుకరణుల కొసగెనట." ఈ విషయములన్నియు మంగమ్మ సంఘసంస్కారాభిలాషను తెలుపుచున్నవనుట అత్యుక్తి కాదు.

ఇంతవఱకు మహారాణి మంగమ్మగారి రాజకీయ జీవితమును, సంఘ సంస్కరణోద్యమ కృషిని గమనించితిమి. ఆమె వ్యక్తిగత జీవితమును పరిశీలించితిమేని మంగమ్మ కలుషితశీలయని నుడువవలసి యుండును. ఈమె జీవితము స్త్రీ జాతికే కళంకము నాపాదించునట్టిదిగా నున్నది. స్త్రీ మాత్రగా తోచదు. నీతి నియమములను, సిగ్గు బిడియములను విడనాడిన కామరూపిణి!

వికటకవి గోపాలరాయడను నొక కవి 1650-1700 ప్రాంతముల తంజావూరు, మధుర, ఆనెగొంది మున్నగు రాజ్యములందు జరుగుచున్న ఘోరములను, అసభ్య ప్రవర్తనములను, నీతి విదూర కృత్యములను విపులముగ నభివర్ణించుచు నొక గ్రంథము వ్రాసెను. "మధుర మంగా పుంశ్చలీ లీలా విలాస" మను నా గ్రంథనామము. 3 ఈ గ్రంథమును వ్రాసినంత కాలము గోపాలరాయడు తద్రచనా పాప పరిహారార్థము శ్రీరామ మంత్రము జపించుచుండెనట! ఈయొక్క వాక్యమే చాలును ఈ గ్రంథమందలి యసభ్యత నూహించుటకు. ... ... నపకృతి నందిన చిన వంగనయను కవి యుక్క డామెను బూతులు దిట్టుచు మధురమంగాపుంశ్చలీ విలాసమును, మంగమ్మ పంపకమును రెండు గ్రంథములను రచించెను. (జూలై భారతి, 1953 పుట 31.) కానియీ గ్రంథము వికట కవి గోపాలరాయనిచే వ్రాయబడినదని గ్రంథమునందే యుండుటచే, దీని కర్త చినవంగన కాదని నుడువవలసి యున్నది.

శ్రీ నేలటూరి వెంకట రమణయ్యగారు నుడివినట్లుగా మంగమ్మగారు ముఖ్యముగ నీ గ్రంథరచనకు కారణభూతురాలైనది. ఆమెకు భాషాభిమానమున్నట్లు

---

1 శ్రీ నేలటూరి వేంకట రమణయ్యగారు నుడివినట్లుగా నాడు "బహుకళత్ర పరిగ్రహణము, వేశ్యాంగనా గమనమును సిరిగలవారి లక్షణములు -" ఇక రాజుల విషయము చెప్ప నవసరమే లేదు. అట్టియెడ ఒక్క ముద్దు వీరప్పనాయడు మాత్రము ఈ అపవాదమునకు దూరముగ నున్నాడు. ఇతని ఏకపత్నీత్వమును నొక చారిత్రిక లేఖనము స్పష్టము చేయుచున్నది. "ధర్మపరుడుగాను మహాశూరుడుగాను ఏకపత్నీవ్రతుడుగను వుండుకొని యీ తొమ్మిది సంవత్సరములు బహుధాన్యము మొదలు వ్యయ సం॥ వర్కు రాజ్యం చేసి ఆపైని రాజారంగకృష్ణముద్దు వీరప్పనాయనివారు వైకుంఠప్రాప్తి పొందినారు ... ... ... పట్టపురాణి అయిన ముద్దమ్మగారు గర్భముగా నుండిరి....

2. సహగమనమును రూపుమాపవలయునని నిజముగా మంగమ్మ ప్రయత్నించెనని స్పష్టము చేయు నాధారములు లేవు కాని గర్భవతిగానున్న ముద్దమ్మ చితినెక్కినచో వంశాంకురములేకుండ పోవునేమో యను భీతిచే మంగమ్మ యామెను వారించినది. అయినను నీ యాచారమును రూపుమాపవలయునని మంగమ్మ తలచియుండియు, తుదకు సంఘమునకు భయపడి యూరకున్నదేమో!

3. మధురమంగా పుంశ్చలీ లీలా విలాసము చినవంగన యను కవికృతమని శ్రీ నేలటూరు వేంకట రమణయ్యగారు పేర్కొన్నారు.

నబడదు. కావున శిల్పాచార్యులను, నటవిట గాయ కులను పోషించియుండిన మంగమ్మ కవుల కాశ్రయ మొసగి వారిని కావ్యరచనకు ప్రోత్సహించి యుండ లేదు. అయినను జీవితములో కష్టము నెఱుఁగని సౌఖ్య మునే యెఱుఁగనట్టియు, నాటి రాజాస్థానములందు జరుగుచున్న ఘోరములనుఁజూచి భగ్నహృదయుఁడునైన గోపాలరాయకవి పుణ్యమా యని దుశ్చరితయగు మంగమ్మకూడ ఏదో యొక విధముగ ఆంధ్ర వాఙ్మయ ములో సముచితస్థానము సంపాదించుకొన గలిగినది.

"రూప యౌవన కళా సమేత" యైన మంగమ్మ తుపాకులవారి చిన్నది. తుపాకులవారు తోలుబొమ్మ లాటవాండ్ల సంప్రదాయమువారు. మంగమ్మ తల్లియు కలుషిత శీలయని తెలియుచున్నది. 1 "మీతల్లి తిరువ ళూరు లంజెలకెల్లా మేటిగా ఉన్నది దాగిలిముచ్చో నీవు దానికి పుట్టింది జగమరుగో -" ఈ విషయము లట్లుంచి, మంగమ్మ వ్యక్తిగత జీవితమును పరిశీలిం తము. ఈమెకు కోడెకాండ్రు చాలమందియుండిరి. వారిలో ముఖ్యులు నరసయ్య (దళవాయి నరసప్పయ్య యగునేమో) రంగయ్య, అచ్చయ్య (మంగమ్మ మంత్రి) మీనాక్షయ్య. మధురమంగా పుంశ్చలీ లీలా విలాసములో పేర్కొనబడిన విషయము లన్నిటిని నిచ్చట నుదాహరించుట సమంజసముగ నుండదు.

"శ్రీ రంగేశ్వర చింతిత దాయక !
సారంగ వరద శుభవిధాయక !
......    .....    ......
......    .....    .. ...
తెలియఁగ నిప్పుడు త్రిశిరఃపురమున
వెలసెడి వింతలు వివరించెదనొక
మంజరి కృతిగా ......
......    .. ...    .. ...
చొక్కనాథ మహీపుఁడు దాఁజచ్చిన
ప్రకటంబుగ నటుబలెఁ దన కొడుకగు
రంగ కృష్ణముద్దు వీరాఖ్యుఁ డీల్గిన
......    ......    ......
అంతఃపురమున నణకువ చేయక
చెంతటివారికి నింతా తెలియక

నరసని, రంగని, నయమగు తిమ్మని
నిరసపురాయస సాహసుల తెగల
పంకని, యలగోవిందుని, నిమితపు
బింకవచ్చయను బిసకామాక్షుని
రాఘవరావును రహి వెంకాజని
... ..    ......    ......

మంగమ్మ శీలమును గురించి యింతకంటె నధి కముగా వ్రాయ నవసరములేదు. ఈ 'మధుర మంగా పుంశ్చలీ లీలా విలాస' గ్రంథము మధుర నేలిన మంగ మ్మకు సంబంధించినదికాక, మధురయందలి మంగ యను నొక వేశ్యకు సంబంధించినది అను నొక సంశ యము గలదు. ఇదియే కనుక సత్యమైనచో మహారాణి మంగమ్మ సర్వ విషయముల సాటి లేని రాణియని నుడువవచ్చును. కాని మంగమ్మ మరణవృత్తాంతము కూడ కొంతవఱకు నామె కలుషిత శీలమునే బలపరచు చున్నది.

మంగమ్మగారి మనుమఁడు విజయరంగ చొక్క నాథ నాయనయ్య పెద్దవాఁడైన పిమ్మట రాజ్య వ్యవ హారములను స్వయముగా పర్యవేక్షింపసాగెను. అచ్చయ్య యను మంత్రికి మంగమ్మ వలపునేస్తముగా నున్న విషయమును గ్రహించిన విజయరంగ చొక్క నాథుఁ డామెను నామె నివసించుమందిరమునందే నిర్బం ధించి బాధించెనట ! తుదకామె మహారాణికి పట్టె డన్నముకూడ కరవయ్యెనట. అన్నములేక కృశించి పోయి, మధుర నేలిన మహారాణి మంగమ్మ కడపట గ్రుడ్డికము చెందెను. ఈ వృత్తాంతము మంగమ్మ కలు షిత శీలమును వ్యక్తమొనర్చుచున్నది గదా! కనుక మధురమంగా పుంశ్చలీ లీలావిలాసమున నుదాహ రింపబడిన విషయములలో కొంతవఱకైనను సత్య ముండునేమోయని నుడువవచ్చును.

మంగమ్మగారి వ్యక్తిగత జీవితమునువీడి, విశాల హృదయముతో నామె రాజకీయముగ సాధించిన విజయములను, సంఘ సంక్షేమదృష్టితో నొనరించిన మహత్కార్యములను (సత్రములు, చావడులు, మందిరములు మున్నగువానిని నిర్మించియు, చెఱువు లను బావులను త్రవ్వించియు నామె సంఘమునకు చిరస్మరణీయమైన సేవ యొనర్చెను) ప్రదర్శించిన మత సహనమును - పరిశీలించితిమేని మంగమ్మ సాటి లేని రాణి యని నుడువవచ్చును. ఏది యెట్లున్నను నేటికిని జనత సభక్తికముగ స్మరించుచున్న మధుర నేలిన మహారాణి మంగమ్మ నిజముగా ధన్యురాలే!

1. మంగమ్మ వ్యక్తిగత జీవితమునకు సంబంధిం చిన కొన్ని విషయములు నాకుఁ దెలియఁజేసిన శ్రీ తిమ్మావఝ్ఝల కోదండ రామయ్యగారికిఁ గృతజ్ఞుఁడను.

1. చూడుడు : *R. Satyanatha Iyer The History of the Nayaka of Madura."*

# గోదావరి



శ్రీ బొడ్డు బాపిరాజు

తల్లీ! గోదావరి! నీ
పిల్లలపై నెన్నిపగలు ప్రేరేచినవో?
ఇల్లూ వాకిలి వెల్లువ
కొల్లలుగా సుడిసి నవ్వుకొని పొంగితివే!

అల్పుల్ మానవులెంత? వారల భవిష్యంబెంత? మున్నీటిపెన్
వేల్పుం బట్టపురాణి వీవలిగి రావే కాక, ఈ గూళ్లు, ఈ
పొల్పుల్ పిచ్చుకగూళ్లుగా కరగిపోవో! ఈ మహానర్థ సం
కల్పం బేటికిగల్గె నేటికి? జగత్కల్యాణ సంచారిణీ!

చల్లని తల్లి! నీ చెరగుచాటున నిచ్చట పాడిపంట వ
ర్ధిల్లిన శ్రీ విహారములు, తీరములియ్యవి; చేడదృష్టముల్
చెల్లి, భవజ్జల ప్రళయలీలకు రంగములై ఎటుల్ కుమా
రిల్లుచు నున్నవో, అవధరింపుము స్వీయ క్రుధా కథానికల్!

అమృత స్తన్యములిచ్చి, కమ్మని ప్రవాహ శ్రావ్యగీతా నినా
దములన్ జోలలుపాడి, మంద పవనోద్యత్క్రీడ జోకొట్టి, కూ
రిమిమై పెంచిన క్షేత్రపుత్రికల వీరిన్ అన్నపూర్ణావతా
రములన్ రాక్షసవృత్తి నీ వరదపాల్ సల్పన్ మనస్సొప్పెనే?

పసిపాపల్, ముదివగ్గులున్, పశువులున్, పక్షుల్ జలోద్రేక సా
ధ్వసులై, కూడును గూడులేక విపులాభ్రచ్ఛాయ బాష్పార్ద్రమ్మృ
ద్వసుధాంకమ్మున నిల్చినారదె విషాదవ్యగ్రమానా కృతుల్
అసువుల్ నిల్చిన సాక్షులౌచు భవదత్యాచారముల్ వాకొనన్.

కూలినకొంప కట్టుకొనగూడు నొకింతట; జీవనమ్మ లే
కూలిన యా కుటుంబములు కోలుకొనన్ బ్రదుకెల్లచాలునో?
తేలవు పంటచే లిసుకదిబ్బలు త్రవ్వక; పోని, త్రవ్వినం
దేలిన దుఃఖదుర్దశలు తీరెనె, ఊళ్లవి వట్టి బీళ్లుగా!

వరుణ విరోధభావము లవగ్రహముల్ కలిగింప, కుంది వం
దురు టయినంతలో నిలువుదోపిడి దోచిన వీయపార దు
ర్భరములు ని యనుగ్రహము లంబిక! ఎన్నఁడో రామపాద సా
గరమున నాసకట్ట గలుగన్ మరిసాగున నీ ప్రతాపముల్?

ఏ గ్రహకూటముల్ మొనసి ఇంత ఘటిల్లెనో! రాష్ట్రభోగ స
మ్యగ్రములైన ఈ శుభదినాను భవమ్ముల గుండెలాగు నీ
యుగ్ర తరంగతాండవ మొహో! ఎదురయ్యెను.—— సాధుదేవతా
నుగ్రహముల్ శరించెనె అనుంగు తెనుంగుల వార్థిసుందరీ!

స్వాదుపయస్వి నీ! మధురసంస్మృతి తోచును భావవీధి, వి
ద్యాదయితుండు నన్నయయు - తత్కృత భారత - ముజ్జ్వల
ద్రసామోదముతోడ. మా తెలుగు భూముల కేడుగడైన పెద్ద ము
త్తైదువ వీవు; పాడియె దురాగ్రహముల్? అసుబావతారికల్!

దుడుకుం గిన్నెరసానియో, శబరియో తోడై నినుం ద్రోయగా
నడుగుల్ సాగక, ఎంతజాలివడి యందందాగి యుప్పొంగినన్
కడకిట్లీ స్వజనోగ్రమార్గములు ద్రొక్కన్ తప్పదోగాక, నిన్
గడు శాంతాకృతనిన్ ఎరుంగరటె అంకస్థాను లిన్నాళ్ళుగా!

జీవనమూర్తి వీవు తొలిజేసిన మేళ్ళవి కోటి గాలికిం
బోవక, నిల్చిపోవునిక ముద్రగ నీ ఒకకీడు తల్లి, గో
దావరి! నీ కృపా మధురధారలలో విషబిందువట్లు.—— నం
భావనసేయ ఆంధ్రుల తపఃఫలరూపము లీవు, కృష్ణయున్.
నీ యడుగు పసిడి యందెలు
మ్రోయగ స్వర్గమును విలిచె మునుపా సీమల్!
నీ యసివారుల నిపుడ
న్యాయముగా నలిగి నరకమైనవి జననీ!



# సిత్తణ్ణవాసల్ భిత్తి చిత్రాలు

అప్సరః కన్య

శ్రీ వేలూరి రాధాకృష్ణ

భారతదేశంలో చిత్రలేఖనం అనేక విధాలుగా సాధన చేయబడింది. చిత్రాలు కాగితాల మీదనే కాకుండా, కాగితం అనేది స్వరూపంలోనికి రాని అనాదికాలంలో, గోడలమీదా, కొండగుహల్లోనూ భావసందర్శనంకోసం విరివిగా రచించబడినవి. ఈ గోడలమీద చిత్రించే రచననే భిత్తి చిత్రరచన (Fresco Painting) అంటారు. ముఖ్యంగా ప్రాచీన యుగంలో మన భారత కళా వైదగ్ధ్యం శిల్పాలద్వారానే కాకుండా, భిత్తిచిత్రాల ద్వారాకూడా ప్రపంచం నలుమూలలా పాకింది. పూర్వకాలంలో భిత్తిచిత్రాలు, సారస్వతస్వారస్యం కోసం రచింపబడేవని వినికిడి. అందువల్లనే కాబోలు రాజశేఖర పండితుడు ఆయా చిత్రకారుల్ని కవులుగానూ, పండితులుగానూ కొనియాడినాడట. ఆవిధమైన చిత్రరచనకు ఆయన 'చిత్రలేప్యకృతి' అని పేరు పెట్టాడట. రాజశేఖరుని సాహిత్యమీమాంసలో, ఈ 'చిత్రలేప్యకృతిని' గూర్చి ఎంతో వ్రాయబడిందిట.

'ముద్రారాక్షసము' అనే సంస్కృత నాటక గ్రంథంలో ఆకవి భిత్తి చిత్రరచనను గూర్చి కొంత అపోహపడి 'పైవేయం మమ చిత్రకర్మరచనా భిత్తిం వినా వర్తతే' అని వ్రాశాడట! ఆ అపోహ ఎందుకు కలగవలసివచ్చిందో, అప్పటి పరిస్థితులకు వదిలివేయవచ్చును.

అసలు భిత్తి చిత్రాల చరిత్రనుగూర్చి మనం తెలుసుకోవలెనంటే, అజంతా, బాగ్, రామగర్ గుహలలో రచించిన చిత్రాలే ప్రాతిపదికగా తీసికోవాలి. ఇంతకన్న ప్రాచీనమైనవి ఉండవచ్చును. వాటి ప్రాముఖ్యత అంత వెల్లడి కానందువల్ల, ముఖ్యంగా పైనుదహరించిన గుహలలోని భిత్తి చిత్రాలవిషయమే మొదటగా ఎత్తవలసి వచ్చింది. మొదటిదైన అజంతా భిత్తి చిత్రాలశోభ, విన్నాణం మనకందరకూ ఎక్కువగా తెలిసినదే. మిగతా రెంటివిషయం నైపుణ్య విమర్శనలో తరువాత ప్రస్తావించవచ్చును. ఈ మూడూకాక దక్షిణాదిన వెలయించిన భిత్తి చిత్రాలు చాలా ప్రశంసాపాత్రమైనవీ అజంతా చిత్రాలతో సరితూచతగినవీను. అవియే సిత్తణ్ణవాసల్ భిత్తి చిత్రాలు. ఇంకా పరిశోధన చేసి కనుగొంటే ఇలాంటి అద్భుత కళా పూర్వస్థలాలు పూర్వ దక్షిణాపథాన మగధ కళింగ రాజ్యాలలో ఎన్నైనా కనుగొనవచ్చునని నా ఆశ.

ఈవిధమైన భిత్తి చిత్రరచనకు భావపోషణ నిచ్చింది క్రీస్తుశకానికి కొన్ని శతాబ్దాల పూర్వం భారతదేశంలో ప్రచారమవుతున్న జైన, బౌద్ధ శైవ

వచ్చితీరింది. బ్రహ్మమతంలో నెమ్మదిగా ఐక్యమయింది. అలాగే శైవమత ప్రచారం తమిళ గురువర్యుడైన 'మాణిక్క వాసగర్' చేత విశేషంగా చేయబడింది. ఈ విశేష ప్రచారంవల్ల జైనమతం పతనం కావలసివచ్చింది. ఆసమయంలోనే నటరాజు ప్రాదుర్భావం జరిగింది. ఆశివదేవుడు మహాశిల్పరూపంలో వెలసి ప్రపంచానికే జ్ఞానోదయం కళోదయంకూడా కలగజేశాడు! ఉత్తరభారతంలో వైష్ణవప్రచారం ఎంత విశేషంగా జరిగిందో, అంతవిశేషంగానూ, దక్షిణాన శైవమత ప్రచారం జరిగింది. ఈ శైవమతం ప్రజల హృదయాన్ని కరిగించేసింది. అప్పార్ సుందర మూర్తుల గానమాధుర్యంలో దక్షిణదేశమంతా పరవశమైంది. ఈ పరవశంలోని పరిణామమే దక్షిణాది కంచుప్రతిమల, కళారూపంలో గమనించవచ్చును. ఈకళాప్రతిభ ఈ మతౌన్నత్యం, మహేంద్రవర్మ పోషణ, పాలన, లోనే కలిగింది. మహేంద్రవర్మ తరువాత పాలకుడైన నరసింహవర్మకూడా కళనీ మతాన్నీకూడా ఎంతో పోషిస్తూవచ్చాడు. ఈ నరసింహవర్మ పాలనాసమయంలోనే అత్యద్భుత శిల్పాలతో విలసిల్లుతున్న ఇప్పటి 'మహాబలిపురం' అప్పుడు 'మహామల్ల'పురంగా నిర్మాణం అయింది. నరసింహవర్మకు మహామల్ల (గొప్పయోధుడు) అనే బిరుదం ఉంది.

సిత్తణ్ణవాసల్ గుహాలయం సంపూర్ణంగా భిత్తి చిత్రాలతో ఒకానొకప్పుడు అలంకరింపబడినా ఇప్పుడు ఆ మహాఆలయపు పైభాగానమాత్రం వర్ణ చిత్రాలు చెక్కుచెదరకండా యున్నవి—అనగా పైకప్పునా పై బురుజులమీదా రాతి స్తంభాల పై భాగాన పైకప్పున రచించిన చిత్రం ఎంతో వైశాల్యం కలది! అది పద్మమయ సరోవరం. ఆ పద్మాల మధ్య మత్స్యాలూ, హంసలూ, మహిషాలూ, ఏనుగులూ ముగ్గురు పద్మపాణులైన గంధర్వులూ చిత్రింపబడ్డారు. ఆముగ్గురి గంధర్వులలో ఇద్దరి శరీరవర్ణం ఎరుపుగా చిత్రించబడింది. మూడవ గాంధర్వునిది పసుపుపచ్చగా చిత్రించబడింది. వారి అభినయం వారివర్ణం,వారి ముఖాలలో ముద్రితమైన ఆనందము కళాకారుల సౌశీల్యాన్ని వేయినోళ్ల చాటుతున్నవి.



అర్ధనారీశ్వర.

మొత్తముమీద ఆ'పద్మసరోవరం' వర్ణసంకలనంలోనూ రేఖాచిత్రణలోనూ, భావప్రదర్శనలోనూ, ఎంతో ఉత్తమమైనదిగా కొనియాడబడినది. ముఖద్వారాన ఉన్న పెద్ద రాతిస్తంభాల బురుజులమీద చిత్రించిన 'పెనగొన్న పద్మాలు' ఎంతో సుందరమైనవి. స్తంభాలచుట్టూ అప్సరస్త్రీలతో అలంకరించారు. కుడివైపునున్న స్తంభంమీద చిత్రాలు పూర్తిగా జీర్ణమైనవిగాని అదృష్టవశాన ఎడమవైపునవున్న స్తంభం మీది చిత్రాలుమాత్రం చెక్కుచెదరలేదు. దానిమీద చిత్రించిన 'దేవదాసి' చిత్రం అతిమనోహరంగా వుంది. బహుశః మతాచార్యులవారికళలో 'దేవదాసి'కి స్థానం ఇవ్వటానికి ఒప్పుకున్నట్లున్నారు!

జైనమత సిద్ధాంతాన్నే కళాకారులు చిత్రించదలిచినట్లయితే 'అర్ధనారీశ్వర' చిత్రాన్ని చిత్రించేవారు కాదని నా అభిప్రాయం. ఈ మహాదేవుని చిత్రం అజంతా బాగ్ చిత్రాలతో పోల్చవచ్చును.

ఆచిత్రంలోని భావ సంపూర్ణత వర్ణసంకలనంలోని నేర్పూ, రేఖాగతిలోని శక్తీ అట్టిది. మహాదేవుడు జటామకుటాన్ని ధరించినవాడు. రెండు చెవులకు రెండు వేర్వేరు కుండలాలు అలంకరింపబడినవి. ఆకన్నులోని భావం, అతినిగూఢంగా మహాదేవుని సహజ దివ్యత్వాన్ని తెల్పుతున్నవి. మరొకచిత్రం గంధర్వుడు, పద్మపాణియై పైనుంచి పద్మసరోవరంలోనికి దిగుతున్నట్లు చూపబడింది. గంధర్వులనూ, అప్సరసలనూ చిత్రించటంలో ఆ కళాకారులకు అజంతా కళాకారులే సాటి! భౌతికం కానిదేదో ఆరేఖాగతిలో ప్రస్ఫుటంగా ద్యోతకం అవుతుంది. అప్సరసల జీవితమే ఒక నాట్యజీవితంగా అర్థమవుతుంది. ఆ సలలితమైన శరీరాలూ, ఆ అర్ధనిమీలిత నేత్రాలూ సంభ్రమపూర్వమైన అధరాలూ, నిగూఢమైన దివ్యతేజస్సునూ పరచింతనకు పురిగొల్పే విధానాన్ని తెలియబరుస్తవి: అందువల్లనే ఆ సమయంలోని శిల్పులే 'నటరాజు'ని సృష్టించగల్గా రనిపిస్తున్నది. 'దివ్యనటన'కు ఆదర్శమే 'నటరాజు'!

చిత్రసరళినిబట్టి అవి జైనమతావలంబనకు పురిగొల్పేవి కావనేది ఇందుమూలంగా తేలుతున్నది. చరిత్ర జరిగినప్రకారం జైనమత సమయంలో చిత్రనిర్మాణం జరిగినా శైవమతానికి దగ్గరగా ఉన్నట్లు చిత్రకారుల వాక్కునుబట్టి తేలుతున్నది.

మతవిషయ భేదాన్ని చరిత్రకారులకు వదిలివేసి భిత్తి చిత్రశోభనే మనం కొనియాడవలసినవారము. భిత్తి చిత్రశ్రేణిలో అద్భుతమైన వాటిలో ఒకదానినిగా సిత్తణ్ణ వాసల్ గుహాలయాన్ని చేర్చటంలో నాకేమాత్రం సందేహం లేదు...

---

# శుభాకాంక్ష

శ్రీ బులుసు వేంకటేశ్వరులు

సీ. సృష్టికిఁ బ్రతిసృష్టి చేసిన చండశా
 సనుఁడు గాధిజుఁ డాంధ్రజాతివాఁడు
గౌతమీనది నిచ్చి క్షామంబుఁ బోఁ బుచ్చి
 చనిన గౌతముఁ డాంధ్రజాతివాఁడు
బహుసూత్రకర్త ఆపస్తంబుఁడు ఋషీంద్ర
 చంద్రుండు మన యాంధ్రజాతివాఁడు
వివిధ వేదవ్యాస విదుఁడు విద్యారణ్య
 సంయమి మన యాంధ్రజాతివాఁడు
గీ. అద్భుతావహ విజ్ఞాను లనుపమాన
 శక్తియుతులైనవా రాంధ్రజాతివారు
 వారి స్మరియించి యుత్సాహవంతుఁడ వయి
 స్వీయరాష్ట్రమ్ము నేలుకొమ్మోయి! ఆంధ్ర!

శా. దానత్యాగపవిత్రతా గుణమహోదారంబు నీజాతి, వి
 జ్ఞానిశ్రేష్ఠులు మానిరాట్టులు మహాశౌర్యప్రసిద్ధుల్ కృపా
 నూనుల్ నీ దగుపూర్వులెల్ల, మహిలో నొప్పారు నాంధ్రా! యనూ
 చానంబైన భవన్మహత్త్వము, స్వరాష్ట్రం బేలుకో మేలుగన్.

మ. నిను నీజాతిని నీదుసంస్కృతిని నీనిర్నిద్రచైతన్యమున్
 వినుతప్రక్రియ నిల్పి నీకును జగద్విఖ్యాతిఁ జేకూర్చి మే
 లొనరంజేసిన యాంధ్రభారతికి భక్త్యుత్సాహ సంపత్తితో
 ఘనరత్నస్థగితప్రపీఠముపయిన్ గావింపు పూజాదులన్.
మ. తమ సర్వస్వము రాష్ట్రసిద్ధికయి స్వార్థత్యాగులై ధారపో
 సి మృతింగన్న మహానుభావులకు, వాసిన్ మాతృసేవన్ మహో
 త్తములై చేసిన పూర్వనాయకులకున్, తత్సిద్ధియైనట్టి యీ
 సుముహూర్తంబున నాంధ్రు లీయుఁడు నమస్సుల్ భక్తిశ్రద్ధాంజలుల్.

మ. వెలయుంగావుత! మాంధ్రరాష్ట్రము జగద్విఖ్యాతమై నూత్నశో
 భల నీనం గని సత్యధర్మ బహుసంపద్వృద్ధియున్ గల్గి, ని
 చ్చలు నాదర్శకమై సుఖావహమునై సర్వాంగసంపూర్ణమై
 యలరుంగాక! చిరంబుసన్ ఘనవిశాలాంధ్రమ్ము నిక్కమ్ముగన్.

నాగు ఎప్పటికీ రాడు. తను ఎన్నటికీ నాగుని చూడదు ఇక. రాంరాం...

కాని అనుకున్నదానికి విరుద్ధంగా జరిగింది. అది జరిగిన మూడోనాడు దీపాలు పెట్టే వేళకు 'నాగు' తిరిగొచ్చాడు. మునిమాపు చీకటి వేళ వచ్చాడు కనక ఆ పేటమందికి ఆ శుభవార్త తెలీలేదు. పొలాల్లో పని చేస్తున్న కొందరు ఆ నల్లేడ సీతారావమ్మగారి నాగాయ్ కాదూ; అంటం విన్నాడు కాని సమాధానమివ్వకుండా, వెనుదిరిగి చూడకుండానే వొచ్చేశాడు.

సమ్మెంలో 'నాగు'ని చూచిన సీతారావమ్మ ఒక్క క్షణం కాళ్ళు చేతులూ ఆడలేదు. అతనితో ఎప్పుడూ జీవితంలో మాట్లాడకూడదు అని నిశ్చయించుకుంది. ఎన్నాటికీ చూడను అనుకుంది కాని 'నాగు' తనంతటతానే వొచ్చాడు. రాక రాక నాలుగు సంవత్సరాలకు. ఇప్పుడతను పలకరించక పోతే ఎవరెఇంటికో నడిచాడు. ఎవరైనా గౌరవంగా ఆహ్వానిస్తారు...మర్యాద చేస్తారు. ఊరివారందరికీ అతనంటే గౌరవముంది. దూరంగా వున్నప్పుడు చాడీలు చెప్పుకున్నా ఎదరపడి 'ఏం నాగయ్యా, ఏం బాబాయి' అంటే ప్రతివాడికి పళ్ళు గనపడిచి గర్వం కలిగే మర్యాదిస్తారు.

ఆ అవకాశం ఇతరులకు కలగనిస్తే తననీ, తన కొడుకునీ ఆడిపోసుకుంటారు. ఇద్దరికీ పొత్తు లేదు కామాల్సు అనుకుంటారు. లోకుల చేత ఆమాట అనిపించుకోవటం ఏమిటి. ఏవైనా స్పర్థలువుంటే అవి తల్లీ కొడుకులమధ్య తాముతాము పరిష్కరించుకోవాలి గాని రచ్చకెక్కిస్తే...తన గౌరవానికే హాని అవుతుంది కుటుంబగౌరవానికే కేడు...

ఆలోచనలన్నీ ఒక్కసారి ఆమె మెదడులో తిరిగాయి. ఏమి తోచనిస్థితిలోకి వచ్చికూడా...

"ఈబంటికి వచ్చావాయేం" అనగలిగింది.

"అవునమ్మా" అన్నాడు నాగు.

వెంటనే కాళ్ళు కడుక్కోను నీళ్ళు తెచ్చింది.

నాగు స్నానం చేసి భోజనం చేశాడు. అధికంగా సీతారావమ్మ ఒక్క విషయంకూడా మాట్లాడ లేదు. అతనూ ముభావంగానే ఉన్నాడు.

పూర్ణమ్మ ఎక్కడో పసిగట్టిందో తెల్లవారేసరికి వచ్చింది. "ఏవమ్మ సీతమ్మ వొదినా...మాకు తెలిస్తే మేమేమన్నా కొరుక్కు తింటామనుకున్నావా ఏమి అబ్బాయిని. వొచ్చాడ్టగా. నాటమాత్రం చెప్పనూ లేదూ" అంటూ...ఆ కూనిరాగాలకు సీతారావమ్మ ఒళ్ళు మండిపోయింది.

ఉదయం లేస్తూనే అన్నాడు నాగు. "నువ్వు కూడా ప్రయాణం కావాలమ్మా!" అని.

"నేనెందుకురా" అన్నది సీతారావమ్మ...

"అక్కడ్నుంచి మార్చేశారు ... పెద్దాపురం స్టేషను అసిస్టెంటుగా చేరాలి. ఇదివరకున్నంత స్వేచ్ఛవుండదు. అయినా పెద్దఉద్యోగం, కాదన లేకపోయాను" అన్నాడు నాగు...

"ఇదవరకేలాంటిది కాదేమిట" అన్నది సీతారావమ్మ.

"ఇనప్పెట్టెలో పెట్టినట్టు ఉంటుంది. పాడు ఉద్యోగం" అన్నాడు. అది సీతారావమ్మకు సంతోషం అయింది. 'నాగు' ఇక ముందు వెనకటిలాగ అవకతవక పనులు చెయ్యటానికి వీలుండదుగదా?

ఎందుకో గాని పూర్ణమ్మకు పట్టరాని సంతోషం కలిగింది.



# ఆంధ్రుల చరిత్ర



శ్రీ రావెళ్ల హనుమంతరావు

తెలుగుదేశము - దీప్తికెంపగ
తెలుగు వెలుగులు - దిశలు నిండగ
తెలుగు తల్లిని - కొలువ దీక్షతో
తరలిరావోయ్ - తమ్ముడా!"

భాషాప్రయుక్తరాష్ట్ర విభజన సిద్ధాంతం ప్రకారం పరిపూర్ణమైన విశాలాంధ్రం ఏర్పడకపోయినప్పటికీ, అక్టోబరు ఒకటవ తేదీతో ప్రత్యేకాంధ్ర రాష్ట్రం ఏర్పడింది. "నస్తికంటే, మొల్ల మేలన్నట్లు" ఇప్పటికి దీనినే సంతోషంతో స్వీకరించుచున్నాం. నలభై సంవత్సరాలుగా ఆంధ్రప్రజలు చేసిన ఆందోళనలు-సాగించిన పోరాటాలు-ఒనరించిన ఆత్మబలిదానాలు. వీటన్నింటికి ప్రత్యక్షఫలితంగా కనుపించుచున్న ప్రత్యేకాంధ్ర రాష్ట్రాన్ని చూచుకొని మురుసుకొన్నాం. అక్టోబరు ఒకటవ తేదీన ప్రత్యేకాంధ్రరాష్ట్రం యేర్పాటుతో ఆంధ్రజాతి కొకరకమగు అసామాన్యమైన విశిష్టత యేర్పడింది. ఆంధ్రప్రజలంతా స్త్రీలు - పురుషులు-పిన్నలు-పెద్దలు-బాలగోపాలంఉత్సాహంగా ఉల్లాసంగా, వేడుకగా-కోలాహలంగా పండుగజరుపుకొన్న అక్టోబరు ఒకటవ తేది. ఈ సుసమయాన ప్రాచీనకాలంనాటి ఆంధ్రచరిత్రను గుర్తుకు దెచ్చుకోవడం ఎంతేని అవసరం

ఆంధ్రుల చరిత్ర చాలా ప్రాచీనకాలంనాటిది. పురాతనకాలంనుండియు ఆంధ్రుల చరిత్ర కొకరకమైన ప్రత్యేక విశిష్టతవుంది. ప్రత్యేక భాష-ప్రత్యేకమైన సాంఘికాచారములు-అనేకరకముల సత్సంప్రదాయాలు-కట్టుబాట్లు-నిత్య నైమిత్తికలు ఎన్నో విషయాలలో ఆంధ్రప్రజలొకవిధమగు ప్రత్యేకతను గలిగియున్నారు. "ఏదేశమేగినా! ఎందుకాలిడినా!" ప్రత్యేకంగా మన పంచెకట్టు కనుపింపజేస్తూనే ఉంటుంది. అలాగే బొట్టువిషయంలోనూ స్త్రీలు ధరించే నగలవిషయంలోనుమనకొక ప్రత్యేకత ఉంది.

ఆంధ్రుల చరిత్ర యీనాటిదిగాదు. "ఆంధ్ర" అనుపదం అతి ప్రాచీనగ్రంథాలలో సైతంవుంది. క్రీ. శ. పూర్వం సం|| 1000 కుముందే వ్రాయబడిన రామాయణ-భారత గ్రంథాలలో ఆంధ్రుల ప్రసంగం ఉంది. మహాభారత యుద్ధంలో ఆంధ్రులు కౌరవ పక్షం వహించినట్లుగా చరిత్రాధారంవుంది. అర్జునుని మనుమడైన జనమేజయునితో ఆంధ్రులు పోరాటం సలిపినట్లుగాగూడా ఉంది. రామాయణంలో కిష్కింధాకాండంలోగూడా ఆంధ్రుల ప్రసంగం ఉంది. అందుచేత ఆంధ్రులచరిత్ర యీ మధ్య కాలంనాటిదిగాదు. అది పురాణకాలం నాటిది.

రామాయణ-భారత గ్రంథాలకంటే అతిప్రాచీన గ్రంథమని చెప్పబడే ఐతరేయ బ్రాహ్మణమునందు గూడా "ఆంధ్ర" శబ్ద ప్రయోగం అతిస్పష్టంగా కనుపించుతోంది. పైన కనుపించుచున్న చారిత్రకాధారములనుబట్టి నేటికి షుమారు 4000 సంవత్సరాల క్రితమే ఆంధ్రులు ఒక ప్రత్యేక తెగగా హిందూదేశంలో నివసించుచున్నారని మనం గాఢంగా చెప్పకోవచ్చును. ఆంధ్రశబ్దం పుట్టుకనుగురించి, ఆంధ్రప్రజల పుట్టుపూర్వోత్తరాలను గురించి పురాణగ్రంథాలలోను, బౌద్ధ జాతక కథల్లోను ఒక్కొక్క దానిలో ఒకొక్కరకంగా చెప్పబడివుంది.

విశ్వామిత్రఋషి సంతానంలో తండ్రినిధిక్కరించిన కొడుకులు దక్షిణదేశానికి తరలివచ్చారని, వారు ఆంధ్రులకు పూర్వీకులని ఒక కథ చెప్పబడింది. బలిచక్రవర్తికి అంగ-వంగ-కళింగ-సుహ్మ-పుండ్ర- ఆంధ్రులనే ఆరుగురు పుత్రులు కలుగగా వారంతా ఆయా తెగలకు మూలకారకులైనారని మరొక కథ చెప్పబడింది.

ఈ కట్టుకథల్లోవున్న కల్పనలు, అసూయాభావంతో గూడిన ద్వేషాలు-అతిశయోక్తులను అలా వదిలేస్తే మనకొకవిషయం స్పష్టంగా బోధపడుతుంది. ఆంధ్రులు ఎన్నో వేల సంవత్సరాలక్రితమే వింధ్య పర్వతాలనుదాటి దక్షిణాపథంలోనికి ప్రవేశించారు. ప్రత్యేకమైనభాష-ప్రత్యేకములైన అలవాట్లు ఆం

గ్రులకున్నాయి. దక్షిణదేశంలోకి వచ్చినతరువాత యీ ప్రత్యేక స్వభావాలు-అలవాట్లు మరింత అధికంగా పెంపొందాయి. బలపడ్డాయి.

నేటికి సుమారు 4000 సంవత్సరాలకుపూర్వమే ఆంధ్రులు ఒక ప్రత్యేక తెగగావున్నారనే చారిత్రికాధారములున్నవన్నప్పుడు ఆకాలంనాటి ఆంధ్రుల పరిస్థితి ఏమిటనే ప్రశ్న వస్తుంది. ఈకాలానికి సంబంధించిన వివరాలు తెలుసుకునేందుకు సరియైనట్టి ఆధారాలేమీ లేవు. ఈకాలంనాటి ఆంధ్రుల చరిత్రనేగాదు. మరేచరిత్రనుకూడా మనం తెలుసుకోలేము. ఇది వేదకాలం. ఋగ్వేదం-యజుర్వేదం-సామవేదం - అథర్వణవేదం. ఈ వేదకాలాన్ని గురించి వ్రాయబడిన గ్రంథాలలోను, వేదాల్లోను ఆర్యులు-అనార్యులు అనే భేదములేగాని జాతి-మత భేదములు చూపబడిలేవు. వేదయుగానంతరం క్షాత్రయుగం యేర్పడిన తరువాత కొన్నికొన్ని రాజ్యాలున్నట్లు-రాజులున్నట్లు-వాళ్ళమధ్య యుద్ధాలుజరిగినట్లు మనకు చరిత్రలు కనుపించుతాయి. ఇది క్రీస్తుశకానికిపూర్వం 1400 సంవత్సరాలనాటి కాలం చరిత్ర. ఈసమయంలోనే రామాయణ యుద్ధాలు భారతయుద్ధాలు జరిగాయి. ఈకాలంనాటి చరిత్రలోకూడా యుద్ధచరిత్ర కనిపించినంత స్పష్టంగా మనకు ఇతరచరిత్రలు కనుపించవు. ఈయుద్ధంలోకూడా ఆంధ్రులు ఉన్నట్లు చరిత్ర చెబుతోంది. అయినా! ఉన్న దవరో! గాని పేర్లేమిటో! ఎంతెంత బలగాలతో ఏవిధంగా పోరాడినారో! మున్నగు వివరాలేవీ లేవు.

తరువాత సూత్రయుగం వచ్చింది. ఇది క్రీ. శ. పూర్వం 1000-500 సంవత్సరముల నాటిది. ఈ సూత్రయుగంలోకూడా జాతులకు సంబంధించిన ప్రత్యేకవివరాలంతగా లేవు. బ్రాహ్మణ క్షత్రియ-వైశ్య-శూద్రులనే కులాలవారు మాత్రమే వున్నట్లు ఈ కులాలుగూడా వారు వారు చేయుపనుల్నిబట్టే యేర్పడినట్లు ఉంది. ఈ సూత్రయుగం నాటికి బ్రాహ్మణులు సమాజంపై సంపూర్ణాధికారం వహించారు. కల్ప సూత్రములు-వ్యాకరణ సూత్రములు-షడ్దర్శనములు మున్నగు సూత్రములు సృష్టింపబడుట చేత దీన్ని సూత్రయుగమన్నారు. శ్రౌతసూత్రంలో యజ్ఞం చేయు సూత్రములున్నాయి. గృహ్యసూత్రంలో ప్రతిగృహస్థు ఆచరించవలసిన-అనుసరించవలసిన నిబంధనలతోగూడినసూత్రములున్నాయి. వేదములలోనున్న భాష అతి ప్రాచీనంగాను, అల్లిబిల్లిగాను వుండడంచేత శిక్ష-వ్యాకరణము-ఛందస్సు-జ్యోతిషము - నిరుక్తం-కల్పసూత్రమనే షడంగములతోగూడిన శాస్త్రాలు వ్యాప్తిలోకి వచ్చాయి.

కపిలుడు రచించిన సాంఖ్యము-పతంజలి రచించిన-యోగము-గౌతముడు రచించిన న్యాయశాస్త్రము-కణాదుడు రచించిన వైశేషికము-జైమిని రచించిన పూర్వమీమాంస-బాదరాయణుడు రచించిన ఉత్తరమీమాంస—వీటన్నింటికి వివిధరకాలుగా వ్యాఖ్యానాలు చేస్తూ బ్రాహ్మణుల సమాజంపై తమ అధికారం సుస్థిరమయ్యేట్లు బందోబస్తులు చేసుకొన్నారు. క్షత్రియులు-వైశ్యులు - శూద్రులంతా తమ చెప్పుచేతల్లో నిలబడివుండేందుకు కావలసిన సామగ్రిని బ్రాహ్మణులు తయారుచేసుకొన్నారు.

తరువాత బౌద్ధయుగం వచ్చింది. ఈయుగంలో బ్రాహ్మణులు - బ్రాహ్మణేతరులు మధ్య విద్వేషాలు పెచ్చుపెరిగాయి. వేదములు - మంత్రములు ఉచ్చరించుటకేగాదు, వినుటకుగూడా శూద్రుల కర్హతలేదనీన్నీ, వేద-మంత్రములు విన్నటువంటి శూద్రులచెవుల్లో సీసము కరిగించి పోయాలనీన్నీ బ్రాహ్మణులు శాసించారు. దీనికి వ్యతిరేకంగా బౌద్ధమత ప్రచారం సాగింది. ఆ ప్రచారంలో ఇలా వుంది. "వేదములవలనగాని - యజ్ఞములువలనగాని ప్రయోజనం లేదు. ప్రయోజనం వున్నా! లేకున్నా! దానిని పొందుటకు అందరూ సమానమైన అర్హులే అయివున్నారు." ఈయుగంనాటి ఆంధ్రుల చరిత్రగాని, మరితరజాతుల చరిత్రగాని మనకు స్పష్టంగా కనుపించదు. ఈ కాలంనాటి చరిత్ర వ్రాయబడివుంటుందని ఆశపడడానికి తగిన ఆధారాలు కూడా లేవు. ఎప్పటికైనా భూగర్భశాస్త్రజ్ఞుల పరిశోధనలవలన ఇలాంటి చరిత్రలకు సంబంధించిన రహస్యాలు బయటపడుతాయేమో చెప్పలేముగదా!

ఒకేఒకమాటలో చెప్పాలంటే! మౌర్య చంద్రగుప్తుని కాలంవరకు ఆంధ్రులచరిత్ర తెలుసుకొనేందుకు సరియైన ఆధారాలేమీ లేవనే చెప్పాలి. మెగస్తనీసు వ్రాసిన వ్రాతలనుబట్టిచూస్తే చంద్రగుప్తునికాలంనాటికే ఆంధ్రులు ఒక స్వతంత్రరాజ్యాన్ని యేర్పరచుకొని ఉన్నట్టుగా మనకు బోధపడుతుంది.

క్రీ. శ. పూర్వం 327లో గ్రీసుదేశపురాజైన అలెగ్జాండరు సింధునదినిదాటి ఇండియాపైకి దండయాత్రకు వచ్చాడు. "తక్షశిల" రాజ్యమేలుతూన్న "అంబి" యీయనకు సాయంచేయడంవలన ఆప్రాంత

మంతా అతిశీఘ్రంగా అచిరకాలంలోనే యీయనకు స్వాధీనమైపోయింది. తరువాత "జీలంనదిని" దాటగా "పురుషోత్తముడు" ఈయన దండయాత్రను ప్రతిఘటించాడు. ఈయుద్ధంలో పురుషోత్తముడు పరాజితుడైనప్పటికీ ఇద్దరికీ సమానగౌరవ ప్రతిపత్తిపై సంధి కుదిరింది. ఇళ్ళకు తిరిగిపోవాలనే ఆందోళన-సంచలనం సైనికుల్లో అధికం కావడంవలన ఇండియాలో అయిదారు సంవత్సరాలున్న పిదప అలెగ్జాండరు తిరిగి స్వదేశానికి వెళ్ళిపోయాడు.

అలెగ్జాండరు చనిపోయినతరువాత యీయన కొలువులో సైన్యాధ్యక్షులలో ఒకడుగానున్న "సెల్యూకస్" తూర్పుభాగంపై అధికారం వేసుకుని ఇండియాపై దండయాత్ర చేశాడు. ఈసమయంలో "చంద్రగుప్తుడు" పాటలీపుత్ర నగరాన్ని రాజధానిగా చేసుకొని మగధదేశాన్ని పరిపాలిస్తున్నాడు. చంద్రగుప్తునకు - సెల్యూకస్‌కు జరిగిన యుద్ధంలో చంద్రగుప్తుడు విజయాన్ని సాధించడంవలన సెల్యూకస్ తనకుమార్తెను చంద్రగుప్తునకిచ్చి వివాహం చేశాడు. అంతేగాక తాను జయించిన ప్రదేశాలను కూడా చంద్రగుప్తునకిచ్చేశాడు.

ఈసమయంలోనే "మెగస్తనీస్" అనే చరిత్రకారుడు కొంతకాలం పాటలీపుత్రంలో వున్నాడు. అప్పుడు మెగస్తనీస్ మనదేశానికి సంబంధించిన చరిత్రను కొంతవరకు వ్రాశాడు. హిందూదేశ శత్రువులు దాన్ని మనకు దక్కనీయకుండగా చేశారు. అదేగనుక పూర్తిగా మనకు దక్కివుంటే! మనచరిత్ర మనకు బాగా తెలిసివుండేది. మెగస్తనీస్ వ్రాసిన చరిత్రలలోదొరికినదాన్నిబట్టి చంద్రగుప్తునికాలంలో ఆంధ్రులు ప్రత్యేకరాజ్య మేర్పరచుకొని ఉన్నట్లు తెలుస్తుంది. 30 కోటలతోను, 1000 గజముల దళంతోను, 2000 అశ్వముల దళంతోను, 100000 కాల్బలంతోను అతిసురక్షితంగా ఆంధ్రుల రాజ్యమున్నట్లుగూడా తెలుస్తుంది.

చంద్రగుప్తుని అనంతరం కొన్నేండ్లకు మౌర్య సామ్రాజ్యానికి అధినాయకుడుగా అశోకుడు వచ్చాడు. ఆంధ్రులకు,అశోకునకు తరచుగా యుద్ధాలుజరిగినట్లు చరిత్రాధారాలున్నాయి. అశోకుడు కొంతకాలం యుద్ధాలు జేసినతరువాత శాంతమూర్తి అయ్యాడు. బౌద్ధధర్మ సిద్ధాంతముల ప్రచారంజేస్తూ ప్రజల్ని న్యాయంగాను ధర్మంగానూ పరిపాలించ పూనుకొన్నాడు. ఈ అశోకుని ధర్మచక్రమే ఈనాడు భారతప్రభుత్వపు చిహ్నంగా వుంది.

"అమరావతీ పట్టణాన శాస్త్రులు
విశ్వవిద్యాలయములు స్థాపించునాడు"

అశోకుడు బౌద్ధసందేశమును ఆంధ్రులకు వినిపించినట్లుగా ఉంది. అంతేగాకుండా కృష్ణానదీ తీరమునందున్న "అమరావతీ" నగరమందు విశ్వవిద్యాలయాన్ని స్థాపించిదానిద్వారా బౌద్ధధర్మాన్ని ప్రచారం చేసినట్లుగూడా వుంది. ఆనాడు తక్షశిల-నలందమున్నగు ప్రదేశాలలో విశ్వవిద్యాలయాలు ఏవిధంగా నున్నాయో, అదేవిధంగా దక్షిణప్రాంతంలో అమరావతీనగరమందు విశ్వవిద్యాలయం ఉన్నట్లు గ్రహించుకోవచ్చును. కృష్ణానదీతీరమందున్న ధరణికోట అమరావతీప్రాంతం ఎంతో అందంగానూ, ఆవాసయోగ్యంగానూ, విద్యనభ్యసించేందుకు అనువైన ప్రదేశంగానూ ఉన్నందున ఇచ్చట బౌద్ధులు విద్యాలయాన్ని స్థాపించారని భావించవచ్చును,

అశోకునిఅనంతరం మౌర్యసామ్రాజ్యంక్షీణించిపోయింది. చివరకు మౌర్యసామ్రాజ్యపు రాజును అతని సైన్యాధ్యక్షుడైన "పుష్యమిత్రుడు"చే క్రీస్తుపూర్వం 185లో చంపి మగధరాజ్యాన్ని స్వాధీనం చేసుకొన్నాడు. ఈ కుట్రలో బ్రాహ్మణులకు చాలా దగ్గర సంబంధం ఉంది. పుష్యమిత్రుడు ఆ సమయంలో బ్రాహ్మణోక్తంగా "అశ్వమేధయాగం" చేశాడంటే! ఈవిషయంలో బ్రాహ్మణులకువున్న పని శీఘ్రంగానే నిర్ణయించవచ్చును. పుష్యమిత్రుని వంశంలో కడపటివాడైన "దేవభూతి"ని అతనిమంత్రి "వసుదేవుడు" క్రీ. పూర్వం 63 లో చంపి రాజ్యమాక్రమించుకొన్నాడు. వీరిలో చివరివానిని క్రీ. పూర్వం 27 లో ఆంధ్రులు జయించారు. మగధ రాజ్యాన్ని స్వాధీనంచేసుకొన్నారు.

ఆంధ్రదేశాన్ని మొట్టమొదట పరిపాలించినవారు శాతవాహనులు. మగధరాజులపై యుద్ధాలు చేసింది, తుదకు వారిని ఓడించింది. శాతవాహన రాజులే. క్రీ. శ. పూర్వం 220 నుండి క్రీ. శ. 225 వరకు దాదాపు 450 సంవత్సరాలపాటు వీరు ఆంధ్రరాజ్యాన్ని పరిపాలించారు. "శాలివాహన శకం" అనే పేరుతో ప్రత్యేకంగా ఆంధ్రులకొక శకం ప్రారంభమైందిగూడా ఇప్పటినుంచే.

"శకపురుషుడా - శాలివాహను
శౌర్యసాహసులు - చాళుక్యుల
కాకతీయుల - కదన తలముల
కృష్ణరాయల - జైత్రయాత్రల
అరిభయంకరులై - నిపుణులై
అసమసాహస - మెసగస్థిరుల
గసిమసంగిన - తెలుగువీరుల
ఘనతిసాహిర - తమ్ముడా!"

ఆకాలంలో ఈ శాతవాహన రాజులకు మహారాష్ట్ర దేశంలోని "పైఠాన్" (ప్రతిష్ఠానపురం) రాజధానిగా ఉండేది. క్రీ.పూ. 220 నుంచి క్రీ.పూ. 28 వరకు శాతవాహనరాజులు ఉత్తరమహారాష్ట్రంలోని "రట్టికులు"తోను, కన్నడదేశంలోని "అభీరులు"తోను, గుజరాతులోని "శకపహ్లవులు"తోను, నిరంతరం యుద్ధాలు జరుపుతూండేవారు. అనేక సార్లు ప్రతిష్ఠానపురాన్ని కోల్పోవటం తిరిగి సంపాదించుకోవటం జరిగింది.

ఈ శాతవాహన వంశములో వరుసగా 30 మంది రాజులు రాజ్యాన్ని పరిపాలించారు. వీరి వంశాన్ని ప్రారంభంచేసిన మొదటివాడు "సిముఖుడు" కొన్ని కొన్ని చరిత్రలు వీనినే సిప్రకుడనియు, సింధుకుడనియు తెలియజేస్తూన్నాయి. సిముఖుని తరువాత ఇతని తమ్ముడు "కృష్ణుడు" రాజ్యాధికారంలోనికి వచ్చినతరువాత పశ్చిమంగా అరేబియాసముద్రంవరకు ఆంధ్రదేశం విస్తరించింది. ఈ సమయంలో మగధ రాజులైన శుంగ-కణ్వవంశజులకు, ఆంధ్రరాజులకు తరుచుగా యుద్ధాలు జరుగుతూండేవి. క్రీ.పూ. 170 ప్రాంతమున మగధ చక్రవర్తియైన పుష్యమిత్రుని కుమారుడు అగ్నిమిత్రునికిన్ని, ఆంధ్రశాతవాహనుల సామంతు వాండ్లికుడైన యజ్ఞసేనునికిన్ని గొప్ప యుద్ధం జరిగింది. ఈయుద్ధంలో ఆంధ్రులు జయించారు. ఈయుద్ధ ప్రస్తావన మహాకవి కాళిదాసు గారి "మాళవికాగ్ని మిత్రము"నందున్నది.

శాతవాహన రాజులలో 14 వ వాడైన "హాలుడు" దక్షిణపథమంతా జయించాడు. సింహళ దేశంమీదకు దండెత్తి ఆరాజును ఓడించటం, ఆ రాజకుమార్తెయైన లీలావతిని తీసుకవచ్చి ద్రాక్షారామంలోనున్న భీమేశ్వరాలయంలో పరిణయ" చేసుకోవటం, జరిగినట్లుగా "లీలావతి కావ్యం" తెలియజేస్తోంది. కవులకు ఆదరణ-కవిత్వానికి పోషణ ఈకాలంలోనే ప్రారంభమైంది. ఇతని ఆస్థానం నిరంతరం మహాకవుల పండితగోష్ఠితో నిండి వుండేది. "శాలివాహనగాథా సప్తశతి" గ్రంథ రచన ఇతనికాలంలోనే జరిగింది.

శాతవాహన రాజవంశములలో ఇరవయ్యోవాడైన "గౌతమీపుత్ర శాతకర్ణి" గొప్పకీర్తిని సంపాదించుకొన్నాడు. నాసికానగరంనందున్న ఒకానొక శాసనంలో ఇతని ప్రభావ మభివర్ణితమైవుంది. మహారాష్ట్రము-ఉత్తర కొంకణము-బేరారు-సూరతీ-కడియవాడి-మాళ్వా మున్నగు ప్రదేశాలను ఈ రాజు పరిపాలించినట్లుగా పైశాసనంలోనే ఉంది.

ఈరాజు తన కుమారుడైన "పులమాయి"నియువరాజుగాజేసి, యువరాజునకు ప్రతిష్ఠానపురాధికారమిచ్చి తాను ధాన్యకటకాన్ని రాజధానిగాచేసుకొని దక్షిణాపథమునంతా పరిపాలించాడు. కృష్ణానదీ తీరమందున్న అమరావతి కతిదూరంలోనున్న ధరణికోట (ధాన్యకటకం) నుంచి గోదావరి వరకు ఇతని సామ్రాజ్యం విస్తరించింది. ఇది క్రీ. శ. 78లో జరిగింది. ఇదే శాలివాహనశక ప్రారంభం. అందుచేతనే యీసంవత్సరం మనపంచాంగాల ముఖపత్రం మీద శాలివాహన శకం 1874 అనివుంది.

గౌతమీపుత్రశాతకర్ణి కృష్ణా-గోదావరి ప్రాంతాలలో రాజ్యాన్ని నెలకొల్పినతరువాత ఆంధ్రప్రజలు ఇతరప్రాంతాలకు అనేకసంఖ్యాకులుగా వచ్చేవారు. మహారాష్ట్ర ప్రాంతం కొండప్రాంతం. అక్కడ వర్షపునీటిమీద ఆధారపడి పంటలు మాత్రమే పండుతాయి. జనసంఖ్య వృద్ధి అవుతూన్నకొద్దీ తిండికొరతబాధలుకూడా అధికమవుతూండేవి. అందుచేత చాలామంది నదీతీరాలకు వచ్చేవారు. గౌతమీపుత్ర శాతకర్ణితరువాత పదిమంది శాతవాహనరాజులు ధరణికోటను రాజధానిగా చేసుకొని నాలుగుసంవత్సరాలకుపైగా ఆంధ్రదేశాన్ని పరిపాలించారు.

శాలివాహనరాజుల పరిపాలనలో ఆంధ్రదేశం బాగా అభివృద్ధిచెందింది. ఆరోజులలో తూర్పున చైనాతోను, పశ్చిమాన రోమను సామ్రాజ్యంతోను ఆంధ్రులు వర్తకవ్యాపారాలు సాగించారు. ఆ కాలపు రోమను నాణ్యములు ఆంధ్రదేశంలో అనేక చోట్ల దొరికాయి. "నానావిదేశ నౌకానీక విపులాశ్రయంబైన" రేవులనుగలిగి పడవలలో, నావలలో సముద్రగర్భమున సంవత్సరముల తరబడి పడియుండి ప్రయాణం సాగించి జావా-సుమత్రా-బోర్నియో-

మున్నగు వివిధదేశములలో తమవస్తుసామగ్రిని విక్రయించి స్వర్ణవాహినులచే ఆంధ్రమాత పాదపద్మములకు పూజలు చేశారు ఆంధ్రులు. కృష్ణానదీ తీరమున విశ్వవిద్యాలయాన్ని స్థాపించి ఈదేశములోనివారికే గాక ఇతరదేశస్థులకుగూడా విద్యాబోధనల నేర్పింపడంతో ఆంధ్రజాతి ఆకాలంలోనే సంస్కృతి-విజ్ఞానాలకు రూపురేఖలు దిద్దగల్గినది. మోటుపల్లి-ముఖలింగం మున్నగు రేవులనుండి బయలుదేరిన మనఓడలు సముద్రాలనుదాటి మన వస్తుసంపదలను, విజ్ఞానాన్ని ఇతరదేశాలకు తీసుకెళ్తుతూండేవి.

పులమాయి అనంతరం క్రీ. శ. 168 లో "యజ్ఞశ్రీ శాతకర్ణి" రాజ్యాధికారం వహించాడు. ఇతనికి రాజధాని ప్రతిష్ఠానమే. చీనా చరిత్రకారులు ఇతనిని "యజ్ఞాయ్" అని పేర్కొన్నారు. వారితనిని హిందూదేశపు చక్రవర్తిగానే వర్ణించియున్నారు. దీన్నిబట్టి ఆకాలంలో చీనా-జపాను బర్మా మున్నగు దేశాలతో ఆంధ్రులకు విశేషంగా వర్తకసంబంధాలుండేవనియు, ఇటువంటి వ్యాపార సంబంధాలు ఒక్క ఆంధ్రదేశంతోమాత్రమేవుండాటవల్లనే వారితనిగా "యజ్ఞాయ్"ని హిందూదేశ చక్రవర్తిగా వర్ణించియున్నారనిగూడా మనం భావించవచ్చును.

గౌతమీపుత్ర శాతకర్ణిరాజుగా ఆంధ్రప్రజలు కృష్ణా-గోదావరి ప్రాంతాలకు వచ్చేసరికి ఈప్రాంతంలో నాగులనేజాతివారు నివసించుచున్నారు. వారిభాష తెనుగు. తెనుగుభాష ద్రావిడభాషా కుటుంబంలోనిదని భాషా శాస్త్రజ్ఞులలో అత్యధిక సంఖ్యాకులు నిర్ణయించారు. స్థానికులుగానున్న నాగులు-క్రొత్తగావచ్చిన ఆంధ్రులుఅంతా కలసి నేటి ఆంధ్రజాతిగా రూపొందినారు. నాగుల తెనుగుభాష-ఆంధ్రుల నాటుకభాష రెండూకలసి ఆంధ్రభాషగా మారినవి. కృష్ణా-గోదావరి మధ్యప్రాంతం కేంద్రంగా ఆంధ్రదేశం అనేపేరు వాడుకలోకి వచ్చింది.

క్రీ.శ. మూడవశతాబ్ద ప్రారంభంలోనే ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యం విచ్ఛిన్నమయింది. ఇంతవరకు వీరికి సామంతులుగానున్న పల్లవులు-సాలంకాయనులు - బృహత్ఫలాయనులు - విష్ణుకుండినులు మున్నగువారనేకమంది తిరుగుబాటులుచేసి, పోరాటాలు సలిపి ఆంధ్రశాతవాహన సామ్రాజ్యాన్ని విచ్ఛిన్నం చేశారు. శాతవాహనులతరువాత అధికారంలోకి వచ్చినవారు అంతకుముందుకాలంలో వారికి సామంతులుగా నున్నవారలే.

మళ్ళీ తిరిగి వీరిలో వీరికి యుద్ధాలుజరుగుతూండేవి. ప్రక్కనున్న చోళులతో, కళింగులతో, మహారాష్ట్రులతో యుద్ధాలు జరుగుతూండేవి. ఈకాలంలోవిష్ణుకుండినులే అధికంగా విజయలక్ష్మిని పొందుతూండేవారు.

వీరిలో చివరివాడైన విష్ణువర్ధనుడు క్రీ. శ. 630లో స్వతంత్రుడై చాళుక్యవంశానికి మూలపురుషుడయ్యాడు. ఈరాజులలో 14వ వాడైన చాళుక్యభీముడు క్రీ. శ. 888 లో అధికారంలోనికివచ్చి 30 సంవత్సరాలు దిగ్విజయంగా రాజ్యాన్ని పరిపాలించాడు. ఇతనిపుత్రుడైన విజయాదిత్యుడు కళింగము నేలుచున్న రాజులనుగూడా జయించాడు.

ఈసమయమందే ఆంధ్రదేశంలో "నాగార్జునుడు" జన్మించి ఆంధ్రుల కీర్తిచంద్రికలను దేశదేశాలకు వ్యాపింపజేశాడు. ఇతడు అతిచిన్న వయస్సులోనే వేద వేదాంగ పారంగతుడై, సర్వజ్ఞుడై, బౌద్ధమతమును స్వీకరించి గొప్ప బోధిసత్వుడనే కీర్తిని పొందాడు. కవీంద్రులకు - మునీంద్రులకు-తత్త్వవేత్తలకు-మంత్రవేత్తలకు- తార్కికులకు-రసవాదులకు చికిత్సకులకు ఇతడు శిరోభూషణమయ్యాడు. ఆనాటి ప్రపంచంలో రసవాదాన్ని సృష్టించింది ఈయనే. ఇది ఆంధ్రులకు గర్వకారణంగాదా? నాగార్జునకు సంబంధించిన గ్రంథముల నేకంగా టిబెట్-జపాను భాషల్లో నున్నట్లు మన చరిత్రకారులు వ్రాస్తున్నారు. ఇలాంటివి 20 గ్రంథాలుంటాయి. ఇతడు బుద్ధుని తరువాత బుద్ధుని అంత గొప్పవాడు. ఇతడు స్థాపించిన సంఘారామ మహావిద్యాపరిషత్తు దేశదేశాలకు సర్వకళలను వదజల్లినది. గుంటూరు జిల్లాలో మాచెర్లకు 15 మైళ్ళ దూరమందు యీ మహనీయుని పేరుతో నాగార్జునకొండ నిలచి నేటికిని చరిత్రకారుల మానసములందును-శాస్త్రవేత్తల హృదయములందును అశేషభావ పరంపరలను పుట్టించుచున్నది.

చాళుక్యరాజుల పరిపాలనా సమయంలోనే ప్రత్యేకంగా ఆంధ్రలిపి యేర్పడింది. చాళుక్యులు ప్రథమంలో జైనమతావలంబకులై తరువాత శైవమతదీక్షవహించారు. వీరిలో వీరపురుషుడనే రాజు పండ్రెండు సంవత్సరములలో "గంగకూటరాష్ట్ర"

రాజులనేవారిని 108 సార్లు జయించి 108 శివాలయములను నిర్మించెనని శాసనములు తెలుపుచున్నవి. దీన్నిబట్టి ఈకాలంలో మతసంబంధమైన యుద్ధాలు విశేషంగా జరిగినట్లు తేలిగ్గా అర్థమౌతోంది. రాజ్యాధికారభారం వహించినరాజులు ప్రజల సౌఖ్యముకొరకు కృషి చేయకుండగా మతయుద్ధాలతో కాలాన్ని గడుపుతూండేవారు. ఆకాలంలో వీరు జేసిన ఘనకార్యం శిల్పసంపద నభివృద్ధి జేయుట మాత్రమే. శిల్పసంపదను పోషించడం అవసరమే. అయినప్పటికీ దీనితోపాటు మిగతావిగూడా అభివృద్ధిజెందితే నేగదా! ప్రజలు సుఖపడేది.

10 వ శతాబ్దంలో రాజరాజనరేంద్రుని ఆస్థాన కవీంద్రుడైన "నన్నయ" మహాభారతమును ఆంధ్రీకరించడం ప్రారంభించాడు. ఈగ్రంథరాజంతోనే ఆంధ్రసారస్వతం మహోన్నతరూపం ధాల్చినదనేది జగమెరిగిన సత్యము. నన్నయ ఉత్తమజాతి కథకుడు. కథాగమనమునకు వక్రతగాని, సంకుచితత్వము గాని, అతివిస్తృతిగానిరానీక నూటిగా ప్రసన్నముగా కథను నడపగల దక్షుడు. నన్నయ తరువాతనే ఆంధ్రభాష అధికంగా ప్రచారంలోకి వచ్చింది.

చాళుక్యరాజుల పతనం 13 వ శతాబ్దం ప్రారంభంలోనే జరిగింది. వీరి పతనానంతరం తిరిగి వీరి సామంతమాండలికులే అనేక ప్రాంతాల కధినేతలయ్యారు. వీరిలో కాకతీయులు ముఖ్యులు.

కాకతీయుల పరిపాలనలో ఆంధ్రదేశమందు అనేకమార్పులొచ్చాయి. లింగాయత-వీర శైవమతములు విస్తరిల్లాయి. జైన - బౌద్ధములు గురించి ప్రచారం బాగాజరిగింది. సాహిత్యం ప్రజల అందుబాటులోకి వచ్చింది. శిల్పకళ పోషింపబడింది. సంగీతకళకొక రూపంవచ్చింది. కాకతీయ సామ్రాజ్యం నలుదిసలా పలురకాలుగా వ్యాప్తి జెందింది. క్రీ. శ. 1223 లో రాజ్యాధికారంవహించిన "గణపతి దేవులు" అన్నివిధాలా సమర్థులు. వీరికి పుత్రసంతానం లేనందున "రుద్రమాంబ"కు పట్టాభిషేకం గట్టారు. 1291లో "మార్కోపోలో" అను విదేశీయుడు మోటుపల్లిరేవులో ఓడదిగి కొంత కాలం ఆంధ్రదేశంలోవుండి దాన్ని అనేకవిధాలుగా వర్ణించాడు. ఇక్కడ దొరికే వజ్రాలనుగురించి, సన్నని పట్టునూలును గురించి అతడుచేసిన వర్ణన అనేకమందికి నోరూరజేసింది.

ఈ కాకతీయరాజులు 14 వ శతాబ్దం వరకు తమ పరిపాలనను దిగ్విజయంగా సాగించుకొన్నారు. వీరిలో కట్టకడపటివాడు ప్రతాపరుద్రుడు. ఇతను రుద్రమదేవికి మనుమడు. ఇతను దక్షిణహిందూదేశమున అనేకమంది రాజులను ఒడించాడు. ఈరాజుల యుద్ధాలే, ఈమతపోరాటాలే, ఆంధ్రుల యశస్సును నాశనంజేశాయి. ఆంధ్రులలో అనైక్యత నేర్పరచి పతనాన్ని గల్గించాయి.

"పసిడి పాతర మనది
పరుల నోరూరింది
మనలో మనకే బెట్టి
నెత్తి చేయెట్టారు"

సస్యలక్ష్మికి కళ్యాణనిలయమై, సౌఖ్యవంతమై, వాణిజ్య వ్యాపారాలకు విశేషం పేరొందినదై విరాజిల్లుతూన్న ఆంధ్రదేశంపై ఢిల్లీపాదుషాల కన్నుపడింది. కన్నుపడడమే తడవుగా దండయాత్ర ప్రారంభమైంది. ప్రతాపరుద్రుడు సురక్షితములగు ఓరంగల్లు దుర్గప్రాకారాంతర్భాగములనుండి మహమ్మదీయుల దండయాత్రలను ధైర్యంగా ప్రతిఘటించాడు. చివరకు క్రీ. శ. 1323 లో మహమ్మదీయులకు బందీయై ఢిల్లీకి తీసుకొని పోబడుతూండగా పారతంత్ర్యాగ్ని బాధలను సహించజాలక బలవంతంగా ఆత్మహత్య జేసుకొన్నాడు. ఈ సంఘటన ఆంధ్రరాజుల అనైక్యతను ఎలుగెత్తి చాటింది. వేలెట్టి చూపింది. ఈ అవకాశాన్ని వినియోగించుకొని మహమ్మదీయులు ఆంధ్రదేశంనంతటినీ ఆక్రమించుకొన్నారు. రెడ్డిరాజులు వారి ఆటలను సాగనీయలేదు.

మహమ్మదీయుల దండయాత్ర కేవలం రాజకీయ దండయాత్ర మాత్రమేగాదు. ఇది హిందూమతంపైననూ, హిందూసంస్కృతిపైనను, విశేషించి హిందూధర్మంపైనజరిపిన దండయాత్రగా రూపొందింది. ఆంధ్ర రాజులుదాన్ని అనుభవంలో గ్రహించారు. హిందూధర్మ మడుగంటిపోకుండా సంరక్షించుటకు, హైందవ ప్రభను పునరుజ్జీవింపజేయుటకు, ఆంధ్రయోధులు హిందూధర్మ రక్షకులనిపించుకొనుటకు తగినసమయం వచ్చింది. ఈ సమయంలో ప్రోలయ నాయకుడు—కాపయ నాయకుడు—హరిహరుడు—వేమారెడ్డి—సంగముడు మొదలగు అనేకమంది ఆంధ్రయోధులు విజృంభించి నడుములుగట్టి కత్తులుదూశారు. కర్ణాటక రాజైన "హోయిసబల్లాలుడు" గూడా ఆంధ్రరాజుల కండగా నిలబడ్డాడు.

 

ఇది ఢిల్లీ పాదుషాల కౌశ్చర్యాన్ని కల్గించింది. వారిలో భయోత్పాతాన్ని రేకెత్తించింది. అయినా వారు తమ పట్టుదలను విడువలేదు. సస్యశ్యామలమని-రతనాలసీమయని - లక్ష్మికి సతతం నిలయమని పేరు ప్రఖ్యాతులుగల ఆంధ్రదేశాన్ని ఆక్రమించుకోవాలనే భావం వాళ్లల్లో గాఢంగాపాతుకుపోయింది. యుద్ధాల ద్వారా సాధించలేని జయలక్ష్మిని చీలదీసి పాలించమనే కుతంత్రంద్వారా సాధించుదామని పన్నుగడలు పన్నారు. అందు కనుగుణంగా హరిహరరాయలు - బుక్కరాయల్ని ఉపయోగించుకోజూశారు. ఈ యిరువురు సోదరులు మొదట్లో మహమ్మదీయుల కనుకూలంగా ప్రవర్తించారు. తరువాత తెప్పరిల్లారు. మహమ్మదీయుల కెదురుతిరిగారు. తమ కర్తవ్యాన్ని నెరవేర్చుకున్నారు. అందుకనే మహమ్మదీయ చరిత్రకారులు వీరిని కృతఘ్నులనీ, ద్రోహులని నిందించారు.

శత్రుపక్షానికి చెందిన చరిత్రకారులు ద్వేషభావంతో ఏవిధంగా వ్రాసినప్పటికీ వీరుమాత్రం తమ కర్తవ్యాన్ని నెరవేర్చుకొన్నారు. విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించారు. ఇది అఖండవైభవోపేతంగా మూడు శతాబ్దాలకుపైగా వర్థిల్లినది. క్రీ. శ. 1421-1448 లో ప్రౌఢ దేవరాయలు రాజ్యమేలుతూన్న సమయంలో "నికోలైకోంటి" అనే ఇటలీ యాత్రికుడువచ్చి విజయనగరాన్ని ఎంతో ఘనంగా వర్ణించాడు. అబ్దుల్ రజాక్ అనే పారశీక రాయబారీవిధంగా అన్నాడు. "ఈ సామ్రాజ్యం దక్షిణ దేశమందు ఎక్కువమేర వ్యాపించివుంది. సముద్రతీరమందు మున్నూరు ఓడరేవులున్నాయి. నిరుపేద ప్రజలు సైతం నిత్యాభరణ భూషితులై వుంటారు."

తరిగి ఆంధ్ర దేశపు రాజులలో అంతర్యుద్ధాలు అధికమయ్యాయి. హరిహరరాయలు వంశంలో కడపటివానిని, సాళువ నరసింహరాయలు 1486 లో రాజ్యమునుండి తొలగించి సాళువవంశాన్ని అధికారంలోకి తెచ్చాడు. 1505 లో వీరిని తుళువ వంశంవారు ఓడించగా నరసనాయకుడు రాజయ్యాడు. క్రీ. శ. 1509 నుండి 1530 వరకు రాజ్యమేలిన శ్రీ కృష్ణదేవరాయలు తుళువ వంశానికి ప్రఖ్యాతితెచ్చిన మహాపురుషుడు. కృష్ణదేవరాయలు రణరంగ విజేత. రాజనీతిజ్ఞో విదుడు. గొప్పపండితుడు. సుప్రసిద్ధ ప్రబంధము "ఆముక్త మాల్యద"ను రచించిన మహాకవి. ఆబాలగోపాలం ఆంధ్రప్రజలంతా కృష్ణదేవరాయల చరిత్ర విశేషాలను ఏదో ఒకవిధంగా వినేవుంటారు.

ఈకాలంలో రాయచూరుదుర్గమును ఇస్మాయిల్ ఆదిల్షా ముట్టడించగా 1520 లో కృష్ణదేవరాయలు వాళ్లను ఓడించి ఆంధ్రుల పేరు ప్రతిష్ఠలను కాపాడాడు. ఈకాలంలో ఆంధ్రనాయకులు చోళ-పాండ్య రాజుల నోడించి తంజావూరు - మధురలలో తమ పరిపాలన నేర్పరచుకొన్నారు. ఇలాంటివారంతా విజయనగర రాజులకు సామంతులుగా నుండేవారు.

సదాశివరాయలు అధికారంలోకి వచ్చిన తరువాత 1565 తల్లికోటయుద్ధంలో మహమ్మదీయులు విజయం పొందడంతో విజయనగర సామ్రాజ్యం అంతరించింది. విజయనగరసామ్రాజ్యం పతనంగావడంతో ఆంధ్రుల ఔన్నత్యముయొక్క ఆఖరివెలుగు ఆరిపోయింది. ఆంధ్రప్రజల కీర్తిచంద్రికలు దివ్వమును హారతికర్పూరం వెలుగువలె ఆత్మార్పణ జేసుకొన్నాయి. విజయనగర రాజులకాలంలో ఆంధ్రప్రజల కీర్తి - స్వేచ్ఛలు సూర్య - చంద్రులవలె ధగధగద్ధావళ్యంతో తేజోవంతంగా భాసించినవి. 1565 తల్లికోట యుద్ధమందు అపజయాన్ని పొందడంతో ఆంధ్రప్రజల కీర్తి - స్వేచ్ఛలను రాహు - కేతువులు క్రమ్మేశాయి. ఇప్పుడిక చక్రవర్తులు నామమాత్రులయ్యారు. మహమ్మదీయులదోపిడి అధికమైంది. ప్రజలబాధలు వర్ణించ నలవిగాకుండా పెరిగాయి. ఆంధ్రుల విజ్ఞానం కూలద్రోయబడింది.

మొగల్ పాదుషాలు - గోల్కొండనవాబులు - ఔరంగజేబ్ - హైదరాబాద్ ప్రభువులు, అనేక పేరులతో అనేకమంది శత్రువులు ఆంధ్ర దేశాన్ని ముక్కలు ముక్కలుగా చీల్చి గుటకాయస్వాహా గావించారు. ఈవిధంగా ఆక్రమించుకోబడిన ప్రాంతాలలో చిన్న చిన్న సామంతరాజులను నియమించి వాళ్లద్వారా ప్రజలనుండి పన్నులు రాబట్టుకో ప్రారంభించారు.

మహమ్మదీయులు - తరువాత ఫ్రెంచివారు - ఆతరువాత ఇంగ్లీషువారు. వరుసగా ఆంధ్రజిల్లాలను ఆక్రమించేశారు. 1639 లో ఇంగ్లీషువారు చెన్నపట్టణం సందు తమకోటను కట్టుకొన్నారు. ఆనాడు చంద్రగిరిరాజులు ఇంగ్లీషువారికి కిలాంటి అవకాశాన్ని గలుగజేశారు. 1748 లో ఆర్కాటు నవాబుకు-నైజాం నవాబుకు వారసత్వం తగాదావచ్చింది. నైజాం

కనుకూలంగా ఫ్రెంచివారు - ఆర్కాటు నవాబుల కనుకూలంగా ఇంగ్లీషువారుఉండి యుద్ధాలను నడిపారు. ఈ సమయంలో ఫ్రెంచివారు నైజాంనుండి ఉత్తర సర్కారులపై పెత్తనాన్ని పొందారు.

ఫ్రెంచివారు తమతరఫున శిస్తులు వసూలుచేసేందుకు "బుస్సీ" దొరను పంపడం బొబ్బిలియుద్ధం జరగడం, ఈ చరిత్ర ఆంధ్రప్రజ లెరిగివున్న చరిత్రయే. 1764లో యూరప్ఖండంనందు ఆంగ్లేయుల ప్రభావం పెరిగింది. దానిఛాయలు ఇక్కడకూడా కనిపించాయి. ఫలితం 1800 సంవత్సరం వచ్చేసరికి ఉత్తరసర్కారులు ఆంగ్లేయుల స్వాధీనంలోకి వచ్చాయి.

ఇదేసమయంలో మైసూరు యుద్ధమందు ఆంగ్లేయులకు కల్గిన విజయంవలన టిప్పుసుల్తానునుండి బళ్లారి - అనంతపురం - కడపజిల్లాలను ఆంగ్లేయులు స్వాధీనం చేసుకున్నారు.

1565 తల్లికోట యుద్ధం తరువాత గుంటూరు - నెల్లూరు జిల్లాలు కొంతకాలం గోల్కొండ నవాబుల స్వాధీనంలో నున్నాయి తరువాత నైజాం నవాబులకు ఫ్రెంచివారికి - చివరకు 1770 నాటికి ఆంగ్లేయుల స్వాధీనంలోకి వచ్చేశాయి.

క్రీ. శ. 1775 లో కర్నూలు జిల్లాను హైదర్ స్వాధీనం చేసుకొన్నాడు హైదర్ నుండి యీజిల్లాను 1779 లో నైజాం పొందుకొన్నాడు. 1801 లో ఇది ఆంగ్లేయుల స్వాధీనంలోకి వచ్చేసింది.

కడప-కర్నూలు బళ్లారి-అనంతపురం చరిత్రల వలెనే చిత్తూరు చరిత్రకూడా నడిచింది. మొదట ఇది మైసూరు రాజ్యమేలుతూన్న "హైదర్ అలీ" చేతుల్లోకి వెళ్లింది. ఇతని కుమారుడు "టిప్పుసుల్తాను" అధికారంలో వుండగా నైజాంప్రభువు దీన్ని ఆక్రమించుకొన్నాడు. దానినుండి ఆర్కాటు నవాబులు లాక్కున్నారు. ఆతరువాత ఆంగ్లేయుల చేతుల్లోకి వెళ్లింది. మొత్తంమీద 1801 నాటికి ఆంధ్రదేశమంతా ఆంగ్లేయుల చేతుల్లోకి వెళ్లింది. 1639 లో ఇంగ్లీషువాళ్లు ఏ ఉద్దేశ్యంతో చెన్నపట్టణంపై అధికారాన్ని పొందారో, ఆ ఉద్దేశ్యం 1801 నాటికి నెరవేరింది.

హైదరాబాద్ లో దాదాపు కోటిమంది ఆంధ్రులున్నారు. దీనినే తెలంగాణం అంటారు. ఇందులో ఎనిమిది జిల్లాలున్నాయి. మెదకు-మహబూబ్ నగర్-నలగొండ-నైజామాబాద్ - వరంగల్ - ఆదిలాబాద్-కరీంనగర్ - అత్రఫ్ బల్దాలు ఇవి తెలుగు జిల్లాలు. ఇలాగే మైసూరు సంస్థానంలో-బస్తరు సంస్థానంలో ఒరిస్సాలో ఆంధ్రులు ముక్కముక్కలై పోయారు. తెలుగుదేశం ముక్కలు ముక్కలైంది!

అధికభాగం తెలుగుప్రజలు ఆంగ్లేయుల పరిపాలనకు లోబడివుండడంవలన వీళ్లను మద్రాసు రాష్ట్రంలో కలిపేశారు. నైజాంనవాబు - ఆంగ్లేయులు ఇద్దరూకలసి కుట్రపన్ని యీ పనిని చేశారు. ఆంధ్రులంతా ఒకేచోటవుంటే, ప్రమాదమని ఆలోచించే వాళ్లీపని చేశారు.

1801 లో ఇంగ్లీషువాళ్లు తెలుగురాజ్యాన్ని సంపూర్ణంగా ఆక్రమించుకొనేనాటికి మొత్తం హిందూదేశమే వాళ్లస్వాధీనమైపోయింది. ఎక్కడో నామమాత్రంగా సంస్థానాలున్నాయి. వీళ్లుకూడా ఇంగ్లీషువాళ్లకు లోబడే వున్నారు. ఇంక కొద్దిగా ఫ్రెంచివారి పరిపాలనక్రింద - గోవావారి పరిపాలన క్రిందవుండె. ఇప్పటినుండియు ఇంగ్లీషువాళ్లు నిర్మాణ కార్యక్రమాన్ని ముమ్మరంగా సాగించడం ప్రారంభించారు.

దేశంలో క్రైస్తవ మతప్రచారాన్ని విరివిగా చేసుకోవడం ప్రారంభించారు ఇందుకుగాను జీతలతో కొందరిని నియమించారు. ఇంగ్లీషు చదువు చెప్పేందుకు పాఠశాలలు, రోడ్లు - కాలువలు - ఆనకట్టలు వగైరా పనులు ప్రారంభించారు. ఈవిధంగా ప్రజలలో నూతన ఆశల్ని రేకెత్తించి తమరాజ్యాన్ని శాశ్వతంగా నిలుపుకోవాలని ఆశించారు.

ఆంధ్రదేశంలో 1852 సంవత్సరమునందు గోదావరి ఆనకట్ట ప్రారంభించబడింది. 1857 లో కృష్ణానదికి విజయవాడవద్ద ఆనకట్ట కట్టబడింది. 1860 లో పెన్నానదికి నెల్లూరువద్ద ఆనకట్ట కట్టబడింది. ఈ ఆనకట్టలు ఇందుకు తగిన కాల్వలును ఏర్పాటుచేసింది ప్రభుత్వం. ఈ పనులు చేయడంలో ప్రభుత్వం దూరదృష్టిని కనుపరచింది. ఈప్రాంతాల్ని సస్యశ్యామలం చేయడంద్వారా కొంతవరకు కరువు కాటకాలు పారద్రోలవచ్చును. ప్రజల్లో సానుభూతి సంపాదించవచ్చును. శిస్తురూపంలో ధనాన్ని గుంజుకోవచ్చును.

ఇలాగే రైల్వే విషయం కూడాను. 1888-11-1న మద్రాసునుండి నెల్లూరువరకు రైలునడచింది. 1893 7.15 న విశాఖపట్టణంవరకు వచ్చింది. ఇదే సమయంలో కాకినాడకుకూడా రైలులైను పడింది. 1889-10-3న గుంటూరుకు రైలునడిచింది. 1908-2-4న బందరుకు లైనుపడింది. ఇలాగే పెద్దవి-చిన్నవి అనేక లైన్లు తయారుచేయబడ్డాయి...

మొత్తం ఆంధ్రదేశంలో 2000 మైళ్ల పొడవున రైలుమార్గాలు వేయబడ్డాయి. 1255 మైళ్ల పొడవున కాలువలు త్రవ్వబడ్డాయి. 1885 మైళ్ల పొడవున్న ట్రంకురోడ్లున్నాయి. చిన్నచిన్న రోడ్లనుగూడా కలిపితే 15000 మైళ్ల పొడవుగల రోడ్లున్నాయి. 548 మైళ్ల పొడవున ఓడమార్గాలున్నాయి. ఓడలు - పడవలు - కారులు - లారీలు - రైళ్లు - వాగన్లు యథేచ్ఛగా తిరుగుతూన్నాయి.

వీటన్నిటిద్వారా లాభాల్ని పొందాలని, ప్రజలనుండి మెప్పులు పొందాలని, మనదేశంలోనున్న సిరిసంపదల్ని - ముడిపదార్థాలను - బంగారపు గనులను విదేశానికి తరలించుకపోవాలని ఇంగ్లీషువాళ్లు ప్రయత్నంతో పైపనులు చేశారు. ఇన్నీ చేస్తూన్నప్పటికి భారతీయులు కొంతకాలంవరకు కళ్లు తెరవలేకపోయారు. తరువాత యథార్థం తెలుసుకున్నారు. ఇంగ్లీషువాళ్లు తడిగుడ్డలతో భారతీయుల గొంతులు కోసుకొస్తున్నారని గ్రహించారు. అనేక సంఘటనల ఫలితంగా 1857 లో ప్రథమ భారతస్వాతంత్ర్య సంగ్రామం జరిగింది. ప్రజాశక్తుల సంఘటితసహాయం లేకపోవడంవలన, రాజులలో ఐక్యత రాకపోవడం వలన యీయుద్ధంలో ఆంగ్లేయులు విజేతలుగావడంతో 1858 నాటికి బ్రిటిష్ ప్రభుత్వానికి ఇండియాలో సుస్థిరత్వం యేర్పడినది. అనేకచట్టాలు అమల్లోకి తేవడం జరిగింది.

ఇంతమాత్రంతో భారతస్వాతంత్ర్య భానుడు - కీర్తిచంద్రుడు సంపూర్తిగా మాసిపోయారని అనుకోరాదు. భారతస్వాతంత్ర్య భానుడు తిరిగి దేదీప్యమానంగా వెలుగొందే అవకాశంవుంది. గనుకనే 1885 లో ప్రథమ కాంగ్రెసు మహాసభ జరిగింది. ఇరవయ్యోశతాబ్దం ప్రారంభంనుండియు దేశానికి స్వాతంత్ర్యంగావాలనే ఆందోళన, ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కావాలనే అలజడి బాగా పెరిగిపోయాయి. 1905 లో బ్రిటిషు సామ్రాజ్యవాదులు వంగదేశాన్ని విభజించినప్పుడు బ్రహ్మాండమైన ఆందోళన జరిగింది. ఇలాంటి సంఘటనలు ఆంధ్రులను మేల్కొల్పాయి. ఆంధ్రజాతిలో అణగిమణగియున్న శక్తులను పునరుజ్జీవింపజేశాయి. ఇందుకుఫలితంగా 1913 లో బాపట్లయందు ప్రథమ ఆంధ్ర మహాసభ జరిగింది. భారత స్వాతంత్ర్య పోరాటం - ఆంధ్రరాష్ట్ర విభజన గావాలనే ఆందోళన యీరెండూ ఆంధ్రప్రజల్ని ముందుకు నడిపాయి. ఈకాలంలో జరిగిన అనేక సంఘటనలు అందరూ ఎరిగినవే. 1947 ఆగస్టు 15 వ తేదీన ఇండియా స్వాతంత్ర్యాన్ని పొందింది. తరువాత ఆంధ్రుల దురదృష్టవశాత్తు ప్రత్యేకాంధ్ర రాష్ట్రంరాలేదు. పూర్వకాలంలో భారతస్వాతంత్ర్య ఆందోళన - ఆంధ్రరాష్ట్ర విభజనాందోళన రెండూ ఏవిధంగా పెనవేసుకొనిపోయాయో ! స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఆవిరెండూ అంతగా చీలిపోయాయి. అందుచేత ఆంధ్రప్రజలు స్వతంత్ర ప్రభుత్వంపై తీవ్రంగా పోరాటాలు చేయవలసివచ్చింది పొట్టి శ్రీరాములు మరణించడం, అనేకపోరాటాలు జరగడంతో 1953 అక్టోబరు 1 వ తేదీతో ఆంధ్రులకు ప్రత్యేకాంధ్రరాష్ట్రం వచ్చేసింది.

ఇక ఆంధ్రదేశం అభివృద్ధిలోకి రావాలి. నూతనోత్తేజంతో అభివృద్ధిమార్గాన పయనించాలి. అంటే! ఇతరప్రాంతాలను స్వాధీనంచేసుకోవాలని గాదు. ఆంధ్రదేశంలో సహజంగానున్న సంపదలన్నింటినీ ఉపయోగించుకొంటూ ఆంధ్రదేశం అభివృద్ధిలోకి రాగలదు. ఆంధ్రదేశంలో నాల్గుకోట్ల యకరాలకు పైగా భూమివుంది. గలగలా పరుగులుదీసే కృష్ణా - గోదావరి - పెన్న - తుంగభద్రా నదులున్నాయి. ఒడలు తెలియని పరవశంతో సుళ్లు తిరుగుతూ ప్రవహించే నదులకు అనేకచోట్ల ఆనకట్టలుకట్టి తెలుగు పొలాలకు నీళ్లను మరలింపజేసుకోవడంద్వారా తెలుగుదేశంలో బంగారుపంటలుపండించుకోవచ్చును. ఆయా ఋతుధర్మములననుసరించి సస్యానుకూలంగానూ, ప్రజానుకూలంగానూ ప్రవర్తించే శీతోష్ణస్థితులున్నాయి. వానాకాలం-ఎండాకాలం-శీతాకాలం. ఏదీకూడా ఆంధ్రదేశంలో మితిమీరి వుండదు గంజాం పురం మొదలు-చెన్నపట్టణంవరకు 600 మైళ్ల పొడవుగల సముద్రతీరంవుంది. తెలుగుదేశం ముఖ్యమైన రైల్వే లైన్లు - ట్రంకురోడ్లు - కాలువలు కావలసినన్ని వున్నాయి.

బంజరలు - పర్రలు - రోడారులు గాకుండా ఫలవంతములైన భూమిగలది తెలుగుదేశం. ఆహారప్పంటలు- వ్యాపారపంటలు - పప్పుదినుసులపంటలు- పళ్లపంటలు - సుగంధద్రవ్యముల పంటలు మున్నగు పంటలనేకంగా ఆంధ్రదేశంలో ఇప్పటికే పండుతూన్నాయి. ఇకముందు ఇంకా పండిచ్చుకోవచ్చును. తెలుగుభూముల్లో కావలసినన్ని ఖనిజపదార్థాలున్నాయి. అవకాశాలు గలుగజేసుకొంటే, లక్షల

కొలది కిలోవాట్ల విద్యుచ్ఛక్తి నుత్పత్తిచేయగల శక్తులున్నాయి. ఇవంతా ప్రకృతి ఆంధ్రప్రజలకొసగూర్చిపెట్టిన అపారసంపద. దీన్ని గ్రహించబట్టే అనాడు గౌతమీపుత్రశాతకర్ణి మహారాష్ట్ర ప్రాంతమునుంచి ఆంధ్రదేశానికి వచ్చాడేమోగదా!

విస్తారంగానున్న ఖనిజసంపదలు - వ్యాపారపంటలు - ఆహారపంటలు - విద్యుచ్ఛక్తి సాయంతో ఆంధ్రదేశాన్ని గొప్ప పారిశ్రామిక దేశంగా తయారుచేసుకోవచ్చును ఫలవంతమైన దేశంగా, పాడి-పంటలు సమృద్ధిగాగల దేశంగా తెలుగుదేశం దీప్తి చెందగలదు. ఇదంతా నూతనంగా అధికారంలోకి రాబోతూన్న పెద్దలు తీసుకొనే చర్యలమీద ఆధారపడివుంది. ఆహారపదార్థాల నధికంగా పండించుకోవడం - నూతన పరిశ్రమలు నెలకొల్పుకోవడం ఇవి జరిగినప్పుడు మనకు మరొక ప్రాంతం కావాలనే మాటెందుకొస్తుంది. ఆ మాటొచ్చినపుడు ఉన్నదాన్ని బాగుచేసుకోలేనపుడు లేనివాని ప్రాకులాడడం దేనికి? ఏవిధంగాజూసినా ఇతరప్రాంతాల ఆక్రమించేకోరిక వుండదు. తెలుగుదేశం ప్రత్యేకదేశంగా వుండాలనే భావంగూడా లేదు. అఖిల భారతావనిలో అదొకరాష్ట్రంగానే వుంటుంది. ఈనాడు ప్రత్యేకరాష్ట్రాన్ని పొందుతూన్న మనకు సోదరులైనవారు తెలంగాణాలో, మైసూరులో, బస్తరుసంస్థానంలో, ఒరిస్సాలో అనేకచోట్ల నివసించుతూన్నారు. ఈ ప్రాంతాలన్నింటినీ కలిపి విశాలాంధ్రం చేయాలి. ఇది జరిగితేచాలు. మన అన్నదమ్ములు, అక్క-చెల్లెళ్లు అందరూ అన్యోన్యంగా కలసిమెలసి బ్రతకవచ్చును. ఇదే ఆంధ్రుల కోరిక.





# మిల్లిగరిటె

శ్రీ పుత్రేవు సత్యనారాయణ



అవి నా చిన్నతనపు రోజులు, నాకు మాయింట్లో ఎవరన్నా ఇష్టంగానే వుండేదిగాని, మాబామ్మ మీద మట్టుకు చాలా కోపంగా వుండేది. మా బామ్మ మాత్రం నన్ను అభిమానంగానే చూస్తుండేది. అతి ప్రేమతో నన్ను దగ్గరకు తీసుకుని ముద్దులాడుతుండేది. అయినప్పటికీ నాకు మా బామ్మఅంటే కిట్టేదికాదు. ముఖ్యంగా మా బామ్మకీనాకూ భోజనం చేసేటప్పుడు నెయ్యి వడ్డన దగ్గర పేచీవస్తుండేది. ఇది ఒకరోజు కాదు, రెండురోజులు కాదు, ప్రతిరోజూ మాడు పూటలూ యీ విషయంలో మా బామ్మతో తగవు తప్పేదికాదు. మా యింట్లో మా తాతముత్తాతలనాటినుండీ వంశపారంపర్యంగా వస్తూ వుండిన ఆస్తిలో మిల్లిగరిటె ఒకటి. ఆ గరిటెతో ఎన్నిసార్లు నెయ్యి వడ్డించినా, వేసుకునేవాళ్లకి విసుగెత్తి, ఎంతసేపు చెయ్యిచాచి వుంచను అని సిగ్గుచెంది, 'చాలు' అనవలసినదేకాని, నిజానికి చెయ్యిమాత్రం తడి అయ్యేదికాదు. మా యింటిల్లిపాదికీ మా బామ్మ అంటె, భయం. ఆవిడ ఒక మారు ఆ గరిటెతో నేయి వడ్డించేసరికల్లా మావాళ్లంతా, చాలు, చాలు, అని అరుస్తూ చెయ్యి వెనక్కిలాగేసుకోవలసినదే. మాబామ్మ దగ్గిర అలాంటి కాయిదాకు అంతా అలవాటుపడే వున్నారు. కనుక వాళ్లకి బాధలేకపోయేది. కాని నాదగ్గరమాత్రం ఆరోజుల్లో మాబామ్మ ఆటలు ఎంతమాత్రం సాగేవికావు. ఒకరికొకరము ఎత్తుకుపైఎత్తు వేస్తుండేవాళ్ళమేకాని, ఆట ఎప్పటికీ కట్టుఅయేది కాదు. నేను మహా పెంకిడిప్పకాయనని మాబామ్మ అంటూవుండేది. ఇలాంటి పెంకిఘటం యిదివరకు మనవంశంలో ఎరగమ్రా అంటుండేది. అదివిని నేను చాలా గొప్పవాణ్ణిగానే భావించుకుని సంతోషించేవాడిని.

కంచంలో అన్నం పెట్టగానే మాబామ్మవచ్చి అందరితోపాటు ఒకగరిటెడు నెయ్యివేసి నా మొఖం వేపు చూసేది. చాలు అనమని ఆవిడ ఉద్దేశం. నేను మాత్రం కణాయించి, 'నెయ్యిఏమీ పడలేదు బామ్మా! మరి రెండు గరిటెలు వెయ్యి' అని నిర్మొఘమాటంగా అనేవాడిని. గరిటెతో మరి రెండుమార్లువేసినా ఏమీ పడనిమాట నిజం. అయినా, మాబామ్మ వెయ్యడానికిష్టపడేది కాదు. నాకు కోపంవచ్చేది. నాపంతం చెల్లాలని నా పట్టుదల. ఇంటిల్లిపాదీ తన అదుపాజ్ఞల్లో మసులుకుంటూవుంటే, యీ కుర్రకుంక నన్ను ఎదిరించడమా, యిప్పుడేవీడు యింత విర్రవీగుతూ వుంటే పెద్దవాడయినాక వీడినిపట్ట పగ్గాలుంటాయా? మొక్కైవ్వంగనిది మానయి వంగుతుందా అందుచేత ఇప్పటినుంచీ వీడిని లొంగదీసుకురావాలి! అని మాబామ్మ పట్టుదల. నేను అలిగి, అన్నం తినకుండా, చాచినచేయి చాచినట్టేవుంచి, మరి రెండు గరిటెలు నేయివేస్తేనేగాని తినననని భీష్మించుకు కూర్చునేవాడిని. కొంతసేపయ్యేక మాబామ్మ విధిలేక నేతిగిన్నె తెచ్చి గరిటె గిన్నెలోపెట్టి వట్టిగరిటే ఒకమారు అన్నంమీద తిప్పేది. నేను కంచంలోని అన్నం అంతా కలుపుకుని నెయ్యి వెయ్యమన్నా మాబామ్మ ఒక గరిటెనెయ్యే వేసేది. ఆ అన్నమే నాలుగు మార్లు కొంచెం కొంచెం కలుపుకుంటే నాలుగుసార్లు నెయ్యి వేసేది. ఈ సంగతి నేను కనిపెట్టి ఒక్కొక్కపిడచకు, ఒక్కొక్కమారు నెయ్యి వెయ్యమనేవాడిని. నా గడుసుతనం కనిపెట్టి మాబామ్మ అడిగినప్పుడల్లా ఒక్కొక్కమారు వట్టిగరిటె ఓమారు తిప్పుతుండేది. రాత్రిపూట దీపపు కీనీడను, మిల్లిగరిటె బోర్లించే నా కంచం మీద తిప్పేది. నేను వెయ్యికళ్లతో కనిపెట్టేవాడిని. ఏం బామ్మా గరిటె బోర్లించివేస్తే నెయ్యి ఏమైనా పడుతుందీ? అని అడిగితే, వంటనే ఆవిడ 'చీకట్లో కనపడలేదురా బాబూ, పోనీ మళ్ళీ వేసుకో' అంటూ మళ్ళీ వట్టిగరిటె ఒకమారు ఇంద్రజాలికుడు యక్షిణీ కర్ర తిప్పేటట్టు తిప్పేది. ఒకరోజు కోపం పట్టజాలక మాబామ్మ చేతిలోనున్న నేతిగిన్నెను లాక్కుని,




## నవంబరు 1953



త్రివర్ణచిత్రము : రేఖానికుంజము—రణవీర సక్సేనాగారు.



# "దీనిని వాడిచూడండి...

## ...లక్స్ టాయిలెట్ సబ్బుతో మీరు ఇంక మనోహరముగా నుండవచ్చును"

అని ఎస్. మేనకా చెప్పుచున్నది



"సౌందర్యమునకు అద్భుతమైన సహాయము ఇదిగో. మీగడవంటి లక్స్ టాయిలెట్ సబ్బు నురగను చర్మముమీద బాగా రుద్ది తరువాత కడిగివేయండి. నియమము తప్పకుండ వాడినచో లక్స్ టాయిలెట్ సబ్బు మీ చర్మమునకు ఒక క్రొత్త అందమును ఇచ్చును" అని ఎస్. మేనకా చెప్పుచున్నది.




# లక్స్ టాయిలెట్ సబ్బు

సినీమా తారలకు
సౌందర్యమునిచ్చు సబ్బు

LTS. 389-X52 TL

# కృత్రకోద్యానాలు



శ్రీ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి

శ్రీ యస్. వి. రమణరావు

భూమి అనేకవిధములైన భౌతిక, రసాయనిక పదార్థములతో కూడిఉన్నదని మనందరకు తెలిసిన విషయము. అట్టి సహజమైన భౌతిక, రసాయనిక పదార్థములతో కూడిన భూమి, దానిపై నివసించు లక్షలాది జీవరాసులకు అనేక విధముల జీవనోపాధి అయిఉన్నది. అట్టి జీవరాసులలో ప్రత్యేకించి వృక్షములకు అది ఎంతో ఆధారభూతమై ఉన్నది. కాని ప్రకృతిలో అన్ని నేలలు ఈ వృక్షములు పెరుగుటకు అనువైనవిగా ఉండవు. ఎందువలననగా, వృక్షములు పెరుగుటకు సహజముగా కావలసిన కొన్ని ముఖ్యలక్షణములు ఆయా భూములందు లోపించుటవలనకాని, మరికొన్ని భూములు అనువైన పంటలనుగాని, తోటలను గాని పెంచుటకు నిస్సారవంతముగా నుండుటచే, అవి నిరుపయోగకరములైవున్నవి. ప్రస్తుత దేశపరిస్థితులలో అధికాహారోత్పత్తియొక్క ఆవశ్యకత లోకవిదితమే. అందుచేత ఈ నిస్సారవంతమైన, నిరుపయోగకరమైన ప్రదేశములలో కూడ ఆహార పదార్థములను పెంచు విధానములు మనకు మిక్కిలి ఉపయోగకరములై ఉన్నవి. ఈ పద్ధతులను మనము మనదేశములో విరివిగా అమలు జరిపినచో మనకు, మనదేశమునకు ఎంతో శ్రేయస్కరముగా నుండగలదు.

మొక్కలయొక్క పెరుగుదలకు భాస్వరము, పొటాసియము, నత్రజని, మెగ్నీసియము, కాల్సియము, మరియు గంధకము ముఖ్యముగా అవసరమగు మూలపదార్థములు. వీటిని ఆంగ్లపరిభాషలో ***Essential elements*** అని అందురు. ఇవికాక బోరన్ (***Boron***), మాంగనీసు, ఇనుము, తామ్రము, తగరము మొదలయినవికూడ చెట్లయొక్క సరియగు పెరుగుదలకు సూక్ష్మభాగములలో నుండవలెను. వీటిని ఆంగ్లమున ***Trace elements*** అని అందురు. ఈ ***Trace elements*** లోపించినచో చెట్లయొక్క అభివృద్ధి లోపించును. అనగా వాటికి తెగులు పుట్టును. వ్యవసాయపరిశోధన స్థానములలోను, వృక్షపరిశోధన స్థానములలోను, మొక్కలయొక్క పరిశోధనలలో నిమగ్నులైన నిపుణులు ఇప్పుడు మొక్కలను నేలమీదకాక, ద్రవరూపములో ఈ పైనుదహరించబడిన మూలపదార్థములు, ఏ వృక్షమునకేయే మూలపదార్థములు ఎంత అవసరమో పరిశోధనలు జరిపి, ఈ మొక్కలను పెంచు పద్ధతులను కనుగొని ఉన్నారు. దీనినే నేలలేని వృక్షపోషణము (***Hydroponics***) అని అందురు. ఈవిధమయిన కృత్రిమ పద్ధతులలో పెద్దపెద్ద విలువయిన తోటలయొక్క పెంపకము అమెరికా, జపాను దేశములలో అమలుజరుపుచున్నారు. అయితే ఈవిధముగా చెట్లను పెంచుటలో శాస్త్రపరిజ్ఞానములో నిపుణత కొంత అవసరమయి ఉన్నది. ఈవిధముగ వృక్షములను పెంచుటలో మూడు రకములైన శాస్త్రీయపద్ధతులు కలవు. 1. నీటి పెంపకము (*Water Culture*), 2. ఇసుక పెంపకము (*Sand culture*), 3. కంకర లేక గులకరాయి పెంపకము (*Gravel Culture*).

### నీటి పెంపకము

ఈ పద్ధతిని కంకర గాని గులకరాయి కాని లేని ప్రదేశములలో సాధారణముగ అమలు జరుపుదురు. ఎందుకనగా, సాధారణముగా ఈ పద్ధతిపై బంగాళా దుంప, దోస జాతికిచెందిన కాయగూరలను విరివిగా పెంచవచ్చును. ఈ కాయగూరలు సాధారణముగా గులకరాయి కల నేలలమీద బాగా పెరుగును. అందుచేత ఈ కాయగూరలను కంకర నేలలు (***Gravel***) లోపించిన ప్రదేశములలో పెంచుటకు ఈ పద్ధతి మిక్కిలి అనువైనది. ఈ పద్ధతిమీద ఈ తోటలను అమెరికా దేశస్థులు విరివిగా పెంచుతున్నారు. ఈ పద్ధతిపై చెట్లను పెంచుట, ఇతర రెండు పద్ధతులకన్న కొంచెము కష్టతరము. కాని అనుభవముమీద ఈ పద్ధతిని చక్కగా అవలంబించవచ్చును. ఈ పద్ధతిపై చెట్లను పెంచుట ప్రప్రథమమున అమెరికాదేశములోని కాలిఫోర్నియా వ్యవసాయ ప్రయోగస్థానము వారు అమలుజరిపిరి.

ఒక వెడల్పు మూతిగల గాజు లేక పింగాణి పాత్రను తీసికొని దానిలో మొక్కల కవసరమగు పై నుదహరించిన మూలపదార్థములను సరియగు పాళ్ళలో కలిపి ద్రవరూపములో నుంచవలెను. (ఇది మనము పెంచు మొక్కలపై ఆధారపడి ఉండును.) ఆ పాత్రకు రంధ్రము చేయబడిన బిరడా నుంచవలెను. అట్లు చేసినపిమ్మట నారుమొక్కలను తీసికొని వాటిని రంధ్రముగుండా మొక్కయొక్క వేరు భాగము సీసాలోని ద్రవమునకు రెండు లేక మూడు అంగుళముల దూరములో ఉండునట్లు సీసాలో అమర్చవలెను. ఇట్లు అమర్చుటలో వేళ్లు శ్వాసక్రియ (*Respiration*) జరుపుటకు వీలుగా ఉండునట్లు, కొంత గాలిలోపల ప్రవేశించునట్లు అమర్చవలెను. గాలిని లోపలకు పంపులద్వారా కాని, గాలిని ఉత్పత్తిచేయు యంత్రములద్వారా కాని పంపవచ్చును. ఈ పద్ధతిలో ఒక జాగ్రత్తనుమట్టుకు అవలంబించవలెను. అది ఏమనగా, వేళ్లు ఎక్కువగా వెలుతురుతగులు ప్రదేశములలో నుంచరాదు. అట్లుంచినచో సీసాలోనున్న ద్రవములో హానికరమగు సూక్ష్మజీవులు వృద్ధిపొంది మొక్కవేళ్ళ భాగమునకు హాని కలుగజేయును. ఈ విధముగా రెండుమూడు పర్యాయములు ప్రయత్నించిన మంచి అనుభవము సంపాదించవచ్చును. అట్లు అనుభవము పొందినపిమ్మట వీలైన, మనకు సులభమైన పద్ధతుల నవలంబించవచ్చును. ఈ పద్ధతిపై కాయగూరలను పెంచి వ్యాపారముచేయు సంస్థలు కూడ ఇప్పుడు అమెరికా దేశములో కొన్ని కలవు. అట్టి సంస్థలు ఈ పద్ధతి నవలంబించుటకై పెద్దపెద్ద సిమెంటు తొట్టెలు కట్టి వాటిలో తీగతో అల్లిన జల్లెడపై తడిసిన రంపపు పొట్టుగాని, ఊకగాని వేసి ఆ తొట్టెలపై అమర్చెదరు. తొట్టెలోపల పోషకద్రవమును పోసెదరు. పిమ్మట నారుమొక్కలను ఈ జల్లెడలోనున్న పొట్టుపై నాటెదరు. తొట్టెలోనున్న ద్రవపదార్థమునకు ఈ జల్లెడకు మధ్య దూరము రెండు మూడు అంగుళములకన్న ఎక్కువ ఉండరాదు అట్లమర్చినపిమ్మట చిల్లులగుండా వేళ్లు లోనికి చొచ్చుకొనిపోయి ద్రవపదార్థమును చేరి ఆరోగ్యవంతముగ పెరుగును. మొదట చెప్పిన పద్ధతికి ఈ వ్యాపారపద్ధతికి అనుకరణలో ఏమియు చెప్పదగునంత భేదములేదు.

## ఇసుక పెంపకము

ఈ పద్ధతి ఇతర రెండు పద్ధతులకన్న చాల సులభమైనది, మరియు తక్కువ ధనముతోనే అమలు జరుపవచ్చును. జలపోషణ పద్ధతిలోవలెనే, ఇందులో కూడ గాజు, కొయ్య లేక లోహపాత్రలను ఉపయోగించవచ్చును. ఆ పాత్రలో హాని నాశకరమైన, బోలుగా నున్న ఇసుక నింపవలెను. ఎందువల్లననగా స్వేచ్ఛగా గాలి ప్రవేశించి బయటకు పోవుటకు వీలుగా నుండవలెను. దానిపై మొక్కలను నాటి మధ్యమధ్య విరామములనిచ్చి మొక్క పెరుగుదలకు అనువగు ద్రవమును చేర్చవలెను. ఈ విరామకాలము, ముఖ్యముగా ఇసుకలోనున్న వలుసులయొక్క పరిమితినిబట్టి, పెంచబడు మొక్కలను బట్టి, ద్రవముయొక్క బలమునుబట్టి (*Concentration*) ఆధారపడి ఉండును. అదనముగానున్న ద్రవమును తీసివేయుటకుగాను పాత్ర అడుగుభాగమున రంధ్రము చేయుటకూడ కలదు. ఇట్లు విడదీసిన ద్రవమును మరల ఉపయోగించవచ్చును. ఇందులోనే మరియొక సులభపద్ధతి కలదు. అది ఏమనగా ద్రవముతో నున్న పాత్రను ఎత్తగు ప్రదేశములోనుంచి, మొక్కలుగల పాత్రను ఎత్తు తక్కువగల ప్రదేశములో నుంచుదురు. ఈ రెండు పాత్రలను వంచిన గాజు గొట్టములతో కలిపెదరు. ఈ పద్ధతివలన ఎప్పుడు, ఎంత ద్రవము అవసరము, అంత క్రిందను మొక్కలు కలిగియున్న పాత్రకు తేలికగా అందజేయవచ్చును. ఈ పద్ధతి ప్రతివారు తేలికగా అనుసరించుటకు అనువైనది. దీనిని మన ఇండ్లలోను, తోటలలోను తేలికగా అమలుజరుపవచ్చును.

ఈ పద్ధతికూడ అమెరికా, జపాను దేశములలో విరివిగా అమలు జరుపబడుచున్నది. ఇది వ్యాపార సంస్థలకు జలపోషణ పద్ధతికన్న ఎక్కువ ఉపయోగకరము. ఎందువలననగా, ఇది ఆ పద్ధతికన్న చవకగాను, తేలికగాను అనుసరించవచ్చును. వ్యాపారదృష్ట్యా ఇది చాల లాభసాటిగా కూడ ఉండునని అభిప్రాయము. ఈ పద్ధతిపై, మంచి అందమైన పూలమొక్కలను, చిన్నచిన్న పండ్లచెట్లను, కాయగూరలను ఎంతో విరివిగా ఆకర్షవంతముగా పెంచవచ్చును.

## కంకర లేక గులకరాయి పెంపకము

ఈ పద్ధతికూడ ఇతర రెండు పద్ధతులలోకల సూత్రముపైనే ఆధారపడి ఉన్నది. కాని దీనిని విశాలమైన స్థలములలో పెద్దపెద్ద తోటలను పెంచుటకుగాను విరివిగా అనుసరించెదరు. ఈ పద్ధతిలో గులకరాయి (*Gravel*) ని మొక్కలు పెంచుటకు ఆధారముగా ఉపయోగించెదరు. గులకరాళ్లతో నిద్ధ

మడిగా తయారుచేసి ఉంచెదరు. దీనిలో రెండు విధములైన లాభములు కలవు. 1. సులకరాయి అగుటచే గాలి లోనికిపోయి బయటకు వచ్చుటకు మిక్కిలి వీలుగానుండును. 2. అదనముగానున్న పోషకద్రవమును తేలికగా బయటకుతీసివేయవచ్చును. అట్లు తీసివేసినదానిని, తిరిగి ఉపయోగించవచ్చును. అందుచే ఇది వ్యాపారరీత్యాగూడ మిక్కిలి లాభసాటిగా నుండగలదు. అట్లుమళ్ళను తయారుచేసిన పిమ్మట అనువగు పంటలనుగాని, పండ్లతోటలనుగాని, వేసి ఎంతో విజయవంతముగా పెంచవచ్చును. ఇది అనుభవముమీద మిక్కిలి తేలికగాను లాభసాటిగాను కూడ ఉండును. ఈపద్ధతిపై నుదహరించబడిన రెండు పద్ధతులకన్న తేలికగునదియు, మిక్కిలి లాభసాటిదియు అనికూడ శాస్త్రజ్ఞుల అభిప్రాయము.

## కంకర పెంపకము

ఇది సాధారణముగా పెద్దబయలు ప్రదేశములలో అనుసరించెదరు. దీనిని ఇండ్లలోను, చిన్న చిన్న తోటలలోను ప్రారంభించుటకు ఇతర రెండు పద్ధతులవలె అనువైనది కాదు. ప్రప్రథమములో కొంచెము వ్యయము ఎక్కువగానున్నను, రాను రాను ఇది ఎక్కువ లాభసాటి పద్ధతిగా నుండగలదు. ఏలనన దీనికి తిరిగి తిరిగి మిగత పద్ధతులలోవలె అంతఎక్కువ ధనమును వెచ్చించవలసిన అవసరములేదు. అనుభవము పొందిన పిమ్మట, ఈ పద్ధతి మనకు అనువగు మార్గములలోనికి మార్చుకొని విజయవంతముగా మొక్కలను పెంచవచ్చును. ఇది ప్రస్తుతము అమెరికా దేశములో ఇతర రెండు పద్ధతులకన్న ఎక్కువ వాడుకలో కలదు.

ఈ మూడు పద్ధతుల ననుసరించి తోటలను పెంచుటలో మిక్కిలి జాగ్రత్తగా నుండవలసిన విషయము ఒకటి కలదు. అది ఏమనగా, మూలపదార్థములతో కూడిన పోషకద్రవమును సరియైన పాళ్లలో మిశ్రమముచేసి ఉపయోగించవలెను. ఆ మిశ్రమము, మనము పెంచదలచిన మొక్కలనుబట్టి, ఆయా పదార్థములయొక్క భాగములు మారుచు ఉండును. అందుచేత ఈ మిశ్రమ ద్రవమును తయారుచేయుటలో సాధ్యమైనంత జాగ్రత్త కలిగిఉండుట శ్రేయస్కరము. ఈ వివరములను తగు శాస్త్ర గ్రంథములను పరిశీలించి తెలిసికొనవచ్చును. అట్లు తయారుచేసిన మిశ్రమము మొక్కలు తేలికగా గ్రహించుటకు వీలుగా నుండవలెను. అందుచేత వాటిని మనకు సులభముగా దొరకు లవణ రూపములో—ఉదాహరణకు, పొటాసియమ్ నత్రితము, సోడియమ్ నత్రితము, అమ్మోనియా గంధకితము మొదలగువానితో మొక్కలకు తేలికగా అందజేయవచ్చును.

అమెరికా, జపాను దేశములలో అవసరమగు తోటలు పెరుగుటకు వీలుగాలేని ప్రదేశములలో ఈ పై మూడు పద్ధతులలో ఆయా ప్రదేశములకు ఏ పద్ధతి మిక్కిలి అనువైనదో, దానిని అవలంబించి, ఆ దేశస్థులు వారియొక్క అవసరములను సులభముగా ఎదుర్కొనగలుగుచున్నారు. ఇదే విధముగ మన దేశములో కూడ నిస్సారవంతమైన, లేక నిరుపయోగకరమైన ప్రదేశములలో నివసించువారు ప్రభుత్వ శాస్త్రజ్ఞుల సహాయముతో గాని, తదితర శాస్త్రజ్ఞుల సహాయముతో గాని, ఈ పద్ధతులను కార్యరూపములో పెట్టినయెడల ఎంతో శ్రేయస్కరముగా నుండగలదు. అట్టి ప్రదేశములలోనే కాక, మనము సాధారణముగ మన ఇండ్లలోకూడ ఈ పద్ధతులపై ఆకర్షణీయమగు పూలమొక్కలనుగాని, నిత్య జీవితమున కుపయోగకరమగు కాయకూరలను గాని, పెంచవచ్చును. మన ఇండ్లలోని పెరటిభాగములు, ప్రాంగణములు, లేక వరండాలవంటి అనువైన ప్రదేశములలో ఈ మొక్కలను జలపోషణము లేక ఇసుకపోషణ పద్ధతులపై విజయవంతముగ పెంచవచ్చును.

# శరదవసరము ★

శ్రీ [illegible]
లక్ష్మీనరసింహశాస్త్రి

వెలుగుల మింటిమానికపు వీథుల నన్నిటి మూసివేసి, పి
ల్లల జతతోడ బత్తుల గులాయనిలాయములం బొనర్చి, గు
ర్తుల గనరాక దిక్కులను, దుర్దినముల్ ఘటియించి, మించు నా
జలధరశాల ముల్లసిల జాలె, మఱొక్కతెఱం గెసంగగాన్.

అంబురుహప్రమిత్రు డరుదార జగంబున నైశతామసం
బంబరమందు నంబుదమయాంధతమంబును, దమ్ములందు నై
ద్రంబగు చీకటిన్, నిజకరంబులతో నడగించివైచె; దే
జంబున నొప్పనుచ్ఛ్రితులశాత్రవు లెయ్యెడ నొంద రాహతిన్?

తాలిమి, నెల్ల దేహులకు దా సమకూర్చు, బలాబలంబులం
గాలమె; నిక్కమంచు బలుకం దొరకొన్నటు లొప్పుచున్, శర
త్కాలమునందు హంసలరుతంబులు, వీనులవిందు వెట్టి, సు
శ్రీలలితంబు లయ్యె, బరుషీకృత బర్హి కలస్వరంబుగాన్.

రాజమరాళబృంద మృదురమ్య మనోహరమంజకూజిత
శ్రీజిత కంఠరావమయి, చెందిన యీసున జేసిపోలు, దా
నాజి, వెసం దనూరుహములన్నియు రాల్చుకొనెన్ శిఖండభృ
ద్రాజు; సహింపరానిదిగదా పరపక్షపరాభవం బొగిన్?

ప్రతియొక కానలో బహుళరాగజపాధర రమ్యమైన సం
తత వనరాజిరాజవదనాముఖభాగమునందు సుందరే
క్షిత మృదుపభ్రమంబు లొలికించుచు నల్లన నుల్లసిల్లె న
ప్రతిమగుణంబులై వికచబాణ దళావళు లెంతయేనియున్.

పలువని పైడిరేకులటు పచ్చనిరేకుల విచ్చి నవ్వుచున్,
వలచురజంబులో మునుగబ్రాకిన యెఱ్ఱని కేసరంబులం
బలుమరు చువ్వుచుం, బ్రియవిమానిత మానవతీ మనంబులం
దలకొను కిస్కకున్ నిరసనం బనసం బవృథార్థతం గొనెన్.

బాలసరోజమిత్ర మృదుబాహులతా పరిరబ్ధమై సరో
లోల తరంగడోలికలలో దమిదేలెడి పూవుదమ్మి, యు
ద్వేల మదమ్ముతో నరుణదీప్తులు సిమ్ము ప్రియాస్యబింబముం
బోలుట జేసి, యెవ్వనిని ముంపదు తద్గత కౌతుకంబునన్?

ఎలమిని, శాలిగోపిక, తదీరితకోమల గీతనిస్వనం
బులు విని వీనులం, గనులు మూయక, ముంగల బచ్చిపైరుప
చ్చలు దినమాని, మైమఱచి, చక్కఁగ నిల్చియయున్న లేళ్ళగుం
పుల నదలించి తాదఱుమబూనదు, పండిన యాశ్వినంబునన్.

ఒకయెడ జెల్ల మబ్బుతెర, లుల్లసితాసిలతాసితమ్ములై;
యొకయెడ దెల్లమబ్బుతెర లొప్ప, మహేంద్రగజేంద్రచర్మ కం
చుకకలితంబులైనటులు, శోభిలు శారదదిక్తటంబులం
బ్రకటముగా గనుంగొన, విభాసిలవో జనలోచనాబ్జముల్?

గాలికి తేగివచ్చు నవకాంచనకంజ పరాగమున్ శర
త్కాల సరోరుహాస్య, నవుతాలకునెల్ల సరోజలోచనా
జాలముపైని గౌతుకవశమ్మున జల్లదలంపు గొన్నటుల్,
వాలున జల్లె దా బరిమళమ్ములు సిమ్మచు దిఙ్ముఖమ్ములన్.

ప్రమద మెలర్పఁగా, హరితపత్రములుఙ్, నవపల్లవంబులున్,
దమి గొనకూర్చి, దైవతగణంబులు పంపిన మాలవోలె, వ్యో
మమున మనోహరంబయి క్షమాజనమానసముం గరంచె న
భ్రములుగ గెంపుమోము, లలపచ్చపులుంగులజాలు, ముంగలన్.

క్రాలి మనోజ్ఞ కాశనికరంబులతో గనుపండువౌ శర
త్కాలమునం దఖండ ఘన కామసుఖోదయపూర్ణసిద్ధ, కే
కాలము నాశతో నిలిచి, కాంచిన నెయ్యునిగూడి నాటి, కు
ల్లోల మహాసుఖాంబునిధిలో నొక కామిని తేలె దిట్టమై.

మృదురసమాన సారస సమృద్ధ శరత్సమయోత్సవంబునన్
ముదితల గుబ్బమిట్టచనుముద్దల జిందిన స్వేదబిందువుల్,
పొదలుచు గ్రొత్త ముత్తియపు బూనలదండలువోలె గూర్చ, వే
యుదనున సౌరతోత్సవ సుఖానుభవమ్మనకున్ నిరోధమున్.

విని కలహంసకామినుల విస్తృతకాకురుతమ్ము వీనులన్,
మనసిజ సన్నిభుండయిన మాలిమి నెయ్యునిపైని బ్రేముడిన్
మునిగిన యేమెలంత, మునుమున్నుగ వానినిగూడి, యేవిమో
హాన రసలీల దేల? దనయుం బలయింపదు వాని బ్రోడయై!

---

కావ్యవిమర్శ :

# మనవిమర్శకులకు మనవిమాటలు



శ్రీ చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాద్

ఈ మధ్యకాలమునందు, కొన్ని కష్టములకు గురియై, ఆంధ్రుల యుత్తమ సచిత్రమాస పత్రిక యగు భారతిని, క్రమముగా జూచుటకు నాకు వీలుకలుగలేదు. ఇటీవల గడిచిన మే నెల భారతిని జూచితిని.

మే నెల సంచికయందు, 'జాషువా కవి' అను వ్యాసము, 'సౌందరనంద సమీక్ష' నన్నాకర్షించినవి. మఱల జూను నెల భారతియందు, సౌందరనందమును గూర్చి జరిగిన వాదోపవాదములను చదివియున్నాను.

శ్రీ జాషువా కవిగారియొక్క పిరదౌసి మొదలగు కావ్యములను, దాదాపు పదునైదు సంవత్సరములకు పూర్వము, భారతియందు నేను పరామర్శించియున్నాను. సౌందరనంద కావ్యమును 'ఆంధ్రభూమి' యను సారస్వత మాసపత్రికయందు, పది సంవత్సరములకు పూర్వము విమర్శించియున్నాను. ఇందువలనను, ఈ వ్యాసమును వ్రాయుటకు ప్రస్తుతము పురికొల్పబడితిని. నా యీ వ్యాసము అసందర్భప్రసక్తి కాదని మనవిచేయుటకే ఈ యుపోద్ఘాతము: తెలుగునాట నొకప్పుడు, విమర్శనములు వెలయించువారిలో కొందరు, విషయపరిశీలనమును విరమించి, వ్యక్తిదూషణమునకు గడంగుట కలవాటుపడియుండిరి. ఒక గ్రంథమును విమర్శింప దలచినపుడు, కథావస్తువు, శబ్దసంపద, రసపోషణము, పాత్రపోషణము, కవితా శిల్పము, మొదలగు విషయములను పరిశీలించి, మార్దవమగు భాషలో, నభిప్రాయమును వెల్లడించుట పాడి. గ్రంథకర్తయొక్క యుద్యోగ గౌరవములతోడను, సన్మానములతోడను, మనకు పనిలేదు, మనము విమర్శించునది గ్రంథమును; గ్రంథకర్తగా మన మాతని పరామర్శింతుము, సాధారణ వ్యక్తిగా, మన కాతనితో పనిలేదు. మొత్తముమీద, కొలది వత్సరములనుండి, విమర్శక వ్యాసములయందే వ్యక్తి దూషణము సన్నగిలి, విమర్శనము విషయవివేచకరణమునందే మగ్నమై యుండుట జూచుచున్నాము. మఱల నేలనో, ఈ దూషణము తలయెత్తుచున్నది. ఇది సత్వరము పరిహరింపబడుట యుచితము.

ఈ వ్యాసమునందు వ్యక్తులపేళ్ళ నుదహరించి, వారలను గూర్చి నే నొకింత ప్రస్తావింపక తప్పినది కాదు. నేను పరామర్శింపవలసివచ్చిన వ్యాసము లట్టివి గాన, నే నీరీతి కలము నడుపవలసివచ్చినది. ఇందులకు, పాఠకులను, క్షమియింప వేడుచున్నాను.

శ్రీ పొట్లపల్లి సీతారామారావుగారి రచనములను నే నిదివరలో నెచ్చట చదివియుండలేదు. తొలిసారి, 'జాషువా కవి' అను వ్యాసమును జూచితిని. తరువాత, వారి 'సౌందరనంద విమర్శనము—సింహావలోకనము,' అను వ్యాసమును చదివితిని.

ఒక కవి రచియించిన కావ్యమును శ్రద్ధతో పఠియించినచో, ఆ కావ్యమునందా కవియొక్క మనస్తత్వము లేదా మూర్తిమత్వము, మనకు గోచరించును. శ్రీరాముని కథ నెందరో వ్రాసిరి, వ్రాయుచున్నారు, కాని తమ ప్రకృతికి సన్నిహితముగా నుండు ఘట్టమును వర్ణింపవలసివచ్చినపుడు ఒకొక్కరొకొక్క క్రొత్తమార్గము నే త్రొక్కి, తమ వ్యక్తిత్వమును ప్రకటించి యున్నారు. కావ్యమునందు కవి బ్రతికియుండవలయును. పద్యకావ్యమునందే కాదు, వచనరచనమునందును, కర్తయొక్క నిజస్వరూపము మనకు గన్పించును.

శ్రీ సీతారామారావుగారు, తమ రచనములయందు, క్రొత్తవాడనగు నావంటివానికిగూడ, సంపూర్ణ దర్శన మొసంగిరి. వారి మనస్తత్వమును, గ్రహియించుటకే వ్యాసద్వయ మెంతో యుపకరించినది. వారి వాక్యములయందు జీవమున్నది; వారి రచనము లుద్రేకపూరితములు.

సుప్రసిద్ధులు, తెలుగుబాసయొక్క కులుకుందనము నెఱింగి, రసము చిప్పిలు పద్యములను రచి

యించి, పెక్కు రాంధ్రాభిమానులకు స్వభాషా వ్యామోహమును కల్గించిన శ్రీ జాషువా కవినిగూర్చి, శ్రీ రావుగారొక విపుల విమర్శక వ్యాసమును వెలయించియున్నారు. ఈ వ్యాసమునందు కొన్ని విషయములు సిద్ధాంతీకరింపబడినవి. సిద్ధాంతీకరింపబడిన విషయసందోహమునకు తగియు నుదాహరణములు చూపింపబడలేదు. అందులకే సంపూర్ణ విషయ విమర్శనమునకీ వ్యాసము దోహదము గాకుండ, కొన్ని వివాదముల నుద్భవింప జేసినది.

ఒక కవియొక్క ప్రతిభావ్యుత్పత్తులను విశదపరచుటకు, తక్కిన కవులను హేళన మొనరింప వలసినపని యేమున్నది? ఇతర కవుల రచనములనుండి కొన్ని భాగముల నుద్ధరించి చూపి, వానిని ఈ కవి రచనములతో పోల్చి, విషయపరామర్శ మొనరించుట యుక్తము. అంతేగాని, 'ఈనాడు పెద్ద పెద్ద సన్మానాలు చేయించుకొనేవారిలో, మహాకవుల మనుకునే వారిలో, యూనివర్సిటీ ప్రొఫెసరులని పిలువబడే వారిలో, పీఠాధిపతులైనవారిలో నీ దోషములు కుప్పతిప్పలుగా నున్నవి.' (పుట. 454) అని, కొందరిని హేళనము చేస్తూ శ్రీ జాషువా కవియొక్క ప్రతిభనుగూర్చి ముచ్చటించుటలో సాధించిన దేమి? ఈ పైన పేర్కొనబడిన వాక్యములయందు 'పీఠాధిపతులైనవారిలో' అని యనుటలోని యర్థమేమో! —ఒకవైపు, సౌందరనందకావ్యమును గూర్చిన విపరీత విమర్శ, వేరొకవైపు 'యూనివర్సిటీ ప్రొఫెసర్ల'ను గురించిన యప్రస్తుత ప్రసంగము, క్రొత్తవాడైనను నావంటివానికి కూడ, శ్రీ సీతారామరావుగారి హృదయమును, కరతలామలక మొనరించినవి!

'నేను అభ్యుదయ కవు లనిపించుకొనువారంద రొప్పుకొన్నా నేతిబీరకాయపురుషులు. వారిలో పలువురికి వర్ణక్రమము తెలియదు. అభ్యుదయత్వం, వేషములో నున్నదే కాని కవిత్వములో కాదు. పోనీ శబ్దజ్ఞానం లేకపోయినా ప్రతిభ ఉన్నదా అంటే అది లేదు.' (పుట. 449) అను శ్రీ రావుగారి వాక్యములు, ఖేదమును గూర్చుచున్నవి. మల్లెపూవుయొక్క చక్కదనమును వర్ణించుటకు, గులాబిపూవులను త్రెంపి, నలిపి, పారవేయవలయునా? శ్రీ రావుగారు తమ యభిప్రాయములను వెలువరించుటకు పూర్వ మికనైన కొంత యుద్రేకమును తగ్గించుకొనవలయునని, వినీతభావమున వేడుచున్నాను. ఆమూలాగ్రముగ పరిశీలింపక యొక విషయమునుగూర్చి త్వరపడి తూలనాడుట సాహసము. అభ్యుదయ కవుల రచనములను సవిమర్శకముగ పఠియించి, యుదాహరణములతో శ్రీ రావుగారొక వ్యాసమును ప్రకటించి, తమ పై వాక్యములను బలపరచుకొందురని యాశింతును. అభిప్రాయభేదము లుండవచ్చును, అభిరుచులయందంతరము లుండవచ్చును. కాని, వర్ణక్రమ మెఱుంగనివారు కవులవరుసలో చేరినారని పలుకుట పేలవముగా నున్నది. శ్రీ జాషువా కవిగారి పద్యమును, రావుగారియొకటి నుదహరించిరి. ఆ పద్యమునందలి ప్రతిశబ్దము, మార్దవముగా నుండి, అభిప్రాయభేదముగల విషయమునుగూర్చి మాటాడవలసి వచ్చినప్పు డెట్లు లౌల్యముగ భావమును విశదపరుపవలయునో తెలియజేయుచున్నది. శ్రీ సీతారామరావుగారా పద్యమును తిరిగి పఠియింతురు గాక!

'నేనీ వ్యాసములో సాహిత్యంలో జాషువా స్థానాన్ని నిరూపించడం లేదు, ప్రస్తుతము కవులని పిలువబడే వారిలో జాషువా స్థానాన్ని నిరూపిస్తున్నాను' అని శ్రీ రావుగారొకచో సెలవిచ్చియున్నారు. ఇదియొక వింతవాక్యము. కవులను, వారి రచనములను, గూర్చి వ్రాయుట, సాహిత్యమును గూర్చి వ్రాయుట కాదా? 'కవులని పిలువబడే వారిలో' అనగా, వారు కవులు కాకున్నను, కవులనే వేషంతో, లోకమును వంచించుచు, కాలమును బుచ్చువారిలో, జాషువా కవిగారి స్థానమును నిరూపించుటకీ వ్యాసమును ప్రకటించి యున్నారట! అసలైన, నిసలైన, కవులలో, శ్రీ జాషువా కవి స్థానమును, శ్రీ రావుగారేల నిరూపింపదలచలేదు? ఎవరేని యట్టివారున్నచో, ఈ నేతిబీర పురుషులకును, జాషువా కవిగారికిని గల సంబంధమేమి? వారితో వీరిని పోల్చి చూపుటలోని యర్థమేమి? తుదకు మాటలమూలమున నే విషయములు వియత్పథమున విహరించినవి గాని, ఒక్క స్థలమునందైన, ఒక్క పద్యమునైన, పోల్చి చూపకుండుట శోచనీయము. ఇది రసవాదము నెఱింగినవారి విమర్శనా విధమేమో!

మన మెంత ధీమంతులమైనను, ఒక వర్గమునకు చెందిన వ్యక్తుల శక్తిసామర్థ్యములను గూర్చి, విదిలింపు మాటల విసరివేయకుండుట యుక్తము. ఇది సహృదయుడు చేయవలసినవిషయము: శ్రీ సీతారామరావుగారు, 'ఇంతవరకీ దేశములో వచ్చిన విమర్శలన్నియు వట్టి గాలికబుర్లు. కవియొక్క ప్రతిభను తూచేవి కావు. ఇలాంటి విమర్శలవల్ల దేశంలో దుష్టమైన సాహిత్యము పెరిగినది.' (పుట. 561) అని సెలవిచ్చినారు. ఎంత సాహసమైన మాట! వేదము వేంకటరాయ శాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, కట్టమంచి రామలింగా

గడ్డి, కాశీభట్ల బ్రహ్మయశాస్త్రి మొదలైనవారు తెలుసునాట, వీనుమిగిలిన విమర్శకులు. వీరివలన దుష్టమైన సాహిత్యము పెరిగినదనియేనా, శ్రీ రావుగారి యభిప్రాయము? కాకున్న, 'ఇంతవరకీ దేశములో వచ్చిన విమర్శలన్నియు,' అనుటలో నర్థమేమి? గాలి కబుర్లతో గాకుండ, గట్టికబుర్లతో సెలవివ్వవలయును.

శ్రీ సీతారామరావుగారు సమగ్రముగ నలంకారశాస్త్రము నెఱింగిన పండితులే కావచ్చును; కాని నేటి సాంఘిక, రాజకీయ, మత, సారస్వత పరిస్థితులను గుర్తింపక 'అలంకార శాస్త్రము చదివి దాని దృష్ట్యా విమర్శించవలె, వేరొక గత్యంతరము లేదు' అని వాదించుట సమంజసముగా లేదు. అలంకార శాస్త్రమును నిరాదరింపుమని యెవరును కోరరు. కాలము ననుసరించి, నేడు చదువుకొనిన వారి యభిరుచిని గుర్తించి, అన్యభాషా ప్రోద్బలమును గమనించి, ఎంతవరకు విలువను కలిగియుండునో అంతవరకే మన శాస్త్రమును వాడుకలోనికి తెచ్చుట యుక్తము. 'విమర్శించడానికి కావలసిన కొన్ని శాశ్వతమైన పరమసత్యాలను,' అలంకార శాస్త్రము తెలియజేయునని, శ్రీ రావుగారనుచున్నారు; అట్లు కాదని వాదింపను గాని, వాతావరణము మారినచో, ఆదర్శములు, ఆశయములు, అభిరుచులు, సంఘము నందు మారినచో, ఆమార్పు ననుసరించి సారస్వతము, సారస్వతమునకు, జవము జీవము గల్గించు శాస్త్రములు మారక తప్పదు. అట్టి, మార్పున కవి యాలవాలము గానిచో, విస్మృతివారాశిలో విలీనమగును.

మన శాస్త్రమునందు, రెండెడ్లబండియే వర్ణింపబడినదని, రైలుబండి నెక్కుట మానినామా? ఇంజెక్షను పద్ధతి, ఆయుర్వేదమున చెప్పబడియుండలేదని, రోగము వచ్చినచో, దాని నుపయోగింపలేక మానుచున్నామా? సినీమా లెందుకు, మనకు వీధిభాగవతము లున్నవిగదా? మన వేషము, మన నడవడి, మన యాచార వ్యవహారములు, మన రాజకీయపరిస్థితి, మారినవి, కాని సారస్వతము మారకూడదా? తనకు లోకమున గలిగిన యనుభూతి నాధారముగా నుంచుకొని, మానవుడు పెక్కువిధములగు శాస్త్రములను సృష్టించుకొనినాడు. ఇప్పుడా యనుభూతియందు మార్పులు వచ్చినవి, అందులకే శాస్త్రము లొకింత మారి, క్రొత్తవిషయముల నలవరచుకొనవలసి వచ్చినది:

శ్రీ రావుగారు, తమ వ్యాసములయందు; 'లక్షవిధాలగా', 'అందం వచ్చింది', 'అవన్నీ ఉదహరిస్తే' 'అర్థవ్యక్తి కలుగుతూంది', 'స్వవచన వ్యాఘాతాలే', మొదలగు శబ్దములతో వ్యాసరచన జరిపియున్నారు. ఇవి మనకుగల పూర్వ వ్యాకరణసమ్మతమైన ప్రయోగములేనా? ఈ వ్యావహారికభాషను వీరు వ్రాయుటకు కారణము? అలంకార శాస్త్రమునందు మార్పు వచ్చుటకు వీలులేకున్న, వ్యాకరణశాస్త్రమునం దెట్లు వీలైనదో! ఒక శాస్త్ర మెందులకు మారినదో, వేరొకటియు నందులకే మారును!

విమర్శకులు, దుష్టసాహిత్యమును పెంచియున్నారు. వర్ణక్రమము తెలియనివారు కవులయినారని, కోపించిన రావుగారు, 'పోయింది, తూంది, వంటి ప్రయోగములను తమ రచనమునందు జొప్పించి, ఇంకను, పూర్వశాస్త్ర నిరాదరణమున కితరులను, తూలనాడుట శోచనీయము.

భాషయే కాదు, భాషా సంప్రదాయములు, మారినవి, మారనున్నవి. మార్పులేని విషయము శవసమానము, జీవద్భాష యట్లు కానేరదు.

శ్రీ జాషువా కవి, నేటికి, శ్రీ రావుగారి యనుగ్రహమున వ్యుత్పన్నుడు కాకపోవుటలో నాశ్చర్యము లేదు. పిరదౌసి, స్వప్నకథ, ముంతాజమహలు, గబ్బిలము, ఖండకావ్య సంపుటములు, మొదలగునవి, శ్రీ జాషువా కవియొక్క సుప్రసిద్ధ రచనములు. వానినుండి కొన్ని పద్యములను, సన్నివేశములను, శ్రీ రావుగా రుద్ధరించి చూపి, తమ యభిప్రాయమును బలపరచియుండిన బాగుండెడిది. 'అవన్నీ ఉదహరిస్తే వ్యాసం పెరుగుతుంది, స్థూలంగా జాషువాకవిత్వం, ఇది—ఇది అని చూపించడమే నా ఉద్దేశ్యం, అన్నీ ఉదాహరణలు చూపడం న్యాయం కాదు' (పుట. 452) అని సెలవిచ్చినారు. కవిని, వ్యుత్పన్నుడు కాడని చాటిచెప్పుచు, వ్యుత్పన్నత, ఎచ్చట లోపించినదో చూపుట కొక్క యుదాహరణమైన వివరింపక, విడుచుట న్యాయమా? ఉదాహరణములను సమగ్రముగ జూపి, తాము, శ్రీ జాషువ కవినిగూర్చి వివరించిన విషయములను, సమర్థించుకొనవలసిన బాధ్యత, శ్రీ రావుగారిపై నున్నదని మనవి.

శ్రీ జాషువాగారి వ్యుత్పన్నతను కించపరచు యత్నములో, శ్రీ సీతారామరావుగారు, తమ వ్యాసమును స్వవచన వ్యాఘాత దోషభూయిష్ఠమొనరించినారు, మీదుమిక్కిలి, 'ఇక గణపతిశాస్త్రిగారు

ఆయన యేమి వ్రాస్తాడో, ఆయనకే తెలియదు. అన్నీ స్వవచన వ్యాఘాతాలే' అని యొకచో హేళన మొనరించినారు. ఇట్టి వ్రాతలు, శ్రీరావుగారివంటి పండిత ప్రకాండులకు, విమర్శక చక్రవర్తులకు తగవు. నా వంటి యల్పు డెన్ని పొరపాటుల నొనరించినను, పండితలోకము మన్నించును; కూలంకషముగ సంస్కృతి వాఙ్మయమును పఠియించి, నాగరకులై, సారస్వత రంగమున, సింహగర్జనములతో విహరింప దొరకొనిన శ్రీరావుగారు, ఇట్టి దోషములను గావించుటాశ్చర్యము!

'ఆధునిక కవులలో నింత విస్పష్టముగా భావమును వ్యక్తీకరించే సామర్థ్యమున్న కవులు కనుపించకున్నారు' అని జాషువాగారి కవిత్వమును గూర్చి యొక యభిప్రాయమును వెలువరించి, మరల 453 పుటలో 'జాషువా కవిత్వం ఎంత తేలికగా ఉందని చెప్పినా ఆలోచించకుండా మాత్రము స్ఫూర్తికి రాదు' అని సెలవిచ్చినారు ఈ రెండవ వాక్యము, కవిగారి రచనా వైభవము నుగ్గడించునదియే గావచ్చును కాని, తొలి వాక్యములోని, 'ఇంత విస్పష్టముగా' అను పలుకులయందలి యర్థము నిది ఖండించి వైచినది.

'అసలు కవిత్వము తేలిగ్గా ఉండాలి అనే వాదానికి అర్థము లేదు' అని రావుగారు 453 పుటలో శాసించినారు, కాని వెంటనే, 'ఒకప్పుడు తేలిగ్గా నే వ్రాయాలి' (453 పుట)అని సెలవిచ్చినారు. మఱల, 'గద్యరచన ఎప్పుడూ తేలికగా నేవుండాలి, కవిత్వం ప్రజ లందరికి అర్థం కావాలి అనే వాంఛకి రహస్యం తెలియదు' అని చప్పరించివేసినారు. 'అసలు కవిత్వముయొక్క ప్రయోజనము విషయాన్ని బోధించడం గాదు, మనస్సునకు అలౌకిక సుఖానందమును కలగజేయడం' అని శ్రీరావుగారి ప్రవచనము. ఈ పై వాక్యములనుబట్టి, విషయ మర్థముగాకున్నను, ఆనందము పాఠకునకు కలుగవలయుననియు, అట్టిదియే సరియగు కవిత్వమనియు, తెలిసికొనినారము.—విషయము, అర్థము గాకున్నచో చిత్తమునందు వికారమెట్లు జనించును?

'ఉచితానుచిత వివేకము వ్యుత్పత్తినాబడు. సందర్భశుద్ధికి, వస్త్వైక్యమునకు వ్యుత్పత్తిమూలము. వస్తుపరిశీలనచే వ్యుత్పత్తి లభించును'. అని పెద్దలు నిర్వచించినారు. శ్రీరావుగారు 'ఈ కవికి భావనాశక్తితోపాటు పరిశీలనాశక్తి కూడా నున్నది. పదిమాట లెందుకు, గొప్పకవికి కావలసిన సర్వలక్షణము లున్నవి' అని, వెంటనే 'వ్యుత్పత్తి లేదు' అనినారు. పరిశీలనాశక్తియే వ్యుత్పత్తికి మూలముకాగా, అట్టి పరిశీలనాశక్తి యీ కవికి గలదని తామే సెలవిచ్చి, వెంటనే శ్రీ రావుగారు ఈ కవికి, 'వ్యుత్పత్తి లేదు' అని యనుటలో నర్థమేమో!

పుట 455 లో 'ఈ కవికి కవితా తత్వము తెలియదు, కవిత్వం వ్రాయడము వేరు, దానిపద్ధతి తెలియడం వేరు, ఆ అభిప్రాయాలు వెల్లడైనప్పుడల్లా కవి శక్తి కొంచెము వెలితిపడుతుంది' అని శ్రీ రావుగారనినారు; కాని 450 పుటలో 'అట్లా చెప్పటానికి కావలసినంత కవితాశక్తి యుండాలి, ఈ కవిలో నది పుష్కలంగా నుంది' అని రావుగారనినారు. పై వాక్యమునందు 'పద్ధతి' అనే పదమును నిర్వచించి, కవి శక్తికి, కవితా శక్తికి, గల యంతరమేమో, రావుగారు, వివరించనంతవరకు, దీనిని స్వవచన వ్యాఘాత దోషముగనే పరిగణింపవలసి యుండును.

'కవి ఎప్పుడూ రసములోనుంచే ప్రపంచాన్ని చూడాలని' ఆలంకారికులయాశయమని శ్రీ రావుగారు విశదపరచినారు. ప్రపంచ మన్నివిషయముల నీరసించియున్నను, కవి, లోకమును రసమునుండియే జూచి, తాను వెలయించు కావ్యమునందు, నీరసజగతిని, రసమయప్రపంచముగా వర్ణింపవలసి యుండునా? యథాతథముగ నానాటి లోక మానాటి కావ్యమునందు ప్రతిబింబింపవలయునుగాని, వేరువిధముగా నున్నచో, కావ్యలక్ష్యము, కవియొక్క ప్రయోజనము, లోకమున కుండదు. కాటకముల మూలమున లోకము క్షోభించునుగాక, యుద్ధములవలన ప్రపంచము దహించుకొనిపోవునుగాక, జాడ్యముల మూలమున జాతి నశియించునుగాక, కవి రసమునుండియే, అందును 'శృంగార రసము పరమాహ్లాద హేతువైన రసము' గావున, దానినుండియే లోకమును జూచి రచనము జరుపవలయును కాబోలు!

'ఈనాటి కవులు రాజకీయాలలోనుంచి కవిత్వాన్ని చూస్తున్నారు' అని శ్రీ రావుగారనుచున్నారు. 451 వ పుటలో 'ఈ కవి కవిత్వంలో ఎక్కువభాగము పూర్వ చరిత్రస్ఫోరకంగా ఉంటుంది. ఈయనకు ప్రతిష్ఠరావడానికి కిదియొక కారణం' అని సెలవిచ్చినారు. నేటి రాజకీయములే, ముందునాటి చరిత్రము. ఒక పుటయందు, చరిత్ర నాధారపరచుకొని కావ్యములు వెలయించిన కవిని స్తుతియించి, మఱల, వేరొక పుటయందా కవినే, చరిత్రను తమ రచనమునకు వస్తువుగా నిర్ణయించుకొను కవుల వరు

పలో పడిపోయినాడని, నిరుత్సాహమును వెల్లడించుటలో నర్థము కానరాకున్నది.

శ్రీ జాషువా కవియొక్క రచనా కౌశలమును శ్రీ రావుగారు వేరొకవిధమున విశదపరచియుండిన బాగుండెడిది. కవినిగూర్చి శ్రీ సీతారామరావుగారచ్చటచ్చట యొకింత సముద్రేక సహితములగు వాక్యములను పొందుపరచి యున్నారు; తుదకు, 16½ మాటలు మాత్రమే నేర్చిన కవులవరుసలో శ్రీ జాషువా కవికి స్థానమున్నదని యనుట, (పుట. 455) అందుచేతనే, ఈకవి, అప్రతిష్ఠకు గురియైనాడని పలుకుట, సాహసము. సంస్కృత వాఙ్మయమును సంపూర్ణముగ పరిచయమొనరించుకొని, అలంకార శాస్త్రమును కూలంకషముగ నవలోడించి, యాంధ్ర సారస్వత రంగమున విస్తృతవిహార మొనరించిన శ్రీ రావుగారి కట్టి సాహసము తగునుగాని, గొందుల కోల్లు సరిపోవును! ఇదియొక తీరు విమర్శనము కాబోలు! ఇది రసమయమా? లేక 'తామస' మాయమా? అట్టులే గాకున్న, 'నాది బుకాయింపు అంటావేమి?...నాకీయన సమాధాన మెంతవరకిచ్చాడో దానికి మాత్రమే జవాబు చెప్తాను' అని, ఏకవచన ప్రయోగమునకు పీకేల గసింగవలసి వచ్చెను?

సౌందరనందకావ్యము రసవిహీనమైనదని శ్రీ రావుగారు నిరసించినారు, నిరసించుటే గాదు, తమకు ప్రత్యుత్తర మొసంగిన శ్రీ గణపతిశాస్త్రిగారిని తూలనాడినారు; 'సంస్కృత భాషావైభవం తెలియనివా రనాగరికులు, శాస్త్రిగా రీసత్యాన్ని తెలుసుకోవాలి', అని సెలవిచ్చి, తమ 'నాగరికత' నుగ్గడించుకొని, శాస్త్రిగారి 'యనాగరికతను' వెల్లడి యొనరించినా మనుకొనినారు. 'తనకు దూరదారి లేదు పైగా మెడకొక డోలట' అని 'సురభి' గారిని, శాస్త్రిగారిని, అవధి యెఱుగని కటుకు పలుకులతో కసరివేయుట సరికాదు. ఇది 'నాగరకుల'కు చిహ్నము కానేరదు. సౌందరనంద కావ్యమే నాడో తెలుగువారి మన్ననల నందినది; అందలి పద్యముల నెందరో కంఠస్థ మొనరించుకొన్నారు. తెలుగునాట నా కావ్యమున కొక గౌరవస్థానమున్నది. కొందరను, న్యూనతబరుప పలుకబడిన విమర్శనములు విస్మృతికర్హములు.

విమర్శనమునందు మాటవిసురుడు మార్గము మంచిదికాదు. తక్కిన కవులను, పండితులను, విమర్శకులను, 16½ శబ్దము లెఱింగినవారని హేళన మొనరించుట పాడికాదు. ఇట్టి దూకుడువాక్యములు విషయ గౌరవమును వమ్మొనరించును. విమర్శకవాఙ్మయమును 'మరామత్తు' ఒనర్ప నడుము బిగియించిన శ్రీ రావుగారు, తమ యపార విజ్ఞానధనమును, తెలుగువారికి సరళము, సవ్యము, సరసము, అగు మార్గము వెంట నందించి భాషాసేవ గావింతురుగాక!



# ఆంధ్రుల చరిత్ర ఘట్టములు



శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

(గత సంచిక తరువాయి)

## 6

జాతీయ స్వాతంత్ర్యము పునః ప్రతిష్ఠితమాయెనో లేదో, దేశమందంతః కలహములు పొటమరించినవి. ఇందుకు వాస్తవ కారణములు రెండని తోచుచున్నది. (1) కాపయనాయకుని యధికారగర్వము ప్రథమకారణము. కాపయనాయకుడాంధ్రనాయక సంఘమున కధిపతియే కాని తత్పూర్వమాంధ్రదేశమును పాలించిన కాకతీయవంశజులవలె రాజుగాడు. 'ఆంధ్ర దేశాధీశ్వర' 'ఆంధ్ర సురత్రాణ' యను బిరుదులను వహించుట చూడగా నతనికి గాకతీయులవలె నాంధ్రదేశమున కంతటికిని రాజు గావలయునను నుద్దేశముండినట్లు తెల్లమగుచున్నది. తన కోర్కెను నెఱవేర్చుకొనుటకో యతడు దననాయకత్వ మంగీకరించి తనతో దురకలపై యుద్ధము నడపిన ప్రభువులను దన యధికారము క్రిందికి దెచ్చుటకు బ్రయత్నము సల్పినట్లున్నది. సన్నగా నతనికి లొంగినను బలవంతులు విముఖులైరి. (2) ఆంధ్రనాయకుల స్వతంత్రాపేక్ష రెండవకారణము. నాటికిని నేటికిని యాంధ్రు లత్యంత స్వాతంత్ర్యప్రియులు. ఒకరి యాధిక్యము నంగీకరింపరు. ఈ విపరీత స్వతంత్రేచ్ఛయే వారి దాస్యమునకు బ్రధానకారణము. అంతవఱకును బ్రథముడైనను దమలో నొక్కడై యుండిన కాపయనాయకుడు దమకంటె నధికుడై రాజపదమును బొందుట వారికి కంటకప్రాయమాయెను. అద్దంకి కొండవీటి రెడ్లును రాచకొండ నాయకులును వీరియందు ముఖ్యులు; కాపయనాయకునితో బ్రతిఘటించి యతని యధికారమును సరకుసేయక కయ్యమునకు గాలుద్రవ్వ నారంభించిరి. ఐకమత్యమువలన దమకు స్వాతంత్ర్యము చేకూరెననియు, వైమత్యమువలన నా స్వాతంత్ర్యము భంగము గాగలదనియు విస్మరించిరి. ఇందుమూలమున నాంధ్రదేశము యొక్క రాజకీయైక్యము చెడి మూడురాజ్యములై చీలినది. అంతటితో దృప్తిపడక పై రాజ్యాధిపతు లొండొరులతో బోరాడ నారంభించుటచేత మరల మహమ్మదీయుల యాగమునకును దేశపారతంత్ర్యమునకును నవకాశము గల్గినది.

ఇది తెలింగాణ తీరాంధ్రముల రాజకీయ స్థితి. పశ్చిమ దక్షిణాంధ్రముల చరిత్ర వేరుమార్గమున నడచినది. ముసునూరు ప్రోలయనాయకుని కాలమునం దాంధ్రజాతీయ నాయక సైన్యమొకటి యారవీటి సోమదేవరాజు నాధిపత్యము క్రింద పశ్చిమాంధ్రమునకు బోయి తురకలను బాఱద్రోలి కంపిలి ప్రాంతము నాక్రమించుకొనెనని చెప్పియుంటినిగదా. ఢిల్లీ సుల్తాను మరల కంపిలి రాజ్యమును స్వాధీనపఱచుకొన నెంచి యాదువంశజులును సంగమరాజ నందనులును నైన హరిహర బుక్కభూపాలురకు గొంత సైన్యమిచ్చి యా దేశమును గైవసము గావించుకొని తన పక్షమున దొరతనమును జేయవలయునని యాజ్ఞాపించి పంపెను. సంగమ రాజపుత్రు లాంధ్రులు. ప్రథమమున వారోరుగంటి ప్రతాపరుద్రుని కొలువున నుండిరి. ఓరుగలు తురకలకు హస్తగతమై ప్రతాపరుద్రుడు చెఱవోయిన పిమ్మట వారు కంపిలి కేతెంచి కంపిలి రాయల కొలువు బ్రవేశించిరి. కంపిలి పతనకాలమున వారు మహమ్మదీయుల చేజిక్కిరి. ఢిల్లీ సుల్తాను బలాత్కారముపై వారికి మహమ్మదీయ మతదీక్ష నొసగి తన కొలువున జేర్చుకొనెను. కంపిలి ప్రజల స్వభావమును గుర్తెరిగినవారు గావున దన యధికారము నచట నెలకొలుపుటకు వారె సమర్థులని తలచి సుల్తాను వారి నా ప్రాంతమునకు పాలకులనుగ నియమించి పంపెను. కాని సుల్తాను కోరిక యీడేరలేదు. హరిహర బుక్కలిరువురును కంపిలిరాజ్యమును బ్రవేశించిన పిమ్మట విద్యారణ్య యతీశ్వరులను సందర్శించి వారి యాదేశము చొప్పున మహమ్మదీయమతమును త్యజించి, మరల హిందూమతమును స్వీకరించి, యానెగొందియందు స్వతంత్రులై రాజ్యము సేయ గడగిరి. క్రీ. శ. ౧౩౩౬ వ సంవత్సరమున దుంగభద్రానదీతీరమున విరూపాక్ష

స్వామియాలయము చెంత హేమకూటముపై విజయనగర మను నూతన నగరమును నిర్మించి దానిని తమకు రాజధానిగ జేసికొనిరి. అప్పటినుండియు వారి రాజ్యము విజయనగర రాజ్య మను పేర బరగెను. క్రమక్రమముగ నది యభివృద్ధియై కృష్ణా సేతుబంధ రామేశ్వరముల మధ్యను పూర్వ పశ్చిమసముద్రముల నడుమను నుండు దక్షిణ భారతమంతటను వ్యాపించి మూడు వందలయేండ్లకాలము వర్థిల్లెను.

ఆంధ్రదేశాధిపత్యమునకై విజయ నగరముతో ప్రతిఘటించి హోరాహోరిగ బోరిన రాజ్యములు మఱి రెండురాజ్యములు గలవు. ఇందొకటి బహమనీ రాజ్యము. క్రీ. శ. ౧౩౪౭-వ సంవత్సరమున ఢిల్లీ సామ్రాజ్యాంతర్గతమైన మహారాష్ట్రదేశమున నొక గొప్పయల్లరి రేగెను. ఆ ప్రాంతసీమలను బాలింపుచుండిన యమీరులందరకమై ఢిల్లీసుల్తానుపై దిరుగబడి యతని యధికారమును గూలద్రోసి యల్లావుద్దీన్ హసన్ గంగూ యను నతని దమపై సుల్తానునిగ నెన్నుకొనిరి. ఇట్లేర్పడిన నూతన రాజ్యమునకు బహమనీ రాజ్యమని పేరు. మొట్టమొదటనుండియు బహమనీ రాజ్యమునకు విజయనగరముతో వైరము గల్గెను. దీనికి ముఖ్యకారణము భూకాంక్ష. బహమనీ సుల్తానుల యేలుబడిక్రిందిరాష్ట్ర మత్యల్పము. దానిని పెంపందించుటకు బహమనీసుల్తానులు దక్షిణమున విజయనగర రాయలతోడను దూర్పున దెలింగాణ ప్రభువులతోడను దఱచుగ బోట్లాడవలసి వచ్చెను.

రెండవది కళింగ గజపతి రాజ్యము అప్పటి దక్కనురాజ్యములలో నెల్ల నది కడు ప్రాచీనమైనది. కళింగ గజపతులు పూర్వగాంగవంశజులు. ప్రథమమున వీరి రాజధాని యిప్పటి విశాఖపట్టణమండలము లోని కళింగనగరము. కాలక్రమముగ వారి రాజ్యము త్తరమున గౌడదేశమువఱకు విస్తరించుటచేత పాలనాసౌకర్యార్థము రాజ్యమధ్యమందు మహానదీ తటముననుండు కటకమునకు రాజధానిని మార్చుకొనిరి. తీరాంధ్రమును దమ యేలుబడిక్రిందికి దెచ్చుకొనవలయునని కళింగ గజపతుల కోరిక. దీనికొక ప్రబల కారణము గలదు. పూర్వచాళుక్య రాజ్యస్థాపనయైనప్పటినుండియు దక్షిణ మధ్యకళింగములు రెండును అనగా—గోదావరినుండి సింహాద్రిపర్యంతము గల రాష్ట్రము—పూర్వచాళుక్యులు మున్నగు నాంధ్రదేశ పాలకుల యేలుబడిక్రింద నుండినవి. వానిని మరల స్వాధీన పఱచుకొని కళింగభూమినంతటిని చేర్చి యేక రాజ్యము సేయవలయునని వారి కడిక. ఈ కారణమున గజపతులకు తీరాంధ్ర ప్రభువులతో దఱచుగ ఘర్షణ గలుగుచుండెను. తీరాంధ్రము నాక్రమించుకొనుట కొఱకు గజపతులును వారిని వెడల నడుచుటకొఱకు తీరాంధ్ర భూపాలురును పెనగులాడు వారు.

ఈ యుగమున గణుతింపదగిన రాజకీయవిశేషములు పెక్కు సంభవించెను. అన్నింట ముఖ్యమైనది యంతర్రాజ్య యుద్ధము. ఇది సుదీర్ఘకాలము నడచెను. ముఖ్య రణాంగణములు రెండు. తీరాంధ్ర మొక్కటి. యుద్ధ మాద్యమున తీరాంధ్ర రాజకుటుంబముల కలహముల మూలమున ప్రభవించినను నచిరకాలముననె సకల దక్కను రాజసంగ్రామముగ బరిణామ మందినది. కొండవీడు రాజమహేంద్రవర రెడ్లును దెలుగు చోడులును పూర్వసింహాసనాధిపత్యమునకై పోట్లాడుచుండగా వారికి బాసటయై విజయనగర రాయలును బహమనీ సుల్తానులును తీరదేశమును ప్రవేశించి హోరాహోరిగ బోరగడగిరి ఈయుద్ధమూలమున దేశమునందరాజకము ప్రబలగా దేశము నాక్రమించుకొనుట కదియె చక్కనిసమయమని గజపతియు నెత్తివచ్చెను. ఈ యంశమును కవి సార్వభౌముడు శ్రీనాథుడు 'మూడు రాజులకును మోహంబుపుట్టించు గురుతైన యుర్విత్రాడు కొండవీడు' అను సీసపాదమున సూచించినాడు. కొండవీ డనగా కందుకూరు మొదలు సింహాచలముదాక వ్యాపించియుండిన రెడ్డి రాజ్యము. చోళభక్తిరాజు మరణానంతరము కొండవీటి రెడ్డిరాజు లతని పుత్రుడగు నన్నదేవచోడదేవుని దేశము నుండి వెడలనడచి వేంగిరాజ్యము నాక్రమించుకొనిరి. అతడు రాజుకొండ వెలముల నాశ్రయించెను; వారు రెడ్డిరాజులకు సహజశత్రువులు. రెడ్ల నోడించి వారి రాజ్యమును గొన నిచ్ఛగలవారు; కాని తత్పూర్వము రెడ్లచే బరాజయము నందియుండుటవలన స్వయముగ నతనికిదోడు చనుటకు వారికి ధైర్యము చాలదాయె. కావున వారు దమ కధపతియైన బహమనీ సుల్తాను సహాయము నపేక్షించిరి; ఆ సమయమందె కొండవీటి ప్రభువైన పెదకోమటి వేమారెడ్డి రాయబారులను సుల్తానుకడకు సహాయము వేడ నంపెను. కుమారగిరి రెడ్డి మరణకాలమున పితృపైతామహమైన రాజ్యమును రెండు భాగములుగ విభజించి రాజమహేంద్రవరము రాజధానిగాగల పూర్వరాజ్యమును దన బావయైన కాటయవేమునికిచ్చి తక్కిన భాగమును జ్ఞాతియైన పెదకోమటివేముని కొసగెను. ఈ విభజనకు పెదకోమటివేము డొప్పుకొనలేదు; కాటయవేము నెదిర్చి యతని భాగమును గ్రహించునంతటి శక్తి యతనికిలేదు. ఇలనగా కాటయవేముడు విజయనగర దేవరాయల వర్థించి యతని సహాయమును బడసెను. విజయనగర

రాయలను డీకొని తన రాజ్యమును దన్ను సంరక్షింప శక్తి గలవాడు బహమనీసుల్తానొక్కడే; కావున పెదకోమటి వేమన సుల్తాను సముఖమునకు రాయబార మంపెను. పూర్వసముద్ర తీరమువఱకుగల యాంధ్ర దేశమును సమస్తమును దన యేలుబడిక్రిందికి దెచ్చుకొనవలయునను దలంపుగలవాడగుటచేత బహమనీ సుల్తాను అన్నదేవ చోడునకును పెదకోమటి వేమారెడ్డికిని సహాయము సేయ నొప్పెంబడి సైన్యమును గదల్చుకొని తీరాంధ్రమునకు వచ్చి చేరెను. తత్పూర్వమె విజయనగర సైన్యము లచటికి వచ్చియుండుట చేత నిరుపక్షములవారికిని యుద్ధము ప్రారంభమాయెను.

ఈ యుద్ధమున బ్రథమమున విజయము సుల్తానునకె చేకూరెను. విజయనగర సైన్యములు రెండుమూడు స్థలములందు పరాజయము నందెను. కాటయ వేముడు నిహతుడాయెను; అతని కుటుంబ మన్నదేవునికి పాదాక్రాంత మాయెను. కాని విజయనగరము నుండి ప్రబలమైన సైన్యము వచ్చి బహమని సైన్యము నోడించి వెనుకకు దఱుముకొట్టెను. కాటయవేముని పక్షము విజయమందెను. గోదావరి యుత్తర తటములను విజయనగరరాయల పలుకుబడి హెచ్చెను.

విజయనగరమువారి పొత్తు గజపతికి కంటక మాయెను; గోదావరితీరమున వారి యునికి దన రాజ్యమునకు క్షేమకరము గాదని సమయ మనుకూలమైనంతటనె వారిని వెడలనడచుటకు నిర్ణయించుకొనెను. క్రీ. శ. 1423 వ సం||న కాటయవేముని కుమారుడు మృతుడు కాగా నతని పుత్రిక యనితల్లి వేంగీదేశమునకు రాణి యాయెను; ఆమె పేర నామె భర్త వీరభద్రారెడ్డియు బావ యల్లయ వేమారెడ్డియు బ్రజాపాలన సేయుచుండిరి. ఈ స్థితి రాజకుటుంబమువారికి కొందరికి నచ్చదాయె; తన్మూలమున దేశమున గొంత యసంతృప్తి తలచూపినది. క్రీ. శ. 1424 సం||న కొండవీటి ప్రభువు రాచవేమ డొక హంతకుని కత్తికి బలియాయెను. అదియె యనుకూలసమయమని యెంచి గజపతి దాడి వెడలి రాజమహేంద్రవర కొండవీడు రాజ్యములను జయించి నిజ రాష్ట్రమున గలుపుకొనెను. ఇదియె విజయనగర కళింగ ద్వంద్వ యుద్ధమున కంకురార్పణము.

మూడుపర్యాయములు గజపతులు తీరాంధ్రమును సింహాచలమునుండి నెల్లూరు వఱకును జయించి స్వాధీనము జేసికొనిరి. మూడు పర్యాయములును విజయనగర ప్రభువులు వారిని వెడలనడచిరి. మొదట నాల్గవ భానుదేవుడు క్రీ. శ. 1424 ప్రాంతమునం దెత్తివచ్చి 1428 వఱకును నైదేండ్లకాలము తీరాంధ్రమును నేలెను. ఇమ్మడి దేవరాయ లతని సింహాద్రి దాటువఱకును దఱుముకొట్టి రాజమహేంద్రవరమున రెడ్డిరాజ్యమును పునఃప్రతిష్ఠ గావించెను. మఱల క్రీ. శ. 1454 సం||న కపిలేశ్వర గజపతి దండు వెడలివచ్చి తిరుచినాపల్లి పర్యంతముగల తీరదేశమును జయించి యుదయగిరి వఱకు విస్తరించియుండు తెనుగురాష్ట్రము దన సామ్రాజ్యమున గల్పుకొని 1470 దాక మహోన్నతవైభవముతో పాలించెను. అతని యంత్యదశయందు సాళువ నరసింగరాయ లభ్యుదయమంది యొడ్డె బలములను కృష్ణ దాట బాఱదోలి ఉదయగిరి కొండవీటి రాజ్యములను స్వాధీనము జేసికొనెను. తరువాత క్రీ. శ. 1479 సం||న బహమనీసుల్తా నెత్తివచ్చి కొండవీటిని నరసింగరాయల కడనుండి జయించెను. కాని చిరకాల మతడా రాజ్యము నేలలేదు. క్రీ శ. 1484 సం||న పురుషోత్తమ గజపతి దండయాత్ర వెడలి బహమనీసుల్తాను నోడించి కొండవీటిని తెలంగాణమును స్వాధీనపఱచుకొనెను. తరువాత నుదయగిరిని ముట్టడించి సాళువ నరసింగరాయలను పరాజితుని జేసి యా దుర్గమును దాని క్రింది రాష్ట్రమును వైవశము గావించుకొనెను. అది మొదలు క్రీ. శ 1513 వఱకు గజపతుల యధికారము తీరాంధ్రదేశమందు నిరాఘాటముగ సాగినది. అంతట కృష్ణదేవరాయలు దిగ్విజయ యాత్ర బయలుదేరి ప్రతాపరుద్ర గజపతిని ప్రతియుద్ధమందును నిర్జించి యాంధ్రదేశమునం దతని యధికారముక్రింద నుండిన ప్రతి దుర్గమును పట్టణమును సాధించి కటకముదాక దండు నడుపుకొనిపోయి యా పట్టణమును ముట్టడించెను. 1518 వ సం||న జేసికొనిన యొడంబడిక ప్రకారము కృష్ణరాయలు కృష్ణకవ్వలి రాజ్యము నంతటిని మరల గజపతి కిచ్చివేసి దానికి దక్షిణమందుండు కొండవీడు ఉదయగిరి రాజ్యములను దాను స్వాధీనము జేసికొనెను. ఇటు తీరాంధ్రమున జాల భాగము మరల లభించినను గజపతి మరల తేరుకొనలేదు. అతని శక్తి పరాక్రమములు సన్నగిల్లెను. అతని మరణానంతరము గజపతుల రాజ్యము సంక్షుభితమై యల్పకాలమునసె గోలకొండ తురకలపాలైనది.

రెండవది కృష్ణా తుంగభద్రల మధ్యనుండు యంతర్వేది. ఈ యంతర్వేది యాధిపత్యమున విజయనగర రాయల యేలుబడిక్రింద నుండెను. దీనిని స్వాధీనపఱచుకొనవలయునని బహమనీ సుల్తానులు అల్లావుద్దీను హసన్ గంగూ కాలమునుండియు బ్రయత్నము సేయ నారంభించిరి. తత్కారణమున నుభయ రాజ్యములకు వైరము బెరిగి యుద్ధమే సర్వసామాన్య

స్థితి యీరీతి యాయెను. బహమనీ సుల్తానులు తెలింగాణము నాక్రమించుకొనిన పిమ్మట నది మఱియు విశేషముగ బ్రజ్వరిల్లినది. కాని సంపూర్ణ విజయ మెవ్వరికిని గలుగదాయె. ఒకప్పుడు వీరును మఱొకప్పుడు వారును జయమునందుచు వచ్చిరి. క్రీ. శ. ౧౬ వ శతాబ్దారంభమున బహమనీ రాజ్యము విచ్ఛిన్నమై యైదు స్వతంత్రరాజ్యములుగ జీలెను. ఇందు ముఖ్యమైన వహమ్మదునగర విజాపుర గోలకొండ రాజ్యములు. ఐదు రాజ్యముల ప్రభువులను మొత్తముగ దక్కను పంచపాదుశాహులని చరిత్రకారులు పేర్కొందురు. బహమనిరాజ్యము భిన్నమై పోయినను విజయనగర రాయలకు తురకలతో పోరాటము తప్పినది కాదు. బహమనీ సుల్తానులవలె వారి స్థానమున దేశాధిపత్యము వహించిన పంచపాదుశాహులును విజయనగర సామ్రాజ్యాంతర్గతాంధ్ర రాష్ట్రమును గబళింప నుద్యుక్తు లగుటవలన యథాపూర్వము యుద్ధమే సామాన్య రాజకీయ లక్షణ మాయెను. ఈ ద్వేషము రాను రాను ముదిరి క్రీ. శ. ౧౫౬౫ వ సం॥ రక్కసి తంగడి రణక్షేత్రమున బ్రజ్వరిలి తుదకు విజయనగర సామ్రాజ్య పతనమునకు హేతుభూతమైనది. చావుదెబ్బ తగిలినను విజయనగర సామ్రాజ్యము సమసిపోలేదు. ఉత్తరమున తుంగభద్ర కవ్వలి రాష్ట్రమును తురక లాక్రమించుకొన్నను తక్కిన సామ్రాజ్య భాగములన్నియు రాయల యేలుబడిక్రిందనే యుండినవి; కాని రాయల యధికారము నిర్వక్రముగ సాగుటకు కొన్ని యంతరాయము లేర్పడినవి. అమరనాయకు లెక్కడికక్కడ స్వతంత్రు లగుటకు ప్రయత్నములు సల్ప నారంభించిరి. కాని యారెవీటి తిరుమలరాజు తన యావచ్ఛక్తిని వినియోగించి జీర్ణకర్ణాట సామ్రాజ్యమును బునరుద్ధరించెను. ప్రబలులైన చెంజి తంజాపుర మధుర నాయకులకు సామంతరాజ పదవులనిచ్చి వా రాక్రమించుకొనియుండు రాష్ట్రములను వారికే ప్రసాదించి వారిని లోగడిసెను. తురకల యుపద్రవము లేక స్వస్థచిత్తుడై సామ్రాజ్య పునర్నిర్మాణ కార్యమును నిర్విఘ్నముగ సాగించుటకొఱకు రాజధానిని విజయనగరమునుండి పెనుగొండకు మార్చెను. తరువాత రాయ సామ్రాజ్య మెనుబదియేండ్లు కాలమువర్ధిల్లినది; కాని క్రీ. శ. ౧౬౧౪ వ సం॥న నిమ్మడి వెంకటపతి రాయులవారి మరణానంతరము దాని బలము రాను రాను సన్నగిల్ల సాగినది. దక్కను పంచపాదుశాహులలో నగ్రగణ్యులైన విజాపుర గోలకొండ సుల్తాను లొక ప్రక్కను విశ్వాసఘాతకులైన చెంజితంజాపుర మధుర నాయకు లొక ప్రక్కను బాధింపగడగిరి. చిట్టచివర కందరేకమై క్రీ. శ. ౧౬౪౮ వ సం॥ న రాయసామ్రాజ్యమును గూలద్రోసిరి. అంతట పశ్చిమాంధ్రమును విజాపురము వారును తీరాంధ్రమును గోలకొండవారును స్వాధీన పఱచుకొనిరి. అంతట నాంధ్రదేశ స్వాతంత్ర్యము సంపూర్ణముగ నడుగంటిపోయినది.

ఆంధ్రదేశ మిట్లు నానారాజ్యముల క్రింద విభక్తమై యుండినను దాని సంస్కృతి భిన్నాభిన్నము గాక జాతీయైక్యభావమునకు దారుణమై యుండెను. సారస్వత స్థితిని బరిశీలించిన నీ యంశము చక్కగ విశదము కాగలదు. భాష ననుసరించి యప్పటి సారస్వతమును సంస్కృతాంధ్ర సారస్వతములని రెండువిధముల విభజింపవచ్చును. యావద్భారత దేశమునకును సామాన్యమైన సంస్కృత సారస్వతవిషయమై యిప్పుడు ప్రత్యేక చర్చ యావసరము లేదు; కాని యొక్కమాట చెప్పవలసి యున్నది. కేవల సాహిత్యమునకంటె నీ యుగమున వైదిక శాస్త్రవాఙ్మయములు హెచ్చుగ వర్ధిల్లినవి. అన్నిటికంటె సంగీత నాట్యశాస్త్రము లధికముగ నభివృద్ధి నందినవి. విజయనగర విద్యాంసులు రేచర్లరాజులు వెలమనాయకు లొకరినిజూచి యొకరు సంగీత నాట్యశాస్త్రములందు త్తమగ్రంథములను విరచించిరి. విద్యారణ్యు లీ వైదికశాస్త్రవిలసనమునకు మూలకారకులు. పెదకోమటి వేమన్న, కాటయ వేమన్న సర్వజ్ఞ సింగభూపాలుడు, సాళువ గోపతిప్పన, లక్ష్మీనారాయణ, యచ్యుత దేవరాయలు, రామయామాత్యుడు మున్నగు లలితకళావిశారదు లీయుగమున గాంధర్వ విద్యావల్లికి బట్టుగొమ్మలైరి.

ఆంధ్రవాఙ్మయ మీయుగమున దామరతంపరగ నభివృద్ధి నందినది. ఇందుకు ముఖ్యకారణము రాజాశ్రయము. ఆంధ్రరాజ్యములను పాలించిన ప్రభువులు వాఙ్మయమును బ్రోదిసేయుట దమ ముఖ్యధర్మములలో నొక్కటియని భావించి కవులను విద్వాంసులను దమ యాస్థానములకు రప్పించి వారి గ్రాసవాసములకు దగిన యేర్పాటులను గావించి సత్కరించి గ్రంథరచన సేయ బ్రోత్సాహించువారు. ఏతత్కారణమున నప్పటి ప్రధానాంధ్రరాజ్యముల రాజధానులైన విజయనగర కొండవీడు రాచకొండ పట్టణములు కవిపండిత బృందముల కాటపట్టులై విద్యాపీఠములై విరాజిల్లినవి. కొండవీటిరాజ్య మంతరించినవెనుక రాజమహేంద్రవరపురము స్వల్పకాలము విద్యావంతుల కిరవై కవులకు శరణ్యమై యుండెను. మఱియు నాంధ్రుల ప్రాబల్యమువలన దక్షిణమున ద్రావిడదేశమున చెంజి తంజాపుర మధుర పుదుకోటలును, పశ్చిమమున

కర్ణాటక మందు మైసూరు పురమున ఆంధ్రసరస్వతికి నెలవీడు లాయెను. ఇట్లు దక్షిణదేశమునం దెల్లయెడలను సంభావింపబడుటవలన నాంధ్రభారతి తెంపంది నాగరకతకు భూషణప్రాయమై వెలసినది. అప్పటి విద్యావంతు లాంధ్రప్రపంచమున కొనర్చిన మహాకైంకర్యము విస్మరింపరానిది. తా మెచ్చటివారైనను తెవ్వారియాదర ప్రోత్సాహములమూలమున సరస్వత్యుపాసనకు దీక్ష గొన్నను తమ భాషాసేవ సమస్తాంధ్ర ప్రపంచమునకు జెందినదనియు దమ రచన లాంధ్రజనానీకమును సొమ్మనియు విశ్వసించిరి; వారిది వ్యక్తివిశ్వాసము గాదని జనాదరము నిరూపించినది. కవిసార్వభౌముండగు శ్రీనాథునియొక్కయు గాంధర్వ విద్యా చక్రవర్తియగు క్షేత్రయుయొక్కయు జీవనచరిత్రలిందుకు తార్కాణ. కవులకును, పండితులకును, నాంధ్రప్రపంచమునం దెల్లయెడను నాదరసత్కారము గల్గుచున్నను విద్యానగరము వారికి వారణాశిప్రాయమైనది; అది సకల విద్యలకును నిలయము. వాగ్దేవి కొటపట్టు; సారస్వత సామ్రాజ్యమునకు రాజధాని; విద్యా వివాదములకు ధర్మాసనము. కావున కవులకు పండితులకు శిల్పులకు శాస్త్రజ్ఞులకు వీరికి వారి కన నేల సకలవిద్యా విశారదులకును బుణ్యదీర్ఘప్రాయమై యాత్రాస్థానమై విద్యానగరము విరాజిల్లినది. రాయలసభ విద్యావంతుల ప్రతిభ కొరగపుటాయి; అచట మెప్పొందినవారే వంద్యులు. కావుననే మహాకవులు దక్షిణాధీశుని ముత్యాలశాలయందు దీనారటంకాల దీర్థమాడితిమనియు, గర్ణాటేశుని మెప్పించి యతనివలన బిరుదనామము బడసితిమనియు సగర్వముగ జెప్పుకొనిరి. విద్యానగర వైభవము కృష్ణరాయలకాలయమున మిన్నంటినది. అతడు సాహితీ సమరాంగణ సార్వభౌముడు, కవితా ప్రావీణ్య ఫణీశుడు; ఆంధ్రభోజుడు; ఆంధ్రసారస్వత ప్రపంచమున కష్ట దిగ్గజములను సృజించి సంరక్షించిన మహనీయుడు.

రక్షసితంగడి యుద్ధానంతరము ఆంధ్రభారతి దాక్షిణాత్యాంధ్ర నాయక రాజుల యాహ్వానము నంగీకరించి దన పీఠమును ద్రావిడభూమికి మార్చుకొని తంజాపుర మధుర పుదుకోట ప్రభువులచే సంసేవితయై వర్ధిల్లినది. అచట నామె నుపాసించి యామె యనుగ్రహములకు పాత్రులైన భక్తులలో దంజాపుర రఘునాథ నాయకుడును వతని పుత్రుడు విజయరాఘవ నాయకుడును నగ్రగణ్యులు. వీరితో సమాన ప్రశంసకు పాత్రులు మధుర విజయరంగ చొక్కనాథ నాయకుడును బుదుకోట విజయరఘునాథనాయకుడును భోసలశహాజియు. వీరి యాదరాతిశయము వలన ద్రావిడదేశమున దాను ప్రవాసమునందు విషయము నాంధ్రవాణి విస్మరించినది.

ఈ యుగచరిత్రమున చెప్పదగిన విశేషాంశములు మఱికొన్ని గలవు. ప్రప్రథమున చెన్నదగినది యాంధ్రజాతి విస్తరణము. ఇది క్రొత్తకాదు. పల్లవరాజుల కాలమునను చోళచక్రవర్తుల పాలనయందును ఆంధ్రులు ద్రావిడదేశమునకును ద్రావిడులాంధ్రదేశమునకును వలసలుపోయి స్థిరనివాసముల నేర్పఱచుకొనిరి. అట్లాంధ్రదేశమునకు వలసలు వచ్చినవారే యిప్పటి ద్రావిడ బ్రాహ్మణులు. వీరుగాక తెలుగు చోళులు అరవ వెలమలు కరణపిళ్ళలు చేరిసెట్లు మున్నగు బ్రాహ్మణేతర కులములవారును గలరు. ఇప్పుడరవదేశము గానవచ్చు సుప్రసిద్ధవైష్ణవ కుటుంబము లనేకము ప్రాచీనకాలమునం దాంధ్రదేశమునుండి వలస లేగినవారి సంతతికి జెందినవే. కాని విజయనగర రాయలవలె నాంధ్రజాతిని దక్షిణదేశమునందంత విపులముగ విస్తరింపజేసిన ప్రభువులు మఱియెవ్వరును లేరు. బ్రాహ్మణులు క్షత్రియులు కోమట్లు రెడ్లు వెలమలు తెలగలు ఒకరననేల సర్వజాతులవారును ఆంధ్రదేశమునం దన్ని తావులనుండియు బోయి కర్ణాట తుండీర చోళ పాండ్య కేరళ సింహళ భూములందు గుదురుకొనిరి. తమిళదేశమునం దెల్లయెడలను నేటికిని గానవచ్చు తెనుగువారందఱును వీరి సంతతివారే. ఇట్లు కలిగిన ద్రావిడాంధ్ర కర్ణాటక ప్రజాసమ్మేళనమువలన, వారి సంస్కృతులు తమ ప్రత్యేకత్వము గోలుపోయి కలయబడి యేకమై దాక్షిణాత్య సంస్కృతియై పరిణామమందెను. విజయనగర సామ్రాజ్యమువలన దక్షిణభారతప్రజలకు జేకూడిన మేలిదియే. రాయ సామ్రాజ్య మెన్నడో సమసిపోయినది తరువాత దక్షిణాపథమున వెలసిన రాజ్యములన్నియు గాలగర్భమున లయమైపోయినవి; కాని సంస్కృతి యొక్కటి మాత్రము వీడని యనుబంధమై నేటికిని దాక్షిణాత్య ప్రజలనెల్ల జేరదీయుచున్నది.

మఱియొక విశేషాంశముగూడ గమనింపదగియున్నది. ఇది యైరోపా ఖండమునుండి పాశ్చాత్య వర్తకుల రాక! వీరు మొట్టమొదట వచ్చినది వ్యాపారార్థమైనను క్రమక్రమముగ దమ వర్తకస్థానముల చుట్టును భూములను సంపాదించి వాని నెరపందించి రాజ్యములుగ జేసి చిట్టచివరకు నిఖిలభారత దేశమును దమ యాధిపత్యము క్రిందికి దెచ్చుకొనిరి. పాశ్చాత్య వర్తకులలో మొదట వచ్చినవారు పోర్చుగీసువారు. వీరు కొచ్చి కోజికోడు మున్నగు పశ్చిమ సముద్ర తీర

కరపట్టణముల నెలకొని, క్రీ. శ. ౧౬వ శతాబ్ద ప్రారంభమున విజాపుర సుల్తాను రాజ్యములను బారదోలి గోవాపట్టణమును స్వాధీనము జేసికొనిరి. ఆ కాలమున విజయనగర సామ్రాజ్యము పశ్చిమ సముద్ర తీరమువఱకు వ్యాపించి యున్నందున పోర్చుగీసువారు రాయలవారితో సఖ్యము జేసికొని రాయ సామ్రాజ్యమున వ్యాపారము జరుపుకొనుటకనుమతి వడసిరి. హిందువులవలె పోర్చుగీసువారికిని మహమ్మదీయులు పరమశత్రువులు. మఱియు వ్యాపారమూలమున వారి వైరమభ్యుదయమందెను. మొదట పూర్వ పశ్చిమదేశముల మధ్య నడచెడి యోడబేరమంతయు వరబ్బుల మున్నగు మహమ్మదీయ వర్తకులచేతిమీదుగ నడచుచుండినది. వారు దక్షిణ హిందూస్థానమునకు దెచ్చు సరకులలో ముఖ్యమైనవి గుఱ్ఱములు. అప్పటి యుద్ధములలో జయాపజయము లశ్వదళములపై నాధారపడియుండుటవలన హిందూస్థాన ప్రభువులందఱును ఎంత వెలయైన నిచ్చి గుఱ్ఱముల గొనెడివారు. ధనార్జనకశ్వవ్యాపారము ముఖ్యసాధన మగుటవలన పోర్చుగీసులు మహమ్మదీయ వర్తకులతో బోరాడి వారిని దఱుమగొట్టి గుఱ్ఱపు బేరమునే కాక సముద్రవ్యాపారము నంతటిని వీరు సొమ్ముజేసికొనిరి. మఱియు మహమ్మదీయులపై దమకు గల ద్వేష కారణమున దామమ్మకమునకు దెచ్చు గుఱ్ఱముల నన్నిటిని మహమ్మదీయ ప్రభువులకు విక్రయింపక రాయలవారికె యమ్మనట్లొడంబడిక చేసికొనిరి. ఇదియే పోర్చుగీసుల యెడ రాయలవారికి గలిగినయభిమానమునకు ముఖ్యకారణము. తరువాత ౧౭వ శతాబ్ద ప్రారంభమున నాంగ్లేయులు నొలందాలు పరాసులు మున్నగు పాశ్చాత్యులువచ్చి పూర్వ పశ్చిమ సముద్రతీరము లందందు వర్తకస్థానములను నెలకొల్పి వ్యాపారము సేయగడగిరి. ఇట్లు వచ్చిన పాశ్చాత్య వర్తకులలో నాంగ్లేయులును పరాసులును ముఖ్యులు. అన్యవర్తక సంఘములవలెగాక వారు దక్షిణదేశమునందు ప్రబలియుండిన అరాజక స్థితుల నాధారపఱచుకొని రాజ్య నిర్మాణమునకు బూనుకొనిరి. ప్రథమమున పరాసువారికి వ్యాపన మెక్కుడై సామ్రాజ్యపదవి వారికె లభించునట్లగపడెను; కాని చివరకు విజయమాంగ్లేయులకె సంప్రాప్తమగుటచేత వారె దక్షిణాపథమునకె కాక యావద్భరతఖండమునకును నధిపతులైరి.

## 7

విజయనగర సామ్రాజ్యము విచ్ఛిన్నమైన పిదప దక్షిణ హిందూదేశచరిత్రమున మహమ్మదీయయుగము ప్రారంభమైనది. విజాపుర గోలుకొండ సుల్తానులును చెంజి మధురానాయకులును నేకమై రాయసామ్రాజ్యమును గూలద్రోసిరనియు, పశ్చిమాంధ్రమును విజాపురమువారును తీరాంధ్రమును గోలకొండవారును స్వాధీనపఱచుకొనిరనియు జెప్పియున్నాడను. విజాపురము వారి భాగమునకు వచ్చిన యాంధ్రదేశభాగ మల్పమే. కోలారు బళ్ళారిమండలములును గర్నూలనంతపుర రాయచూరు మండలములలో గొన్ని సీమలును వారి యేలుబడిక్రింద జేరినవి. నెల్లూరు కడప చిత్తూరు చెంగల్పట్టు జిల్లాలును కర్నూలు అనంతపురజిల్లాలలో దూర్పుసీమలును గోలకొండరాజ్యమున గలసెను. గోలకొండ సుల్తానులు దక్షిణపూర్వము దెలింగాణ మాగాణములను కృష్ణ మొదలు చిలక సముద్ర పర్యంతము వ్యాప్తమైన తీరాంధ్ర కళింగములను జయించి స్వాధీనము జేసికొనియుండిరి; కావున వారి యేలుబడి యాంధ్రదేశ మందంతటను పర్వెను. కడపటి గోలకొండ సుల్తాను లాంధ్రదేశమంతటికి నధిపతులైరి. వారి పాలనక్రింద నాంధ్రదేశమునకు రాజకీయైకమత్యము కుదిరి యేకరాజ్యమై యొక్క పరిపాలనకు లోబడియుండెను.

గోలకొండ సుల్తానుల పాలన ప్రశంసాపాత్రమైనది. వారికి జాతిగర్వము లేదు. హిందూస్థానమునం దితర స్థలములను పాలించుచుండిన తురక రాజులవలె దామన్యజాతివారమని విఱ్ఱవీగి తమ యధికారముక్రింది హిందువులతో గలయక ప్రత్యేకముగ వర్తిలలేదు. మతముచే మహమ్మదీయులైనను తాము దమ ప్రజలవలె నాంధ్రులమనియే వారి భావము. కాని మత విషయములందు తప్ప తక్కిన రాజకీయార్థిక విద్యావిషయములందు హిందువులను మహమ్మదీయులను సమదృష్టిని జూచి యాదరించుటవలన మతభేదములేక ప్రజల కందఱకును వారియెడ నభిమానము గల్గెను. మతవిషయమందైనను వీరితర తురకరాజుల కంటె నెక్కువ సహనమును జూపిరి. శత్రురాజ్యములపై దండు వెడలినపుడు వీరచటి హిందుదేవాలయములను నిర్మూలము గావించినది నిజమే; కాని తమ యేలుబడిలోని హిందూదేవాలయముల జోలికిబోక పూజాపురస్కారములకడ్డు పెట్టక సాగనిచ్చిరి. పెక్కుతావుల నూతనదేవాలయములుగూడ నిర్మింపబడుచు వచ్చినవి. మఱియు నీ గోలకొండ సుల్తానులు హిందూ ప్రభువులవలె నాంధ్ర గీర్వాణభాషాపోషణ తమ విధియని తలచి కవులను గాయకులను బండితులను జేరదీసి గ్రంథరచనకు బ్రోత్సహించిరి. మల్కిభిరాముడు కవులపాలిటి కల్పవృక్షము. మహమ్మదు కులీ రసజ్ఞుడు; దక్కనీయందే కాక తెనుగునందును సరస

మైన కవిత జెప్పజాలిన ప్రభుకతంసుడు; అబ్దుల్లా కుతుబుశాహు వేదశాస్త్రపారగులకు విద్యాదానము సేయ దగు వసతు లేర్పఱచెను. తానీషా కాలమున సంస్కృత భాష మహమ్మదీయుల కాదరపాత్ర మాయెను. అతని గురువు అక్బరుశాహు శృంగార మంజరి యను గ్రంథమును సంస్కృతమున రచించి ప్రసిద్ధికెక్కెను.

క్రీ. శ. ౧౮-వ శతాబ్దాంతమున మొగలాయి చక్రవర్తి యౌరంగజేబు దక్కను మహమ్మదీయ రాజ్యములను గూలద్రోసి వాని యేలుబడియం దుండు రాష్ట్రమును డిల్లీ సామ్రాజ్యమున జేర్చుకొనెను; కాని దేశ మతనికి స్వాధీనపడదాయె. ఏలనఁగా నౌరంగజేబు హిందూమతద్వేషి. కావున నతఁడు సింహాసనమునెక్కినది మొదలు హిందువులను పలువిధముల హింసింపఁ గడగెను. ఈకాలముననే హిందూ ధర్మమును సంరక్షించుటకొఱకు శివాజీ యవతరించి మహారాష్ట్రమున జాతీయప్రబోధముగల్గించి స్వరాజ్యమును నిర్మించి మహమ్మదీయులను ముప్పతిప్పలబెట్టి దివంగతుఁడాయెను. అతని మరణానంతర మౌరంగజేబు మహారాష్ట్రముపై దండు నడిపి శివాజీపుత్రుని శంభూజీని పట్టి హింసించి చంపెను; కాని మహారాష్ట్రు లతనికి లొంగరైరి. శివాజీ వెలుగజేసిన జాతీయ దీపజ్వాల ప్రతిమహారాష్ట్రహృదయమునను బ్రజ్వలించుచుండుటవలన మొగలాయీలతో వారు దలఁగని ధైర్యముతో బోరగడగిరి. వారి యుదాహరణముచే నుద్రిక్తులై విజాపుర గోలకొండ రాజ్యములలోని హిందూ జమీందారులును నాయకులును సాహసికులును మొగలాయి చక్రవర్తికి వశవర్తులుగాక ఘోరముగ బోర దొడగిరి. దక్కనుదేశమునం దరాజకస్థితి ప్రబలెను. దొంగలు తెక్కలికాండ్రును యథేచ్ఛగ సంచరింపఁగడగిరి. మొగలాయి సామ్రాజ్యమందలి స్థితిగతు లిట్లుండగా వృద్ధుడైన యౌరంగజేబు కాలధర్మము నందెను.

ఔరంగజేబు మరణానంతరము మొగలాయి సామ్రాజ్యము విచ్ఛిన్నమైపోయెను. దేశపాలకులెక్కడి వారక్కడ కేంద్రప్రభుత్వమునుధిక్కరించి స్వతంత్రులైరి. దక్షిణాపథమందలి సుబాలనన్నిటిని యసఫ్‌జా నిజాముల్ ముల్కాక్రమించుకొని నిజస్వతంత్రమును బ్రకటించి హైదరాబాదుపట్టణము ముఖ్యస్థానముగ రాజ్యముసేయ నారంభించెను. శక్తిసామర్థ్యములు గల రాజకార్యమర్మజ్ఞుడగుటవలన యసఫ్ జా తన యధికారమును దక్కనుదేశము నాలుగు చెఱగుల జెల్లించుకొనెను. తన యధికారమును స్థిరముగ నెలకొల్పుటకొఱకు దన యనుచరులకు గొందఱకు ఆంధ్రద్రావిడ దేశములందు రాజ్యములనిచ్చి పాలకులనుగ నియమించెను. వీరిలో ముఖ్యులు ఆర్కాటు కడప కర్నూలు నెల్లూరు నవాబులు. ఆసఫ్‌జా సమర్థుడైనను దేశమున వర్ధిలుచుండిన యరాజకమును నణచి శాంతిని చేకూర్పజాలడాయెను. మహారాష్ట్రు లతని ప్రక్కలోని బల్లెములై బాధింప గడగుటవలన దుండగీండ్రను మట్టుపెట్టి శాంతిని పోషించి ప్రజలను సంరక్షించుట కతనికి వ్యవధి లేకపోయెను. అతని యనంతరము రాజకుటుంబమున రాజ్యాధిపత్యమునకై కలహములు సంభవించుటవలన దేశస్థితి మఱియు నధోగతిపాలై ప్రజల మనుగడయె దుర్భరమాయెను. హైదరాబాదు కర్ణాటక రాజకుటుంబములలోని యంతఃకలహములను సందర్భపఱచుకొని పుదుచ్చేరి యధివాసముగ వ్యాపారము సేయుచుండిన పరాసువర్తకసంఘమువారు దేశీయ రాజకీయములలో జోరబడ కలుగజేసికొని, యార్కాటు హైదరాబాదు ప్రభువులను దమ చేతి జంత్రపు బొమ్మలవలె నాడింపుచు దమ యిచ్చవచ్చినట్లు రాజకార్యములను నడుపసాగిరి. పరాసువారి యభ్యుదయము చెన్నపట్టణమునుండి వర్తకము సేయుచుండిన యాంగ్లేయ తూర్పు ఇండియా వర్తకసంఘమువారికి హృదయకంటకమాయెను; కావున వారును పరాసుల పద్ధతి నవలంబించి వారి ప్రతిపక్షుల కర్థబల సహాయముల నొసగిరి. ఈ కారణమున నుభయవర్తక సంఘములవారికిని ద్రావిడదేశమున పోరు పొసగెను. ఈ యుద్ధమునం దాంగేయ వర్తకసంఘమువారు విజయులగుటవలన నార్కాటు ప్రభుప్రవారికి వశవర్తియాయెను. అతని యేలుబడిలోని రాష్ట్రమున కంతటికిని వారె యధిపతులైరి. ఇదియె దక్షిణాపథమునం దాంగ్లేయ యీస్టిండియా కంపెనీవారి రాజ్యమున కంకురార్పణ. తరువాత కొంతకాలమున కాంగ్లేయ కంపెనీవారు హైదరాబాదు నైజాముతో నొడంబడిక చేసికొని పరాసువారికి వీడికోలిప్పించి వారి స్థానమున దామె నెలకొనిరి. ఈ యొడంబడికకు ముఖ్యకారణము నిజాముని దౌర్బల్యమే. మహారాష్ట్రు లొకప్రక్కను మైసూరుపాలకుఁడైన హైదరాలీ యొకప్రక్కను నతని రాజ్యముపైబడి సాధ్యమైనతావుల నాక్రమించి తక్కిన స్థలముల గొల్లగొట్టి పట్టణములను గ్రామములను దగులబెట్టి దేశమును పాడుసేయుచుండిరి. వారి రావడి కోర్వజాలక అప్పటికె భరతఖండమం దెల్లయెడలను బ్రబలియుండిన ఈస్టిండియా కంపెనీ వారిని శరణు వేడి సంధిచేసికొనెను. ఈ సంధి షరత్తుల ప్రకార మాంగ్లేయు లతని రాజ్యమును సంరక్షించుట కొడంబడి తత్కార్య నిర్వహణార్థము దమ

సైన్యమున గొంతభాగమును హైదరాబాదు పట్టణమున గాపుంచిరి. ఈ సైన్యము భరించవలసిన భారమంతటిని నిజాము మోయవలసి యుండెను; కాని యతని ఖజానాయందు ధనము లేకపోవుటచేత దానికి బ్రతిగ మన్నెరునుండి చిలుకసముద్ర పర్యంతముగల తీరాంధ్ర దేశమును వారికిచ్చివేసెను. ఇదియే తరువాత ఉత్తర సర్కారులనబడుచు వచ్చినది. పిమ్మట దక్షిణదేశమున మైసూరు నవాబులు ప్రబలి తమ రాజ్యమును నలువంకల విస్తరింప గడగిరి. ఈ కారణమున వారికీస్టిండియా కంపెనీవారితో వైరము గలిగెను. హైదరు కాలమున నుభయపక్షములవారును తులదూగిరి; టిప్పుసుల్తాను సింహాసనము నధిష్ఠించిన పిమ్మట వైరమభివృద్ధియాయెను. అతని నిర్మూలము గావించిన గాని దక్షిణదేశముపై దమయాధిపత్యము సుస్థిరమై నిలువజాలదని యీస్టిండియా కంపెనీవారు మహారాష్ట్రులను నైజామును తోడజేర్చుకొని దండెత్తిపోయి శ్రీరంగపట్టణమునకు ముట్టడివేసి యతని సంహరించిరి. తరువాత మైసూరును పూర్వరాజవంశజుని కొక్కనికి గొంతరాజ్యమిచ్చి పట్టాభిషేకము గావించిరి. తక్కిన రాష్ట్రమును మూడుభాగములు జేసి తా మొకటె యుంచుకొని మహారాష్ట్రులకును నైజామునకును జెరియొక భాగము నిచ్చిరి. నైజామువంతునకు వచ్చిన రాష్ట్రము పశ్చిమాంధ్రము; కాని యతడీ రాజ్యమును చిరకాల మనుభవించలేదు. ఈస్టిండియాకంపెనీవారికి ఋణపడి తీర్చుకొనలేక అప్పునకు చెల్లుగ దానిని వారికిచ్చివేసెను. ఈ కారణమున పశ్చిమాంధ్రమునకు దత్తమండలము వచ్చినది. ఇందు చిత్తూరు కడప కర్నూలు అనంతపుర బళ్లారి జిల్లాలు చేరియున్నవి. ఇటీవల పశ్చిమాంధ్రులకు దత్తమండలమను పేరు రుచించకపోవుటచేత తమ జిల్లాలకు రాయలసీమయని నూతనముగ నామకరణము జేసిరి.

నెల్లూరుజిల్లాయందు జాలభాగము వెంకటగిరి యుదయగిరి చుండి సంస్థానముల క్రింద నుండెను. అట్లే యుత్తర ఆర్కాడునం దుత్తరభాగమున కాళహస్తి కార్వేటినగరి సంస్థానముల పాలనయందుండెను. మొగలాయిప్రభుత్వమునను నటుపిమ్మటను వీరందరార్కాటునవాబునకు గప్పము గట్టుచు వచ్చిరి. ఆర్కాటు రాజ్యమును ఈస్టిండియాకంపెనీవారు స్వాధీనపఱచుకొనిన పిమ్మట కంపెనీవారితో నొడంబడికలను జేసికొని పేష్కసు గట్టుటకొప్పుకొనిరి. క్రీ. శ. ౧౮౦౦ ప్రాంతమున నెల్లూరునం దితరభాగములును కంపెనీవారి పాలనలోనికి వచ్చెను. ఇట్లు తెలింగాణమును మధ్యప్రదేశములోని కొన్ని ప్రదేశములను దప్ప తక్కిన యాంధ్రదేశము సమస్తమును నాంగ్లేయులకు హస్తగతమాయెను.

## 8

ఆంగ్లేయ ప్రభుత్వము దాదాపు నూటయేబది యేండ్లకు మించిన కాల మవిచ్ఛిన్నముగ సాగినది. తత్పూర్వ మెన్నడును దేశమంత చక్కగ బరిపాలింపబడి యుండలేదని నిస్సందేహముగ బలుకవచ్చును. వైదేశికులైనను దేశక్షేమమును దృక్పథమున నిల్పి ప్రజల కష్టసుఖముల నరసి న్యాయపథము దప్పక సర్వజాతుల యెడను సమభావమును గల్గి ప్రజాపాలన మొనర్చిరి. వారి పాలనయందు లోపము లేకపోలేదు. కాని వారి పాలనవిధానమును నిష్పక్షపాతబుద్ధితో బరిశీలించి చూచిన దోషములకంటె గుణములెన్నియో మడుగులు హెచ్చని చెప్పక తప్పదు. ఆంగ్లేయ పరిపాలనమును వివరించుట కిది సమయముకాదు. భారతీయులకు వారు చేసిన యుపకారములు మరువరానివి. అందు ముఖ్యమైన వాని గొన్నింటినైనను తెల్పక తప్పదు. మొట్టమొదట నెన్నదగినది దేశశాంతి. ఈస్టిండియా కంపెనీవారి యధికారము సుస్థిరమై నెలకొనుటకు ముందు భరతఖండమున శాంతి నెలుగదు. మన చరిత్రయంతయు రాజుల నిరంతర యుద్ధములతో సరిపోయినది. ఈ యుద్ధములలో దఱచుగ ప్రజలు పీడితులై యలమటించువారు. కుంఫిణీ రాజ్యము నెలకొన్నప్పటి నుండియు నందును విక్టోరియా మహారాణి సర్వభౌమాధికారిణిని చక్రవర్తినిగ పట్టాభిషిక్తయైనప్పటి నుండియు - యుద్ధమాగిపోయినది. బ్రిటిషు సామ్రాజ్యమునందందు యుద్ధములు గలుగుచుండినవి. భారతీయ భటులా యుద్ధములందు పాల్గొనుచుండిరి. కాని యీ సేతు శీతాచల మధ్యభూమియందు శాంతి నిశ్చలమై వర్ధిల్లినది. జనులు నిశ్చింతగ దమ వ్యాపారములను నడపుకొని సుఖముగ జీవయాత్ర సేయుట కవకాశము గల్గినది. రెండవది జాతీయైకమత్యనిర్మాణము. ఇది యాంగ్లేయులు బుద్ధిపూర్వకముగ జేసిన కార్యము గాదు. ఏకసామ్రాజ్య పాలితులై యొక్కతీరు చట్టములకు బద్ధులైన భారతీయులు దాము వసించు భూఖండ మేబదియాఱు దేశములుగ విభజింపబడియుండుటను విస్మరించి యది యేకజనపదమని విశ్వసింపదొడగిరి. ఏకజనపద వాస్తవ్యులందఱు నొక్కజాతికి జెందినవారను భావము దీనిమూలమున నుప్పతిల్లినది. హిందూ మహమ్మదీయ పార్సీ క్రైస్తవులందరొక్కజాతివారే యని సగర్వముగ జెప్పుకొన నారంభించిరి. ఇది యాంగ్లేయ పాలకులకు నచ్చలేదు.

భారతీయు లందఱేకమైన దమకు పీడితోలిత్తురను భయము వారిని పీడింపసాగెను; కావునవారు భారతీయైకమత్యమును భంగపఱచుటకొఱకు పెక్కు మార్గముల నవలంబించిరి. ఆర్య ద్రావిడ భేదమును బ్రకటించిరి. అందువలన విశేషలాభము కలుగలేదు. తరువాత హిందూ మహమ్మదీయ బ్రాహ్మణాబ్రాహ్మణ భేదములను లేవదీసిరి. ఈ యెత్తుగడల మూలమున అఖండ భారతము పాకిస్థాన హిందూస్థానములను రెండు స్వతంత్ర జనపదములుగ జీలిపోయినది. ఆర్యద్రావిడ వైషమ్యము దాలిలోని యగ్నికణమువలె దాగు చున్నది. కాని యీ కుతంత్రముల మూలమున గొంత ముప్పువాటిల్లినను దేశీయైకమత్యము భారతీయుల హృదయముల దృఢముగ బాదుకొన్నది.

ఇంతకంటె ముఖ్యమైనది యాంగ్లవిద్యాప్రదానము. ఈస్టిండియా కంపెనీవారి రాజ్యస్థాపనకు పూర్వమును తదనంతరము కొంతకాలము వఱకును పారశీకము రాజభాషయై యుండినది. పారశీ దేశభాష కాదు; ఆంగ్లేయుల భాషయు గాదు. దేశీయులాడు భాషయు గాదు. మహమ్మదీయ రాజులు ప్రవేశపెట్టినభాష. కంపెనీవారి రాజ్యము విస్తరించినకొలదియు రాజకీయ వ్యవహారములను పార్సీభాషయందు నడుపుట యుక్తముకాదనియు దాని స్థానమున వ్యవహారమున నుండు మఱియేభాషనైన స్వీకరించుట మేలనియు దోచినది. వ్యవహారమున నుండు భాషలలో నేది తగినది? రాజభాషయగు నాంగ్లమా? లేక దేశభాషలలో నొక్కటియా? యను విషయమై కొంత చర్చ నడచినది చిట్టచివరకాంగ్లమే రాజకీయ భాషయనియు నందే భారతీయ యువకులకు విద్యగఱప వలయుననియు దీర్మానమాయెను. అది మొదలాంగ్ల భాషను నేర్పుటకు పాఠశాలలను గళాశాలలను విశ్వవిద్యాలయములను నిర్మింపబడెను. ఆసేతుశీతాచల పర్యంతము భారతీయయువకులెల్ల నాంగ్లభాష నభ్యసించుటచేత కాలక్రమమున నది విద్యావంతులకెల్ల యొకలను సామాన్యభాషయాయెను. పలుభాషలు భాషించు భారతీయులు సులభముగ నొండొరులతో సంభాషించి తమ యభిప్రాయములను దెలుపుకొన నవకాశము గల్గెను. ఆంగ్లభాష భారతీయుల కైకమత్యమునుగూర్చు బంధనమాయెను. ఆంగ్లము ప్రపంచ ప్రధాన భాషలలో నొకటి. లోకమున నాంగ్లభాషావిశారదులు కొందరైనను లేని దేశములేదు. దాని వాఙ్మయమత్యంత విస్తారమైనది. సర్వవిధ విజ్ఞానాంశములను వివరించు గ్రంథము లన్ని మఱి యే భాషయందును గానరావు. ఆంగ్లేయ విద్యాభ్యాసమువలన భారతీయులకు పాశ్చాత్య విజ్ఞానమంతయును గరతలామలకమాయెను. ఆంగ్ల విద్యాభ్యాసమువలన దేశమున గొప్ప ప్రబోధము గల్గినది. పాశ్చాత్య విజ్ఞానమునందన్ని శాఖలకంటె హెచ్చుగ నాంగ్లవిద్యానిష్ణాతులైన భారతీయుల హృదయము నాకర్షించినది రాజనీతి. పాశ్చాత్యరాజనీతి గ్రంథపఠనవలన స్వేచ్ఛాస్వాతంత్ర్యములు జాతీయ జీవనముయొక్క పరమావశ్యకములనియు ప్రజాస్వయంపరిపాలనయే శ్రేష్ఠతమమైన పాలనయనియు గ్రహించిరి ఆంగ్లేయ పరిపాలనవలన దేశమునకును బ్రజలకును నెంతగ మేలు జేకుఱినను భారతీయుల కందు తావు లేకపోవుటవలన నది యంగీకార్యము గాదనియు నెట్లైన దమ దేశపరిపాలనమున దాము భాగస్వాములు గావలయుననియు నిశ్చయించిరి. ఇదియే భారతీయుల స్వతంత్రోద్యమమున కారంభము. ఈ యుద్యమము నెఱవేర్పుటకొఱకు విద్యాధికులలో బెక్కండ్రేకమై ఇండియన్ నేషనల్ కాంగ్రెసను భారతీయ మహాసభను సమకూర్చిరి.

మొట్టమొదట జాతీయమహాసభ నాయకులకు భారతదేశ స్వతంత్రము నెలకొల్పవలయునను నుద్దేశము లేదు. దేశపరిపాలనమందు తావును సంపాదించుకొనుటయే వారి సంకల్పము. కావున వారు చక్రవర్తినిని, బ్రిటిషుపార్లమెంటును దమకు శాసనసభలలోనికి బ్రవేశము గల్గింపవలయుననియు నున్నతోద్యోగముల నిప్పింపవలయుననియు వేడుకొనువారు. ఆంగ్లేయులు దేశకాలపరిస్థితుల కనుగుణ్యముగ బ్రవర్తించు స్వభావము గలవారు. కావున దేశీయసభ వారి కోరికలను గొంతవఱకు నెఱవేర్చుట యుక్తమని యెంచి పాలనవిధానమున గొన్ని మార్పులను బ్రవేశపెట్టిరి. కాని యీ మార్పులవలన భారతీయులకు సంతృప్తి కలుగలేదు; కావున వారు సర్కారువారు ప్రవేశపెట్టిన సంస్కారములకు దమ కృతజ్ఞతను దెల్పుచు నింకను దేశపాలనమునందు భారతీయుల కధిక ప్రాముఖ్యము గలుగజేయవలయునని వేడుకొనెడు వారు. పలుమారు వీరడుగుటయు నడిగినదానికంటె జాల తక్కువగ వారు వరము బ్రసాదించుటయు సామాన్యమాయెను. పందొమ్మిదవ శతాబ్ద మిట్లు గడచి పోయినది.

ఇరువదియవ శతాబ్దమందు దేశోద్యమము గడు తీవ్రముగ నడువసాగినది. జాతీయ సభయందు మితవాది యతివాది కక్షలేర్పడినవి. పూర్వమార్గము ననుసరించి సర్కారు చేసిన మేలునకు కృతజ్ఞతను దెల్పుచు, వలసిన సంస్కారములను బ్రవేశపెట్టుడని వేడుకొని మ్రొక్కులిడు వారు మితవాదులైరి. దేశస్వాతంత్ర్య

స్థాపనయే పరమావధిగ జేసికొని సర్కారు చర్యలను తీవ్రముగ ఖండించుచు దేశపాలనము దేశీయులకే యొప్పజెప్పవలసిన దని ప్రచారము సాగించువా రతివాదులునా బఱగిరి. మితవాదులకు నాయకుల బలిమి యెక్కువ. గోపాలకృష్ణ గోఖ్లేగాక సర్ తేజ్ బహాదరు సప్రూ, చింతామణి, సర్ సురేంద్రనాథ బెనర్జీ, శ్రీనివాసశాస్త్రి వారు మున్నగువారు సుప్రసిద్ధ మితవాది నాయకులు. అతివాదులకు ప్రజలప్రాపధికము. లోకమాన్య బాలగంగాధరతిలకు, లాలా లజపతిరాయ్, బాబుబిపిన్ చంద్రపాలు మొదలగువారు సుప్రసిద్ధాతివాదినాయకులు. మితవాదులెన్నడును చట్టములకు విరుద్ధముగ ప్రవర్తింప నొల్లరు. జులుము హింస వారికి పనికిరావు. అతివాదులు సమయ మనుకూలమైన శాసనోల్లంఘనమునకు వెనుదీయరు. వీరియం దొక శాఖవారు తుపాకులు బాంబులు మొదలగు నాగ్నేయాయుధములను ప్రయోగించి తమ రాజకీయ ప్రతిపక్షులను, ముఖ్యముగ తెల్లవారిని, సంహరించి యందుమూలమున కార్యసిద్ధి నందగోరిరి. ఈ తెగకు జెందినవారు సర్వత్రగాన వచ్చుచున్నను వారి కేంద్రస్థానము బంగాళాదేశమని చెప్పవలయును. శాసనోల్లంఘన నొల్లక మారణకర్మలయెడ విముఖులై చేసిన మేలును మరువక తమకు కృతజ్ఞులై యుండుటవలన మితవాదులు సర్కారున కాప్తులైరి. అతివాదులు శత్రువులైరి. మితవాదులకును నతివాదులకును ఘర్షణ ప్రారంభమాయెను. దేశీయ మహాసభయందు తమ తమ యాధిక్యమును నెలకొల్పుట కిరు తెగలవారును ప్రయత్నములు సేయగడగిరి. తుదకు 1907 వ సం॥న సూరతు నగరమున నడచిన మహాసభయందు బాహాటమైన పోట్లాట జరిగెను. తరువాత గోపాలకృష్ణ గోఖ్లేగారి నాయకత్వముక్రింద మితవాదు లతివాదులను నలిపెట్టి కాంగ్రెసు నాక్రమించుకొనిరి. 1907 మొదలు 1916 వఱకును దొమ్మిది సంవత్సరముల కాలము కాంగ్రెసు మితవాదుల వశమున నుండెను.

ప్రథమప్రపంచసంగ్రామముతో జాతీయమహాసభ చరిత్రమునం దొక నూతన ఘట్టము ప్రారంభమైనది. ఈ యుగమున దేశీయనాయకత్వ మతివాదుల చేతులనుండి క్రమక్రమముగ దుసికిలి పోసాగినది. నూతన నాయకులు రంగస్థలమును ప్రవేశించిరి. లోకమాన్య తిలకుగారి పలుకుబడి హెచ్చి యతని ప్రాధాన్య మతిశయించెను. అనిబెసంటమ్మగారు భారతీయ పక్ష మవలంబించి రాజకీయ విషయములందు ప్రవేశము గల్గించుకొని సర్కారువారిని ప్రతిఘటించినది. ఈమె యసాధారణ ప్రజ్ఞాబలముగల నారీమణి. 1916 వ సం॥నం దతివాదులకు మితవాదులకు రాజీ పఱచి కాంగ్రెసువందు జాతీయవాదులనందఱిని ఏకము గావించినది. ఇండియన్ హోమ్‌రూల్ లీగను నూతన సంస్థను స్థాపించి తీవ్రముగ ప్రచారము సాగింప నారంభించినది. ఎంత తీవ్రప్రచారము సల్పినను అనిబిసెంటమ్మగారు మితవాది వర్గమునకు జెందినదే. వారివలె నీమెకు చట్టనిరాకరణము పనికి రాదు. ఆంగ్లేయ సంబంధ విసర్జన మామెకు నచ్చదు. కావున జాతీయవాదుల కీమెతోడి పొత్తు కుదురలేదు. మఱియు దేశీయ మహాసభయం దతివాదుల బలము హెచ్చెను. సుప్రసిద్ధ మితవాదినాయకు లింకను రాజకీయరంగమున నుద్ఘోషించుచున్నను నతివాదు లుప్పొంగి వారిని వెలుపలకు నెట్టివేసిరి. వీరి యుల్బణమునకు ముఖ్యకారణము మహాత్మా గాంధిగారి యాగమనము. మహాత్మాగాంధీగారు భారతీయుల హక్కును నిలబెట్టుటకొఱకు దక్షిణ ఆఫ్రికా యందు తెల్లవారితో బోరి గెల్చిన యోధుఁడు. భారతీయరాజకీయరంగమున ప్రవేశించిన పిమ్మట స్వల్పకాలము సర్కారువారి యుద్ధకార్యముల యెడ సుముఖుఁడై యున్నను, వారి క్రూరకృత్యములకు రోసి విముఖుఁడై స్వతంత్రోద్యమమునకు నాయకుఁ డాయెను. మహాత్మా గాంధిగారి నాయకత్వము క్రింద నతివాదులు ప్రబలిరి. ఆయన యాదేశము చొప్పున యహింసావ్రతము నవలంబించిరి; మద్యపాన నివారణకు పాటుపడిరి. హిందూమహమ్మదీయ సమ్మేళనమూలముననె దేశము యొక్క దాస్యవిముక్తి కలుగునని నమ్మిరి. నిమ్న జాత్యుద్ధరణకు కంకణము గట్టికొనిరి. ప్రజాసేవయే దేశసేవ యని గ్రహించిరి. మహాత్మాగాంధిగారి యాధిపత్యముక్రింద అతివాదులు సత్యాగ్రహదీక్షను బుచ్చుకొని శాసనోల్లంఘనము గావించిరి. రెండుపర్యాయము లీసత్యాగ్రహోద్యమము సంపూర్ణముగ కొనసాగలేదు. కాని జాతీయవాదులు విజయమందిరనుటకు సంశయము లేదు. శాసనసభల యెన్నికలందు వారికే సర్వత్ర జయము చేకూరెను. ఢిల్లీకేంద్రమంత్రి పరిషత్తునందు వారిదె మీదిచేయి. తక్కిన మండలములందును మంత్రివర్గములన్నియు జాతీయవాదులచే నేర్పరుపఁబడినవి. ఇంతలోనె ద్వితీయ ప్రపంచసంగ్రామము సంప్రాప్తమాయెను. జాతీయవాదు లీ యుద్ధమున సర్కారునకు దోడ్పడలేదు. యుద్ధమున మిత్రమండలికే జయము గల్గినను ప్రపంచాభిప్రాయమునకు లోనై యాంగ్లేయులు భారతీయులకు స్వాతంత్ర్య మొసగి స్వదేశమునకు మరలిపోయిరి.

భారతీయ స్వాతంత్ర్య సంగ్రామమునం దాంధ్రుల కృషి యద్వితీయమైనది. ఆంధ్రజనానీకము గాంధిగారి యుపదేశములను జక్కగ గ్రహించి యాచరించెను. శాసనోల్లంఘనము, మద్యపాన విసర్జన అస్పృశ్యతా నివారణ, కరనిరాకరణము, విదేశవస్తు నిరసనము, ఖద్దరు నేత, ఖద్దరు ధారణ మున్నగు సహాయ నిరాకరణోపాంగముల ప్రస్తావము చేయునపుడాంధ్రులను ముందుగ ప్రశంసింపవలసి యున్నది.

భారతదేశమునకు స్వాతంత్ర్య మబ్బినను ఆంధ్రులకు సంపూర్ణముగ పారతంత్ర్య విముక్తి కలుగలేదు. దీనికి ప్రధానకారణము చరిత్రాత్మకము. ఈస్టిండియా కంపెనీవారికి తెలుగుదేశమంతయు నొక్కసారిగ స్వాధీనపడలేదు. కావున నప్పుడప్పుడు తమకు హస్తగతమైన తెలుగుసీమలను వారు మద్రాసు ప్రాంతమున గల్పి పాలించుచువచ్చిరి. కాలక్రమమున తెలంగాణ మొక్కటితప్ప తక్కిన యాంధ్రదేశమంతయు మద్రాసుప్రాంతమున జేరిపోయెను. ఇట్లేర్పడిన సంకీర్ణరాజ్యమున దెలుగు కన్నడ మళయాళ రాష్ట్రములు చేరియున్నను దమిళుల సంఖ్య హెచ్చగుటవల్ల పాలనవిషయములందు వారికి పలుకుబడియధికమాయెను. ఈకారణమువలన నాంధ్రులకు గొంత యిబ్బంది కలుగుచు వచ్చినది. దీనిని దొలగించుటకొఱకె యాంధ్రోద్యమము ప్రారంభమాయెను. కాని కేంద్రప్రభుత్వమువా రాంధ్రుల వేడుకోలును మన్నించి ప్రత్యేకముగ నాంధ్రరాష్ట్రమును నిర్మింపగైరి. కాంగ్రెసువారు భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణపద్ధతి నంగీకరించి యాంధ్రప్రదేశమును తమిళనాడునుండి వేర్పఱచి దానికి ప్రత్యేకసభ నేర్పాటు గావించిరి. కాని స్వతంత్రస్థాపనమైన పిమ్మటగూడ ఢిల్లీ జాతీయ కేంద్రప్రభుత్వమువా రాంధ్రరాష్ట్ర నిర్మాణమునకు బూనుకొనక జాగుసేయుచు వచ్చిరి. తుదకు మహానీయుఁడు పొట్టి శ్రీరాములాత్మార్పణము జేసిన పిమ్మట కేంద్రప్రభుత్వమువారు తృప్తులై యాంధ్రరాష్ట్రనిర్మాణము గావించిరి. అక్టోబరు మొదటి నుండి యాంధ్రదేశము ప్రత్యేకరాష్ట్రము. ఆ నాట నుండి యాంధ్రులు సంపూర్ణస్వాతంత్ర్యమును బొందగలిగిరి.



# సముద్రాపదేశము

★

శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

[భల్లట శ్లోకాంధ్రీకరణము]

స్నానపానాచమన మాత్ర సారములుగ
నెంచితి ప్రాజ్ఞులు; నిను సేవించి తేను
అతి జఘన్య కార్యాపయి కాంబువులను
దాల్ప-నీ కింత లేదేల త్రప? పయోధి!

ఆత్మ వార్యపేయతమె తృషితాళినుండి
రత్నసీకని పసిబిడ్డలకును దెలియు
అబ్ధి! దంష్ట్రాభయద మకరాంకితోగ్ర
భంగముల నేల భీతి గొల్పంగ నింక?

నిజ మాహాత్మ్యము నూరకే
పొగడుకోనేలా? మహాగర్జలన్
ప్రజ కర్ణద్వయి బ్రద్దలౌనటు
లొనర్పంగా నిదేలా? పయో
ధి! జటాధారి యొకండు-కుంభ
జుడు-మున్ దృష్టార్తి చేసాచినన్
నిజ నీరమ్ముల నీవు తత్కరపుటి
న్నిండింప లేనైతివో!

త్వల్లోకత్రయ సర్వవారి నిలయ
త్వమ్మున్, త్వదప్సంచయ
ప్రోల్లాసమ్మును తెలె; తెలెనిదె అం
భోధీ! భవత్సత్వముల్
వెల్లార్తిన్ బహుభంగ భీషణతనున్
వేలాద్రి నేడంగ, నిన్
చల్లార్పంగను లేవ - దావశిఖి లే
శమ్మేనియున్ తమ్ముడా!

మది నుద్వేగము నందవే నవహితా
త్మన్ సుంత ఆలింపవో
పెనవేదన బల్కెద నంబురాశి!
బదులీవే లెస్సయోచించి; నీ
హృదయమ్మందలి యశార్ణవముంగడచి
ఎన్నింతల్ నినుగాల్పు-శ్రీ
సృమవినాలన్ దృషితాళి దృక్కులు, నిరా
శా పూర్ణ నిశ్వాసముల్?

మకరాలయా! అవమానింపబోకు
మకట! రత్నముల బిట్టలల ఘాతముల
మును పురుషోత్తముండును చేయిసాచి
నిను వేడి - కౌస్తుభమ్మును కోరి కాదె?

# ఆధునికాంధ్ర కవిత్వంమీద ఆంగ్లసాహిత్య ప్రభావము



శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు

తన ఇరుగుపొరుగు సాహిత్యముల, సంస్కృతుల సంపర్కము లేని, 'ముడిగట్టుకొన్న' సాహిత్యము అనేది ప్రపంచములో లేదనుట సత్యదూరము కాదు. అతి ప్రాచీనములైన సంస్కృతము, గ్రీకు, లాటిను భాషల విషయములోనే ఈ వాక్యము సార్థకము అంటే మిగిలిన భాషలసంగతి వేరె చెప్ప నక్కర లేదు. ఈ సంపర్కము మనకది మంచికే వచ్చినా, చెడ్డకే వచ్చినా, దీనికి చారిత్రాత్మకమైన విలువ మాత్రము తప్పక ఉన్నది. అంతే కాదు. ఆ సంబంధము వలన, ఉభయత్ర వచ్చేమార్పులు భౌతిక సత్యములు గనుక, సాహిత్యవేత్తలకవి గ్రహింపదగినవి. విస్మరించుటకు వీలులేనివి. అవి లేవనుకొను అంధదృష్టి కాని, అవి పరిగణనకు రావనుకొను ఉపేక్షాభావము కాని సాహిత్య జిజ్ఞాసువులకు పనికిరాదు. ఈ విశాలమైన దృష్టి అలవరచుకొన్ననాడే సాహిత్య ప్రవంతి యొక్క సమగ్రస్వరూపము గోచరించును. అలా కాక, వాస్తవికతను పరిగ్రహించకుండ కవిత్వము వ్రాసిన వ్రాయవచ్చునేమో కాని, విమర్శమాత్రము వ్రాయలేము. వ్రాసినచో, అది సాహిత్యములోని క్రొత్తదనాన్ని నిర్వచించలేక, సంపూర్ణమైన విమర్శ కాలేదు.

ఇక, ఈ సంబంధము అవమానకరమైనదనిగాని, అసభ్యమైనదనిగాని, అనుకొనుట పొరపాటు. ఈ సంబంధమువలన వచ్చిన 'క్రొత్తదనాలు', "పవిత్రమైన మన సాహిత్య క్షేత్రములోని 'కలుపు మొక్కలు'; కనుక వీటిని పరిహరించవలెను", అనువారు కొందరున్నారు. కాని, ఇవి కలుపుమొక్కలో లేక మన సాహిత్య క్షేత్రమునకు బలము ఇచ్చే 'ఎరువు మొక్క'లో నిర్ణయించే అధికారము, కాలమునకు సహృదయలోకమునకు వదిలివేసిన మంచిదని వారికి మన మనవి.

ప్రపంచములో ఏ జాతిగాని, ఏ దేశముగాని, ఏ సాహిత్యముగాని, ఇతర జాతుల, దేశముల, సాహిత్యముల 'నీడలు' సోకకుండ ఉన్నదని నమ్ముట కష్టము. ఏదో ఒకే జాతియొక్క శుద్ధరక్తము మాత్రమే దేహములందు ప్రవహించుచున్న లోకాతీత మానవజాతి లేనట్లనే, స్వదేశీముద్ర మాత్రమే ఉండి, ఇతర సాహిత్య సంపర్కములేని సాహిత్యము లేదనవచ్చును. తన కాళ్లమీద మాత్రమే నిలిచిన సాహిత్యము లేదనవచ్చును. ఆ కాళ్లకు బలమునిచ్చే శక్తులెన్నో పైనుండి వచ్చినవే. ఈసంగతిని గ్రహించి, వాటిని గుర్తించినప్పుడే, స్థూలదృష్టికి గోచరించని సంబంధము లెన్నో అగపడి, సాహిత్య వికాసము అర్థవంతమగును. ప్రాచీన సాహిత్యముల విషయమునందే ఇది సత్యమన్నప్పుడు, నాటికంటె అన్నివిధముల 'కుదించబడిన నేటి ప్రపంచములోని' సాహిత్యములవిషయమున, ఇది పరమసత్యమనుటలో విప్రతిపత్తి ఉండరాదు.

ఈ దృష్టితో ప్రాచీనాంధ్ర సాహిత్యమును కొంచెము పరిశీలించవలెను. మనదేశములో సంస్కృత ప్రాకృతసాహిత్యముల ప్రభావము సోకని సాహిత్యమే లేదనుట సత్యదూరము కాదు. కొన్నికొన్ని సాహిత్యకుటుంబములలో వీటిదే పెత్తనము. కొన్నికొన్నింటికి ఇవి బంధువర్గము. ఇవి లేనికుటుంబములే లేవు. ఈ సత్యము మన సాహిత్యవిషయమునందును కనపడును. భాషావిషయములో వేరే చెప్పనక్కరలేదు. మన వైయాకరణులు, దీనిని గుర్తించినవారు గనుకనే, తెలుగు వ్యాకరణములలో అక్షర సమామ్నాయమునుగూర్చి వ్రాయునప్పుడు, "సంస్కృతమునకు వర్ణములు ఏబది", అనియు "ప్రాకృతమునకు వర్ణములు నలువది" అనియు వ్రాసి, తరువాత తెలుగు వర్ణములమాట ఎత్తినారు. (అద్యాయాః పంచాశద్వర్ణాః

(ప్రకృతేస్తు తేదశో నాస్యః) సంస్కృత పరిభాషను విరివిగావాడి మనవ్యాకరణము రచించినారు. ఈ పద్ధతి అపకర్షహేతువని వారనుకొనలేదు. ఇంక సాహిత్య విషయము. మన సాహిత్యము నూటికి తొంబదిపాళ్లు సంస్కృత సాహిత్యమును అనుసరించి పోయినదే. వాడిది అపకర్షహేతువని ఎవరును అనుకొనలేదు ఈ అనుసరించిన వారిలో ఎందరో మహానుభావులున్నారు. వారందరు మహాకవులు.

సంస్కృతప్రాకృతములతో సమానమైన—లేక కొంచెము అధికముగా కొన్నిచోట్ల, కొంచెముతక్కువగ కొన్నిస్థలములందు—ప్రభావమును తెలుగు భాషా సాహిత్యములమీద చూపినవి తక్కిన దాక్షిణాత్య భాషలు. ఈ భాషలకు గల అత్యంత సన్నిహితత్వమే ఇందులకు కారణము. తెలుగు, కన్నడము బాగుగ తెలిసినవారికి నన్నయ భారత భాగమునకును, కన్నడ భారతమునకును ఎన్నో పోలికలు కన్పట్టును. ఇవి, సంస్కృతమూలమునుబట్టి వచ్చినవిగాక, ప్రత్యేకమయినవి. శైవకవులనుగురించి వేరే చెప్పనక్కరలేదు గదా! ఆంధ్రదేశములో వైష్ణవ మతప్రాబల్య మధికముగనున్న దినములలో తమిళప్రభావము మన భాషా సాహిత్యములపై సోకినవిషయము విజ్ఞుల కందరకు విదితమైనదే గదా! వీటిలో వీటికి, ఛందస్సాహితీ రీతులలో ఎన్నో పోలికలు. ఎన్నో సంబంధములు. నాయకరాజుల కాలమునాడు మహారాష్ట్ర భాషా సంస్కృతుల ప్రభావమును ఇట్టిదే ఈ విషయము లన్నియు మన మెరిగినవే.

ఈ భాషలవెనుక, మన భాషాసాహిత్యములపై—ముఖ్యముగ భాషపై—విశేషప్రభావము చూపినవి ముస్లిముల భాషలు. అవి ఫార్సీ, అరబ్బీ, ఉర్దూ భాషలు. ఈ భాషలు ఎన్నోవందల పదములను మన భాషకు ఇచ్చినవి. ఈ పదములకు బదులుగ వాడుటకు, కొన్నింటికి తెలుగుపదములు లేకుండ పోవునంతగ, ఆ పదజాలముయొక్క ప్రభావము మన భాషకు సోకినది. మహాకవులు, ఆ పదములను విచ్చలవిడిగవాడి, వాటికి తెలుగు భాషలో శాశ్వతస్థితి కల్పించిరి.

కాలగతి ననుసరించి పాశ్చాత్యుల సంపర్కము, దానివలన వారి భాషాసాహిత్యముల ప్రభావముకూడ మనమీద పడినది. ఇదంతయు దిఙ్మాత్రముగ సూచితము. మన వ్యాసమునకు, ఈ గతి చరిత్రయొక్క విపులీకరణ మింతకంటె అనావశ్యకము. ఇక పరిశీలింపవలసినది ఆంగ్లసాహిత్యమును, దానికిని మన కవిత్వమునకును గల సంబంధమును.

యూరపులోని సాహిత్యములలో పరస్పర సంబంధములేని సాహిత్యమే లేదు. "ఏ సాహిత్యమును పరిశీలింపవలెనన్నను, ఇతర సాహిత్యములను, వాటిలో వాటికి గల సంబంధములను పురస్కరించుకొని చూచినగాని, యూరపునందు కుదరదు" అని 'టక్కర్' (*T. G. Tucker*) పండితుడు పలికెను. "తులనాత్మకమగు సాహిత్య పరిశీలనము వివిధజాతులను సన్నిహితములుగ చేసి, సృజనాత్మక భావవికాసమునకు తోడ్పడును" అని 'పోస్నెట్' (*H. M. Posnett*) పండితుడు వచించెను. ఆంగ్లసాహిత్యమునందును, ఇతర సాహిత్యముల ప్రభావము అనంతముగ కాన్పించును. అంత మాత్రముచేత దాని విశిష్టత కేమాత్రము భంగములేదు. మన సాహిత్యవిషయమునను ఇంతే.

నవ్యాంధ్ర కవిత్వముమీద విశేష ప్రభావము చూపిన, ఆంగ్లసాహిత్యము ఇతర సాహిత్యముల సంబంధములేకుండ పెరుగనేలేదు. ఎన్నో భావబీజములు, రచనారీతులు, కల్పనావిశేషములు పైనుండి ఆ సాహిత్య క్షేత్రమునకువచ్చి నాటుకొని, మొలకలెత్తి ప్రభవించినవి. ఆంగ్లమహాకవులలో అనేకులపై అన్య సాహిత్య ప్రభావము అడుగడుగున కనబడును. చాసరు మహాకవిపై ఫ్రాంసు, ఇటలీదేశముల సాహిత్య ప్రభావము, షేక్స్పియరుపై గ్రీసు, ఇటలీ మొదలుగాగల అనేకదేశములలోని సాహిత్య ప్రభావము, మిల్టనుపై గ్రీకు, లాటిను, ఇటాలియను భాషలలోని ఉద్గ్రంథముల ప్రభావము, అతి స్వతంత్రుడని పేరుపొందిన షెల్లీపై హోమరు, యూరిపిడిస్, ప్లేటో, వర్జిల్, డాంటే, గెథే మొదలగు వారి ప్రభావము—ఆంగ్ల సాహిత్యమును సవిమర్శముగ చదివినవారికి కనబడును. ఈ ప్రభావము జ్యోతి వంటిది. తాను వెలుగును. తన వెలుగును ఇతరముల కిచ్చును. ఆయా దేశములపై, ఆంగ్ల కవుల ప్రభావము ఉండుటయే ఈ సత్యమును చూపుచున్నది. షేక్స్పియరు, బేకను, లాకే, బైరను మొదలగువారి ప్రభావము యూరపు అంతయు విస్తరించుటయే దీనికి తార్కాణము. ఇంతే కాదు. ప్రాచ్య భాషా పఠనము పాశ్చాత్యదేశములలో అధికమయిన తరువాత, మన సంస్కృత సాహిత్య వేదాంతముల ప్రభావము ఆయా దేశములలోని విజ్ఞానులపై పడినది. ఇంగ్లండులో షెల్లీ, కీట్సు మొదలగు కవులమీద, జర్మనీలో గెథే వంటి కవులమీద, షోపెన్ హోవర్ వంటి తాత్త్వికులమీద ప్రాచ్య సాహిత్య వేదాంతముల ప్రభావము కలదని విజ్ఞులందరు అంగీకరించి

నాడు. సంస్కృతకవిత్వప్రభావము సోకిన ఒక ఆంగ్ల కవినుంచి ఒక ఉదాహరణను చూపి ముందుకు వెడలెదను. ఏబర్‌క్రాంబీ (*Lascelles Abercrombie*) అను విమర్శకుడు కీట్సు కవిమీద కాళిదాసు ప్రభావము పడి ఉండవచ్చునని, కీట్సు కవియొక్క 'ఎన్డిమియన్' (*Endymion*) కావ్యమునుంచి కొన్ని పద్య పాదములు ఉదాహరించెను. ఏబర్‌క్రాంబీ ఈ విధముగా వ్రాసెను. "*There is a fine example in the beautiful Indian drama Sakuntala: the Chariot of the God Indra driving through heaven passes over a cloud, and at once the wetted rims of the wheels begin to spin moisture off in sparkling showers. Ofcourse! That is just what would happen. Keats has the very same thing in Endymion - but he may have looked into Sir William Jone's version of Kalidasa.*

*A silver car, air-borne, whose silent wheels, fresh wet from clouds of morn, spun off a drizzling dew.*"

(*Abercrombie's 'The Theory of Poetry'*)

ఈ భావానికి మూలమైన శ్లోకము అభిజ్ఞాన శాకుంతలమున ఏడవ అంకములో వచ్చును.

"అయ మర వివరేభ్యశ్చాతకై ర్నిష్పతద్భిః
హరిభి రచిరభాసాం తేజసా చానులిప్తైః
గత ముపరి ఘనానాం వారి గర్భోదరాణాం
పిశునయతి రథ స్తే శీకర క్లిన్న నేమిః"

ఒక అత్యుత్తమాంగ్ల విమర్శకుడు, ఇంకొక ప్రఖ్యాతాంగ్ల కవినిగూర్చి వ్రాసిన వ్రాతలకు ప్రాముఖ్య మధికమని ఈ ఉదాహరణ ఇచ్చినాను. ఇలాంటివి ఇంక ఎన్నో చూపవచ్చును. ప్రపంచములోని సాహిత్యములు పరస్పర పోషకము లనియు, ఆ విధమైన సంబంధము అపకర్ష హేతువు కాదనియు నిరూపించుట కింత దీర్ఘముగ వ్రాయవలసివచ్చెను.

సాహిత్యముల పరస్పర పోషకము అను విషయము స్థాపింపబడిన తరువాత, ఆంగ్లసాహిత్యమును ఆంధ్ర రసికులకు అందుబాటులోనికి తెచ్చిన ఇంగ్లీషు చదువులను గూర్చి కొంచెము ముచ్చటింపవలెను. మెకాలే దొరయొక్క 'మినిట్ ఆఫ్ డిసెంట్'తో (2.2-1835) ఇంగ్లీషు చదువులు మన దేశములో స్థిరపడినట్లే. లార్డ్ బెంటిక్ యొక్క తీర్మానము (7-3-1835) సందేహ నివృత్తి చేసినది. ("*His Lordship in Council is of opinion that the great object of the British Government ought to be the promotion of European literature and science among the natives of India, and that all the funds appropriated for the purposes of education would be best employed on English education alone*") ఆనాటి పాలకుల మనస్సులలో ముఖ్యముగా వంగదేశము, దాని పరిస్థితులు మెలగుచుండెడివి. ఆ ప్రాంతమున చేయదలంచిన మార్పులన్నీ మిగిలిన ప్రాంతములకు క్రమముగ వచ్చినవి. తన 'మినిట్'లో మెకాలే మనకు బాధ కలిగించినవి ఎన్నో అని అని, చివరకు "ఆంగ్ల విద్యాభ్యాసము వలన భారతీయుల దృష్టి విశాలమగును" అని వ్రాసినాడు. తన మాట ఒప్పుకొనక పోయిన తన హోదాకు రాజీనామా కూడ ఇచ్చెదనని బెదిరించినాడు. ఈ విధముగ ఇంగ్లీషు చదువులు, నిర్బంధముగ వచ్చినవే. ఈ చదువులు వ్యాప్తములగుటకు మిషనరీలు కొంత—ఈ దృష్టియందు వారి స్వార్థమెంతియో కలదు—సాయము చేసిరి. ఇంగ్లండు మొదలగు దేశములకు అప్పుడే పోయివచ్చిన మన దేశస్థులు కొందరు, ఇంగ్లీషు చదువులకోసము అల్లాడిరి. వీరిలో రాజా రామమోహనరాయలు ముఖ్యుడు.

1823 లో ఈయన అప్పటి గవర్నరు జనరలునకు ఒక విజ్ఞప్తి చేసెను. అందిట్లున్నది. "దేశము పుట్టుటకు పూర్వమున్న సాహిత్య శాస్త్రముల స్థితిని, అతని తరువాతి వాటి స్థితిని పోల్చి చూడవలసినదని మిమ్ములను వినయపూర్వకముగ ప్రార్థించుచున్నాను. ఇంగ్లీషు ప్రజలను, మీరు అజ్ఞానములోనే ఉంచవలెనని ఎంచి ఉన్నచో, బేకను తత్త్వదృష్టిని మీ పాఠశాలలలో ప్రవేశపెట్టించెడివారు కారు.........ఈ విధముగనే, మా దేశమును అజ్ఞాన తిమిరమున ఉంచవలె ననునది, బ్రిటిషు శాసనసభయొక్క భావమైనచో, సంప్రదాయసిద్ధమైన సంస్కృతవిద్యాంగములకు అన్ని విధముల తగినది." ఈ వాక్యములను చదువునపుడు మనము రామమోహనరాయలకు స్వదేశాభిమానము లేదనుకోరాదు. ఆంగ్ల విద్యవలన, శాస్త్రాది జ్ఞానమువలన, మన దేశమునకు వచ్చు అనేక లాభములే, అతని నట్లు వ్రాయించినది. కేశవ చంద్రసేను, "రాజకీయముగను, వైజ్ఞానికముగను, ఇంగ్లండు మా ప్రభువు. మేము ఆంగ్లమానస పుత్రులము. మేము పాశ్చాత్యభావ ప్రవాహమున మునిగి తేలు

చున్నాము" అని వ్రాసెను. ఈ విధముగా పాలకులు, పాలితులుకూడ ఆంగ్లవిద్యకై ఆలమటించిరి. తరువాత 1854 లో ప్రభుత్వము పంపిన, విద్యావిషయకమైన 'డిస్పాచ్' ని, భారతదేశములో ఆంగ్ల విద్యకు 'మేగ్నాకార్టా' అని వ్యవహరింప జొచ్చిరి. ముఖ్యముగ మూడు విశ్వవిద్యాలయములు — మద్రాసు, కలకత్తా, బొంబాయి — స్థాపింపబడెను. ఇవి ఆంగ్ల భాషా సాహిత్యములను, పాశ్చాత్య సంస్కృతిని ప్రజలలో వ్యాప్తిచేయుట మొదలిడినవి. మెట్రిక్యులేషను; బి. ఏ; ఎమ్. ఏ; లలో కృతార్థులైనవారి సంఖ్య అధికముకాజొచ్చెను. ఈ ఆంగ్లవిద్య నేర్చిన వారికి ఉద్యోగములు వచ్చుటజూచి, ప్రజలీ విద్యకై ఎగబడిరి. బ్రౌనుదొర మొదలగు భాషాభిమానులు పాఠశాలలను నిర్మించియు, దేశభాషలలోని గ్రంథములను సంస్కరించి ప్రచురించియు, నిద్రాణమైన జాతిని మేలుకొలిపిరి. కొత్తనీటికి చేప లెగబడినట్లు, ఈ కొత్త పద్ధతికి జనులు ఉత్సాహము చూపిరి. వర్ణాశ్రమ ధర్మములకు, ఈ విద్యకు సంబంధము లేదు గనుక అందరు దీనిని ప్రోత్సహించిరి. ఆంధ్రదేశములో కూడ క్రమక్రమముగ ఎన్నో పాఠశాలలు, కళాశాలలు ఏర్పడి ఈ విద్యాభివృద్ధికి దోహదము చేసినవి.

ఆంధ్రులకు పెద్ద పట్టణము ఏదియు లేకపోవుట అనునది, ఆదినుండియు పురోభివృద్ధికి భంగకరముగానే ఉన్నది. పాశ్చాత్య సంపర్కము అటు వంగదేశానికి — ముఖ్యముగా కలకత్తాకు — ఇటు మద్రాసునకు బాగా కలిగినది. ఈ నడుమ ఉన్న మనదేశము యావత్తు 'కప్పదాటు' క్రింద పడిపోయింది. మన రాష్ట్రములోని విద్యావ్యాప్తి వెనుకబడుటకు ఇదియే ముఖ్యకారణము. మనదేశములో స్థావరముల నేర్పరచుకొన్న పాశ్చాత్యులుకూడ మెల్లిమెల్లిగ అటో, ఇటో, తప్పుకొని, మద్రాసునుగాని, కలకత్తానుగాని తమ ముఖ్యకేంద్రముగ చేసికొనిరి.

ఈ విధముగ పాశ్చాత్య సంపర్కముయొక్క ఫలితములు మనకు కొంత ఆలస్యముగ కలిగినను, ఆ గాలి మనకును సోకినది. ఈ గాలి, మనదేశములో — రాజకీయ, నైతిక, సాంఘిక, సాహిత్య, సాంస్కృతిక పద్ధతులలో — ఎన్నో మార్పులను తెచ్చినది. సాహిత్యరంగములో వచ్చిన మార్పులను సూచించుటకు ముందు, 'ముద్రణము' మన సాహిత్య విషయమున తెచ్చిన మార్పులను కొంచెము గమనించవలెను.

ఇదివర కెప్పుడు లేనంతగా, సాహిత్యమును సహృదయులయొద్దకు తెచ్చి, దానిని ప్రజలలో వ్యాప్తిచేసినది, కొంతవరకు దానికి స్థిరరూపము నిచ్చినది 'ముద్రణము.' పాశ్చాత్య సంపర్కమువలన మనకు కలిగిన మేళ్ళలో ఇది ప్రముఖము. ఇది వచ్చుటతోనే 'గురుముఖతః' విద్య నేర్చుట చాలవరకు తగ్గినది. ఈ సంప్రదాయమునకు ప్రాముఖ్యము సన్నగిల్లినది. బ్రౌనుదొర మొదలగు వారెందరో ముద్రణాభివృద్ధికి పాటుబడిరి. "ముద్రణముయొక్క ఉపయోగమునకు మేల్కొనునట్లు తెలుగువారిని నేను చేసితిని" అని బ్రౌనుదొర వ్రాసెను.

మనసాహిత్యముమీద ఆంగ్లసాహిత్యప్రభావము ఏయేరీతులలో పడినదో స్థాలీపులాకముగ పరిశీలించిన తరువాత, సాహిత్యములో ఏకదేశము పద్యకావ్యాదులపై ఆ ప్రభావమును గుర్తింపవలెను. ఒక సాహిత్యముమీద ఇంకొక సాహిత్యముయొక్క ప్రభావము ముఖ్యముగ మూడువిధములుగ రావచ్చును. ఈ మూడు విధములను రెండుభాగములుగ విభజింపవచ్చును. మొదటి విభాగము — ప్రత్యక్ష సంబంధము గలది. రెండవవిభాగము — పరోక్షసంబంధము గలది. మరల దీనిని రెండువిధముల విభజింపవచ్చును. ఒక సాహిత్యముయొక్క ప్రభావము, ఇతరసాహిత్యములద్వారా, ఇంకొక సాహిత్యమునకు సోకుట. ఉదాహరణగ, వంగ సాహిత్యద్వారమునగాని, కన్నడ సాహిత్య ద్వారమునగాని ఆంగ్లసాహిత్యప్రభావము మన సాహిత్యముపై పడుట. ఇది మొదటి విధము. ఒక సాహిత్య పఠనమువలనగాని, దాని సంపర్కమువలనగాని నూతనభావములు ప్రజలి, హృదయమునకు, మనస్సునకు ఉన్న సంప్రదాయ శృంఖలములు తెగుటద్వారమున ప్రభావము పడుట రెండవ విధము. ఈవిధముంగా, మనలపై తన ప్రభావము చూపిన సాహిత్యముతో ఎట్టి సంబంధమును లేకయే, కాలగతినిబట్టి నూతన మార్గానుసరణము జరుగును. ఈ మూడువిధములుగను, నవ్యాంధ్రసాహిత్యం వికాసముపొందినట్లు కాన్పించును. ఒక్కొక్కప్పుడు ఈ మూడువిధములును ఒకే రచయితలో, వివిధకాలములలో గాని, ఒకేరచనలో వివిధప్రదేశములలో గాని కన్పట్టును. ఈ మూడుప్రభావములలో ఏదియును సోకని నవ్యాంధ్రరచయిత లేడనుట సత్యదూరముగాని, సాహసముగాని కానేరదు.

ఈ ప్రభావము మనసాహిత్యము మీదనే కాక, తక్కిన భారతీయ సాహిత్యము లన్నింటిమీదను ఆంగ్లసాహిత్యము చూపినది. మొట్టమొదట ఈ ప్రభావచ్ఛాయ సోకిన దేశీయసాహిత్యము వంగసాహిత్యము. ఈ ప్రభావమునుగూర్చి ఒక వంగవిమర్శకుడు ఇటుల

వ్రాసెను. "ఆంగ్లసాహిత్యసంపర్కము వంగ సాహిత్యమునకు, నూతనేతివృత్తములను, వైవిధ్యమును, నవ్యతను, ప్రసాదించెను. ఇందువలన వంగసాహిత్యము బహుధా విస్తరించి, నాగరక ప్రపంచమున కనువగు మనస్తత్వమును వంగప్రజలకు వచ్చునట్లు చేసెను. మానవత్వదృష్టి అధికమయ్యెను. నేటి వంగ రచయిత మధ్యకాలపు అజ్ఞాన తిమిరమున తిరుగ నక్కరలేదు. అతడు ప్రపంచపౌరుడు......కవిత్వము నూతన జన్మమును పొందెను. క్రొత్తక్రొత్త రచనారీతులకు ఆంగకవిత్వము మార్గము చూపెను......" ఈవాక్యములన్నియు మన తెలుగు సాహిత్యవిషయమునను సత్యములనుట అతిశయోక్తి కాదు. ఈసందర్భమున, ఆంగ్లసాహిత్యపఠనాదులు మనలను కేవలము బానిసలుగ చేయక, మనలోని స్వాతంత్ర్యభావములు విజృంభించుటకును, తోడ్పడెననుమాట మరువదగినది కాదు.

ఈ విషయముల నన్నింటిని ఆకళింపునకు తెచ్చుకొని, ఆంధ్ర సాహిత్యముమీద, ఆంధ్ర సంస్కృతిమీద, ఆంధ్ర ప్రజలమీద ఆంగ్ల సాహిత్యమునకుగల ప్రభావమును పరిశీలింపవలెనుగాని, తదితర విషయములతో సంబంధము లేనటుల, సాహిత్య పరిశీలనమునకు పూనుకొనరాదు. కనుక నేపై విషయము లన్నియును వ్రాయవలసివచ్చెను.

1854 వ సంవత్సరము భారతదేశ విద్యా చరిత్రలో ప్రముఖమైనది. ఈ సంవత్సరములో ప్రభుత్వమువారు పంపిన 'డిస్పాచ్' మనదేశములో ఆంగ్ల విద్యకు 'మేగ్నాకార్టా' అని పేరు పొందినది. ఇది వరలో మనవిచేసి యున్నాను. ఈ సంవత్సరము పందొమ్మిదవ శతాబ్దిని స్థూలముగ రెండుగ విభజించును. ఇరువదవ శతాబ్దిలో సగము గడచినది. ఈ విధముగ పరిశీలించిన, ఈ నూట ఏబది సంవత్సరములు, ఇంచుమించుగ మూడు సమభాగములుగ విభక్తమగును. ఈ మూడు ఏబదులు, ఆంగ్లసాహిత్య సంపర్కము, మువ్విధములుగ మన సాహిత్యముపై ఉన్న కాలము. మొదటి ఏబది సంవత్సరములలో—అనగా పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థములో—పాశ్చాత్యులు, మన దేశభాషలను బాగుగ అభ్యసించి మన గ్రంథములను ఉద్ధరించుచున్నటుల కాన్పించును. ఈ కాలమందే బ్రౌను, మెకంజీ, కాంబెల్ మొదలగువారు మనదేశమునకు ఎంతయో సేవచేసిరి. ముఖ్యముగ బ్రౌను దొరగారు, భారతదేశమును వదలి స్వదేశమునకు పోవువరకు, (1855) పోయి, తాను చనిపోవువరకు, తెలుగు భాషకై అమోఘమగు సేవ చేసిరి. మహాపండితులను పోషించిరి. ఎందరికో ఆంగ్లము నేర్పిరి. ఆయన వ్రాసిన వాచకాది పుస్తకములు, తెలుగు నేర్చుకొను పాశ్చాత్యులకు ఉపయోగకరము లైనట్లే, ఆంగ్లమును నేర్చుకొనగోరు స్వదేశీయులకును ఉపయోగించినవి. ఈకాలమందే ఏనుగుల వీరాస్వామయ్య (1780–1836) కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లె (1852 మృతి) వెంబాకం రాఘవాచార్యులు (1842 మృతి) గాజుల లక్ష్మీనరసుసెట్టి మొదలగు మహానుభావులు, ఆంగ్ల విద్యాభివృద్ధికై పాటుబడిరి. రావిపాటి గురుమూర్తిశాస్త్రి (1770–1836) జూలూరి అప్పయ్య, పట్టాభిరామశాస్త్రి మొదలగు పండిత ప్రకాండులు ఆంగ్లవిద్యావంతులతో సమముగ గౌరవమును పొందిన కాలమిది. కావలి వెంకటబొఱ్ఱయ్య, లక్ష్మయ్య మొదలగువారు అప్పటికప్పుడే పరిశోధనలు ఎన్నో చేసి, మెకంజీకి తోడ్పడినవారు. వీరందరిని మించి భాషాసేవచేసిన మహానుభావుడు పరవస్తు చిన్నయసూరి. ఈతని కృషి అంతయు పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థములోనే. ఈతని కెందరో పాశ్చాత్యులు స్నేహితులు, పోషకులు. తెలుగు వ్యాకరణమునకు, వచన రచనకు వీరు చేసిన సేవ అందరకును తెలిసినదే. ఈ విధముగా, ఎంతో అభివృద్ధిని చూపిన పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధము, ఆ శతాబ్ది ఉత్తరార్ధమునకును ఇరువదవ శతాబ్ది పూర్వార్ధమునకును, భాషా సాహిత్యాభివృద్ధుల విషయమున గట్టి పునాదులు వేసినది. పందొమ్మిదవ శతాబ్దికంటె పూర్వము మిషనరీల, మతవిషయకమైన కృషి కన్పించును. ఆ కాలమందు సాహిత్యముపై ఆంగ్ల సాహిత్య ప్రభావము లేదనియే చెప్పినను దోషము కాదు. మంగళగిరి ఆనంద కవియొక్క వేదాంత రసాయనము, పింగళి ఎల్లనార్యుని తోభ్యచరిత్ర అను—ప్రబంధశైలిలో వ్రాయబడిన—రెండు క్రైస్తవ గ్రంథములు మాత్రమే, ఆ కాలమందు ముఖ్యమైనవి ఈ గ్రంథములైనను క్రైస్తవమత ప్రభావమును చూపినంతగా, ఆంగ్ల సాహిత్య ప్రభావమును చూపినవి కావు

1854 వ సంవత్సరమునాటికి కందుకూరి వీరేశలింగం పంతులుగారికి ఆరు ఏళ్లు. 'రాజశేఖర చరిత్ర' అచ్చు వేయునప్పటికి ముప్పది సంవత్సరములు. ఈకాలంలో పంతులుగారు ఎన్నో మార్పులను పొందినారు. సంప్రదాయసిద్ధపద్ధతి వారి జీవితములోను, సాహిత్య జీవితములోను కూడ అంతరించినట్లే. పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధమంతయు పంతులుగారి కృషితోను, వారితో తుల్యులగు పెద్దల కృషి

తోడు ఫలించినవి. వీరిలో నూటికి తొంబది మందికి ఆంగ్ల సాహిత్యముతో ప్రత్యక్ష సంబంధ మున్నది. మిగిలిన పదిమంది పైనను పరోక్షముగనైనను ఆ ప్రభావము పడినది. వీరి నందరను నవ్య సాహిత్యోద్యమమునకు పూర్వరంగ ప్రవర్తకు లనవచ్చును. ఈ కాలములో కృషి చేసిన మహానుభావు లందరు, ఆంధ్ర సాహిత్య వికాసమునకు ఎంతో దోహదము చేసిన వారే ఆంగ్ల సాహిత్యార్ణవములో, తమ సాహిత్య సముద్రములో కనరానిరత్న రాసులను చూచి దిగ్భ్రమ చెందినవారే. ఈ అభిప్రాయమును, శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు చక్కగా ఇట్లు తమ త్రివేణి పత్రికలో వ్యక్తము చేసిరి. "వారు (తెలుగు రచయితలు) తమ ఎదుటనున్న సాహిత్య రత్నరాసులను చూచి కనులు మిరుమిట్లు గొలుప దిగ్భ్రమ చెందిరి. తమ సాహిత్యమును ఆంగ సాహిత్యముతో పోల్చి చూచిరి. ఆ పోలిక తమ సాహిత్యమునకే నష్టమని గుర్తించిరి. తెలుగులో చెప్పుకోదగిన వచన రచన లేకుండుట, వస్తువులో వైవిధ్యము లేకుండుట వారి మనస్సులపై తీవ్రముగ నాటుకొనినది."

(జనవరి 1928)

ఈ సత్యము విప్లవాత్మక భావాభివృద్ధికి దారి తీసినది. ఆంధ్ర రసికుల హృదయములలో నూతనాభిప్రాయ బీజములు పడెను. ఒకవంక క్రైస్తవ మత విజృంభణము. ఇంకొకవంక పాశ్చాత్యభావ ప్రాబల్యము. ఒకవైపు ఆంగ్లసాహిత్య పఠనము. ఇంకొక వైపు పాశ్చాత్యశాస్త్ర విజ్ఞాన పరిచయము. వీటితో పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధము ఉజ్జూత లూగినది. ఆంధ్రదేశ చరిత్రలో నేమి, ఆంధ్రసాహిత్యచరిత్రలో నేమి అది మరచుటకు వీలులేని ఏబది సంవత్సరముల కాలము. వివిధ భావములు, వివిధ సంస్కారములు, ఆంధ్ర రసికుల హృదయసాగరమున మథింపబడిన దినములు.

శ్రీపంతులుగారు ఒక చైతన్యములో సాహిత్య సృష్టి చేయగడంగినవారు. ఆంగ్లసాహిత్యములోనున్న వివిధ సాహిత్యశాఖలనన్నింటిని తెలుగులోనికి తేవలెనను స్థిరనిశ్చయముతో పనికి పూనుకొనిరి. సంఘావశ్యకములను గుర్తించి, తన రచనాపద్ధతిని కూడా మార్చుకొనిరి. ఈయన నిజమైన ఆంగ్లమానసపుత్రుడు. కాని భావదాస్యము చేసినవాడు కాడు. ఆయనలో ఉన్న సమన్వయదృష్టి ఆయనను విశిష్టుని చేసినది.

1878 లో శ్రీ పంతులుగారు 'రాజశేఖర చరిత్ర' ప్రచురించినపుడు 'హిందు' పత్రిక ఇట్లు వ్రాసెను. "రాజశేఖర చరిత్ర తెలుగు సాహిత్య చరిత్రలో నూతనాధ్యాయమును ప్రారంభించినది. ఇది మొదటి తెలుగు నవల. నూతన ప్రయత్నములో ఈయన జయమునొందెను......నూతన సాహిత్యాభివృద్ధికి పునాదులు వేసెను." ఈ నవలకుముందే తెలుగులో ఒక నవల అచ్చుఅయినది. దాని పేరు శ్రీ రంగ రాజు చరిత్ర. వ్రాసినవారు గోపాలకృష్ణసెట్టిగారు. 1872 లో అచ్చయినది. ఆ సంవత్సరము 'గజెట్'లో, "తెలుగు వచనములో నవల వ్రాయుటకు ఇదియే మొదటి ప్రయత్నము," అని ఉన్నది. ఈ నవల కాలమునుబట్టి ముందుది అయినను, శ్రీ పంతులుగారి నవల ప్రఖ్యాతికి వచ్చినది. అటులనే వ్యాసరచనయు శ్రీ పంతులుగారికి ముందే జరిగినను, వారికే 'గద్య తిక్కన' బిరుదము వచ్చినది. శ్రీ సామినేని ముద్దు నరసింహనాయుడుగారు, "హితసూచిని" అను వ్యాససంపుటిని వ్రాసిరి. ఆయన కుమారుడు దానిని 1862 లో ప్రచురించెను. వ్రాసినవారు ఆంగ్లభాషా నిష్ణాతులు. వ్యాసములు ఆంగ్లవ్యాసముల ఫక్కినే వ్రాయబడినవి. వాటిని వ్యాసములని పిలువలేదు, అంతే. శ్రీ పంతులుగారు అన్ని సాహిత్యశాఖలను తమ కృతులచే అలంకరించుటచే వారికి విశేషఘనత కలిగినది. తమ కృషినిగూర్చి వారే, "......అయినను తెలుగులో మొదటి వచన ప్రబంధమును నేనే చేసితిని. మొదటి నాటకమును నేనే తెనిగించితిని. మొదటి ప్రకృతిశాస్త్రమును నేనే వ్రాసితిని. మొదటి చరిత్రమును నేనే విరచించితిని. స్త్రీలకయి మొదటి వచన పుస్తకమును నేనే కావించితిని" ఈ వాక్యములన్నియు ఆయన బహుముఖకృషిని తెలుపును. ఆంగ్లములోని నాటకముల ననువాదము చేయుటయే కాక, ప్రహసనముల నెన్నింటినో ఆంగ్లము ననుసరించి వ్రాసెను. ఆయనయే ఒకచోట, "......అను పదియు ఇంగ్లీషుభాషలో నున్న ప్రహసనముల ననుసరించి పేరులను కొంత, కథను తెలుగువారి కనుకూలముగ నుండులాగున నేను మార్చి చేసిన ప్రహసనములు," అని వ్రాసిరి. ఈ విధముగా పంతులుగారు స్పృశించి అలంకరింపని సాహిత్యశాఖ లేదనియే చెప్పవచ్చును. ఆంగ్లసాహిత్యములోని విషయవైవిధ్యాన్ని ఆంధ్రసాహిత్యములోనికి తెచ్చుటకు పంతులుగారు పరిశ్రమించి కృతకృత్యులయినారు.

ఈ కాలమందే ధర్మవరం కృష్ణమాచార్యులుగారు, కోలాచలం శ్రీనివాసరావుగారు, కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు, వావిలాల వాసుదేవశాస్త్రిగారు, వేదము వెంకటరాయశాస్త్రిగారు మొదలైన మహానుభావులందరు, ఆంగ్లసాహిత్య

ప్రభావమును పొందినవారే. వీరందరును తెలుగు భాషాసాహిత్యములకు సేవచేసినవారే. వివిధ సాహిత్యరంగములలో వీరిసేవ చిరస్మరణీయము. వీరిలో చాలమంది సాహిత్యజీవితము పందొమ్మిదవ శతాబ్దితో నే అంతమయినదని చెప్పవచ్చును. కొందరు ఇరువదవ శతాబ్దిలో ఒకటి రెండుదశలు జీవించి ఉన్నను, చెప్పుకొనదగినకృషి ఏమియును చేయలేదు.

ఈ పైవారందరును పద్యములు, నాటకములు, వచనములు మొదలగునవిఅన్నియు వ్రాసిరి. శ్రీ పంతులు గారివంటివారు, ఆకాలములో, చాలమంది వ్రాయని, నవల మొదలగు నూతనశాఖలనుకూడ అలంకరించిరి. చిలకమర్తివారు మొదలగువారు వీరి మార్గమును అనుసరించిరి. కావ, వీరి కృషిఅంతయు నవ్యాంధ్ర కవిత్వావతరణమునకు ఎంతో దోహదము చేసినది. ఆంగ్ల విద్యాభ్యాసము, సాహిత్యపఠనము, పాశ్చాత్య సంస్కారాభినివేశము అధికమై యువకులు నూతనత్వమును అన్ని జీవితరంగములలోను అభిలషించేరోజులు పూర్తిగ వచ్చినవి. వీరేశలింగంపంతులుగారివంటి వారి నిర్విరామకృషివలన సాహిత్యరంగములోను, సాంఘిక రంగములోను తరతరాలుగ పాతుకొనిపోయిన ప్రాత పద్ధతులు కూకటివ్రేళ్లతో కూలద్రోయబడినవి. నూతన భావములు, నూతనోత్తేజన ప్రాబల్యము యువకులను విజృంభింపజేసెను. వీటిఫలితమే నవ్యాంధ్ర కవిత్వావరణము.

నవ్యాంధ్రకవిత్వము వీరితో ప్రారంభమయినదనిగాని, వారితో ప్రారంభమయినదనిగాని చెప్పరాదు. ఏకవితోద్యమమైనా ఏఒక్కరితోనో అకస్మికముగా ప్రారంభింపదు. అంతకుపూర్వము బీజప్రాయముగ అనేకులలో ఉన్న భావములు, ఒకరిలో కేంద్రీకృతమై వ్యక్తమగుట జరుగును. వారినే మనము ఆ ఉద్యమ ప్రారంభకులని వ్యపదేశింతుము. కాని, ఆవెనుకవారిని సాహిత్యవిమర్శలో మరువరాదు. ఈదృష్టితోనే పూర్వరంగ ప్రవర్తకులనుగూర్చి వ్రాసితిని.

శ్రీ వీరేశలింగం పంతులుగారు గద్యరచనకు ఒక విశిష్టతను తెచ్చి, దానికొక పరిణతావస్థ, బుద్ధిగమ్యత కల్పించినారు. వీరు గద్యమునకు చేసినసేవ శ్రీ తిరుపతి వేంకటకవులు పద్యమునకు చేసిరి. వీరు పూర్వరంగ ప్రవర్తకులకు తమ్ములుగా పుట్టి, "అద్యతనాంధ్రకవి ప్రపంచ నిర్మాతలై", నవ్యాంధ్ర కవులలో చాలమందికి—ముఖ్యముగ వేంకటశాస్త్రిగారు (1870 - 1950) గురువులైరి. శ్రీ వేంకటశాస్త్రిగారు దేశకాల పరిస్థితులను చక్కగ గుర్తించిన మహాకవులు గనుక, కాలక్రమమున నవ్యయుగమునకు ఆదరపాత్రమైన వ్యావహారిక భాషలో కూడ రచన లనేకములు చేసి వారి హృదయనైశాల్యమును చూపిరి. వీరు వ్రాసిన నాటకములలో కొన్నింటియందలి సన్నివేశములు, వర్ణనలు ఆంగ్లసాహిత్య సంపర్కమువలన కలిగినట్లే తోచును. ఇది కాలగతినిబట్టి వచ్చిన 'గాలి మార్పు' యొక్క ప్రభావమే!

ఆధునికాంధ్ర కవిత్వమందు పేరెన్నికగన్న కవులలో చాలమంది వీరి ప్రత్యక్ష శిష్యులో, ఏకలవ్య శిష్యులో, లేక వీరియందు గురుభావము కలవారో అయి ఉన్నారు. ఈ అభిప్రాయముల నన్నింటిని చక్కగ క్రోడీకరించి, వీరి శిష్యులయిన శ్రీ పింగళి లక్ష్మీకాంత కవిగారు, వీరి వాక్కు "ప్రాచీన సరణికి భరతవాక్యము, నవీన సరణికి నాందీవాక్యము" అని పలికినారు. చ్యుతసంస్కారము కాని భాషలో, ప్రాచీన సంప్రదాయములను కొంతవరకు పాటించుచు ఇతివృత్తమునందును, రచనారీతులయందును కొంత నవ్యత చూపుచు వ్రాసిన వారిలో చాలమందిపై వీరి ప్రభావమున్నదనవచ్చును. ఈ సంప్రదాయమునకు చెందినవారిపై, ఆంగ్ల సాహిత్య ప్రభావము పడినప్పుడు ఒక విలక్షణ మార్గమును వారు త్రొక్కిరి. ఈ మార్గమును, నవ్యసాహిత్యములోని 'మార్గసంప్రదాయ'మని మనము పిలువవచ్చును. ఈ సంప్రదాయ కళికయే రానురాను భావకవిత్వ పుష్పముగ వికసించి, నవ్యాంధ్ర కవిత్వమున వలపులను వెదజల్లినది.

ఇదికాక మన కింకొక సంప్రదాయముకూడ నవ్యాంధ్ర కవిత్వమున గలదు. అది 'దేశి' సంప్రదాయము. నవ్యసాహిత్యములో దేశిసాహిత్య ప్రవర్తకులు శ్రీ గురజాడ అప్పారావు పంతులుగారు (1861–1915). వీరికి 'వాగనుశాసనులు' గిడుగు రామమూర్తిపంతులుగారు (1863–1940). ఆంగ్ల సాహిత్య పఠనమువలన, పాశ్చాత్య సభ్యతా సంపర్కమువలన పూర్తిగా వైశిష్ట్యమును పొందిన కవి అప్పారావుగారు. వీరును, వీరి స్నేహితులైన గిడుగువారును కూడిన, మన సాహిత్యమునకు—ముఖ్యముగ వ్యావహారికభాషకు—లక్ష్యలక్షణ సమన్వయము.

ఈ మార్గ, దేశి సంప్రదాయము లనేవి మనకు మొదటినుండి ఉన్నవే. వాటిని తీసికొనివచ్చి నవ్యాంధ్ర సాహిత్యమునకు అన్వయించినా నంతే! నన్నయ మార్గకవి అయితే శైవకవులు దేశికవులు.

తిక్కనలో రెండును సంగమించినవి. మొత్తముమీద మన కవులలో మార్గకవు లెక్కువ. మరల వేమన దేశి కవి. ఈ కవులతోనే శ్రీ అప్పారావుగారికి పోలిక. పూర్వము చాలవరకు మార్గకవిత పండితులను, దేశి కవిత పామరులను ఆశ్రయించినవి. రెంటను మహా ప్రతిభావంతులున్నారు. శ్రీ అప్పారావుగారు ప్రజల మార్గము త్రొక్కినారు. వర్డ్స్‌వర్త్ మొదలగు కవులు అతిసామాన్యమైన భాషలో రచనలు సాగించుట ఆయనకు నచ్చినది. షెరిడన్ మొదలగు నాటకకవుల నాటకములుకూడ ఆయన పఠించినారు. ప్రాతను ఆయన గర్హించలేదు. దానిలోని మంచిని గ్రహించవలెను అని ఆయన ఊహ. "కొత్తపాతల మేలుకలయిక" ఆయన ఆదర్శము.

ఈ అభిప్రాయములు ప్రబలుటతోనే, ఆంగ్లములో కావ్యములు వ్రాయుట తగ్గించి, ఆ సాహిత్య ప్రభావముచేత పుట్టిన నూతన తేజసముతో, తన సంఘచైతన్యదృష్టిని మేళగించి, ప్రజలభాషలో రచన చేయవలెనని సంకల్పించినాడు. ఫలితము 1896-1897 నాటికే కన్యాశుల్కము. వీరేశలింగంగారి సంఘసంస్కరణోద్యమము విరివిగా సాగుచున్న రోజులవి. ఆ దృష్టి వీరికికూడ ఉన్నది. వ్యావహారిక భాషాభినివేశము బాగుగ ఉన్నది. ఈ రెంటిని జోడించి వ్రాయుటకు నాటకపక్కి బాగుగ తోచినది వారికి. కన్యాశుల్కం బయలుదేరిననాటికి బెర్నార్డ్ షాకు, నాటకకర్తగా విశేషమైన పేరు లేదు. 'షా' తన మొదటి నాటకమును 1885 లో ప్రారంభించి, రెండు అంకములు వ్రాసి మానివేసి, ఇబ్సన్ (1828 - 1906) నాటకములు ఇంగ్లండులో పేరు సంపాదించిన తరువాత, 1892 లో ఆ రెండంకములకు ఇంకొక అంకం కలిపి, "విడోయర్స్ హౌసస్" (*Widower's Houses*) అను నాటకమును పూర్తిచేసినాడు. 1889 లో ఇబ్సెన్ నాటకములు ఇంగ్లండును చేరినవట. ("......*Not only dramatic literature but life itself was staggering from the impact of Ibsen's plays, which reached us in 1889* ")

—*G. B. Shaw.*

ఈ నాటకములను శ్రీ అప్పారావుగారు చదివినట్లు నిరూపించుటకు ఆధారములు లేవుగాని, అంతకు పూర్వము ఆంగ్లసంఘము నిర్ఘాత లాగించిన మహానుభావుల రచనలను ఆయన చదివియుండవచ్చును. కన్యాశుల్కమును గూర్చి ప్రసంగించునపుడు, దానికి ఇంచుమించుగ సమకాలీనమైన 'ప్రతాప రుద్రీయము' ను (1897) ధర్మవరము వారి 'చిత్ర నళీయము' ను స్మరింపవలెను. ఈ రెండు నాటకముల ఇతివృత్తము ప్రఖ్యాతమయినను, వీటిపై, వీటి రచయితలపై పాశ్చాత్య సాహిత్య ప్రభావము ఎంతయో కలదు. సంస్కృత నాటకములను అనువదించుటలో 1891 నాటికే శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారు పాత్రోచిత భాషయను పేర, వ్యావహారికాంధ్రము నుపయోగించుచువచ్చి అనేకులకు మార్గదర్శకు లయినారు. వీరియందు శ్రీ అప్పారావుగారికి ఎంతయో గౌరవము. కాని వీరివ్వరును, శ్రీ అప్పారావుగారి వలె 'దేశి' సంప్రదాయమును వృద్ధి పొందింపవలెనను చైతన్యముతో కృషి చేయకపోవుటవలన నవ్యులకు ఈ మార్గమున కన్యాశుల్కాది రచనలు గుర్గదర్శకము లైనవి.

భాషకు సంబంధించిన మార్పులను ఏ నూతన సాహిత్యోద్యమమైనను ప్రవేశపెట్టితీరును. ఈ సందర్భమున 'మార్టిన్ గిల్క్స్' (*Martin Gilkes*) అను విమర్శకుని ఈ క్రింది వాక్యములు పరిశీలనార్హములు. "ఏ నూతన సాహిత్యోద్యమమైనను, ప్రాత పద్ధతులపై బయలుదేరిన తిరుగుబాటులోనే పుట్టును. కవిత్వము విషయములలో ఈ తిరుగుబాటు, సామాన్య మానవుల భాషను ఉపయోగించుటగా మారును." అని అతడు వ్రాసినాడు. ఇది సత్యము. వర్డ్స్‌వర్త్ మొదలగు కవులు 'లిరికల్ బేలడ్స్' (*Lyrical Ballads*) లో వాడినభాష దీనికి తార్కాణము. తెలుగులో వ్యావహారిక భాషవైపు ఈ కవులు మొగ్గుటకు ఇదియే కారణము. నవ్యకవిత్వములోని 'మార్గకవులు' కూడ ప్రాత కట్టుబాటులను చాలవరకు సడలించుటకు ఇదియే కారణము.

శ్రీ అప్పారావుగారు ఈ విధముగ, ఆంగ్ల సాహిత్య ప్రభావ విలసిత రమ్యకవితల నెన్నింటినో సృజించి ధన్యతను బొందిరి. వీరు ముత్యాల సరములను 1910 లోను, నీలగిరి పాటలను 1907 లోను ప్రచురించిరి. ఇంకను అనేక గ్రంథములను ప్రచురించిరి. వారి 'దినచర్య' గ్రంథములును ప్రముఖమైనవే. ఈ విధమైన కృషియేకాక పరిశోధనలను ఎన్నింటినో చేసిరి. భాషాసంబంధమైన వీరి పరిశోధనలు, చరిత్రపరిశోధనలు అందరి మన్ననలను పొందినవి. ఈయన మృతితో (1915) నవ్యకవిత్వములో 'దేశిరచన'కు తాత్కాలికమైన అవరోధము కలిగినది. ఇంతలో నవ్యకవిత్వము

లోని 'మార్గశాఖ' విజృంభించి, ఆంధ్రరసికుల హృదయములను ఆకర్షింప మొదలిడినది.

శ్రీ తిరుపతి వేంకటకవులు పద్యమును పునః ప్రతిష్ఠించి ఆంధ్ర సహృదయలోకమును రంజింపజేయుచున్న తొలినాళ్లవి. ఆ దినములు ఇరువదవ శతాబ్దికి ప్రారంభము. అప్పుడొక 'కావ్యము' అచ్చయినది. దానిని వ్రాసిన కవి పాశ్చాత్య సభ్యతా ప్రపంచమును అప్పుడప్పుడే అర్థము చేసికొనుటకు మొదలిడినవాడు. ఆంగ్లసాహిత్యమును, దానియందలి అనువాదముల మూలమున, ఇతర పాశ్చాత్య సాహిత్యములను పఠించి ముగ్ధుడయినవాడా కవి. ఆ కవి పేరు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి. కావ్యము పేరు 'ముసలమ్మ మరణము.' 1899 లో వ్రాసి 1900 లో అచ్చువేసినారు. భావ సలక్షణము. పాండిత్య స్ఫోరకము. కాని, కావ్యమును వ్రాసిన కవికి, పాశ్చాత్య సాహిత్యప్రభావమున్నదని చదివినవారికందరకును తెలియును. ఈ కావ్యమును ఆధునికాంధ్ర కవితోదయమునకు ముందు వచ్చిన వేగుచుక్క అనవచ్చును. రచనాపద్ధతిలోను, భావవ్యక్తీకరణమందును, కావ్యమును ముగించిన విధమందును, క్రొత్తదనమెంతో కలదు. అంతేకాదు. హోమరు (*Homer*) కవినుండి గ్రహించిన వర్ణనలును కొన్ని దీనియందు కలవు. ఈ విషయమును కవిగారే అంగీకరించినారు. శ్రీ రెడ్డిగారు, కవిత్వ తత్త్వవిచారమను గ్రంథమునుకూడ వ్రాసి, నూతన పద్ధతిలో విమర్శించుట వ్యాప్తము చేసిరి.

1900 మొదలు నేటివరకును నవ్యాంధ్ర కవిత్వము దినదినాభివృద్ధి పొందుచు నేయుండెను. నవ్యాంధ్ర సాహిత్యమున ఎన్నో నూతనశాఖలు అభివృద్ధిపొందినవి. నవ్యాంధ్ర కవిత్వమున ఎన్నో నూతనమార్గములు కవులు త్రొక్కిరి. ఈ కవులలో ప్రసిద్ధులైన వారందరును, ఆంగ్లసాహిత్యమును పఠించినవారే. వారిలో చాలమందికి, ఇతర పాశ్చాత్య సాహిత్యములతో కూడ—ఆంగ్లానువాదములవలన—సంపర్కమున్నది. ఈ వ్యాసములో, నవ్యాంధ్ర సాహిత్య శాఖల నన్నింటినిగూర్చి వ్రాయుటగాని, నవ్యాంధ్ర కవిత్వమునంతటిని సాకల్యముగ విమర్శించుటగాని చేయను. నవ్యాంధ్ర కవిత్వములో, ఆంగ్ల సాహిత్య ప్రభావమువలన వచ్చిన ముఖ్యములగు మార్పులనుగురించియు, ఆ మార్పులు స్ఫుటముగ గోచరింపజేసిన కవులనుగూర్చియు మాత్రము పేర్కొని ఈ వ్యాసమును ముగించెదను.

మన సాహిత్యములోని మార్గసంప్రదాయకళిక, క్రమక్రమముగ ఈ శతాబ్ది తొలియుషస్సులలో భావకవిత్వ పుష్పముగ వికసించి సువాసనలు వెదజల్లినదని మనవి చేసినాను. శ్రీ తిరుపతి వేంకటకవుల శిష్యులు, శిష్యతుల్యులు అయినవారే, ఈ సంప్రదాయమును భావకవిత్వమార్గమునకు పట్టించినవారు. ఆంగ్లసాహిత్యములో వారిని ఈ మార్గమునకు త్రిప్పినది 'రొమాంటిక్' కవిత్వము. పందొమ్మిదవ శతాబ్ది ఆంగ్లసాహిత్యమున, 'రొమాంటిక్' ఉద్యమమునకు స్వర్ణయుగము. ఇంకను నిశితముగ, నిష్కర్షగ చెప్పవలెనన్న పందొమ్మిదవ శతాబ్దిలోని పూర్వార్థము. అందులో మొదటి ముప్పది సంవత్సరములు. 1830 నాటికి, కీట్సు (1821) షెల్లీ (1822) బైరన్ (1824) లు చనిపోయిరి. వర్డ్స్‌వర్త్, కోలరిడ్జ్ కవులు జీవించి ఉన్నను వారి కవితాధార ఆ కాలమునాటికి ఎండిపోయినది. పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థములోని ఈ ఉద్యమము, ఇరువదవ శతాబ్ది పూర్వార్థమున మనకు తన ప్రభావమును జూపినది. ఈ ఆలస్యమునకు కారణము నాడింకను ఆంగ్లభాష మన దేశమున సుస్థిరముగ నెలకొనకుండుటయే. 1854 నాటికి గాని మనకింకను ఇంగ్లీషు చదువులు బాగుగ వ్యాప్తికి రాలేదు. వచ్చినతరువాతి మొదటి ఏబది సంవత్సరములు మనవారు, పదునెనిమిది, పందొమ్మిది శతాబ్దులకు ముందున్న ఆంగ్లసాహిత్యమునే పఠించుచు వచ్చుటయు, ఆంగ్ల దేశమునకూడ ఆ ఉద్యమమునకు, ఆ కవులకు గౌరవము క్రమక్రమముగ అధికమగుటయు కారణములు. 1900 నాటికి ఇంగ్లీషు చదువులు బాగుగ స్థిరపడుటయు, ఆంగ్లకవుల రచనలను పాఠశాలలలోను, కళాశాలలలోను విశేషముగ చదువుటయు, ఈ ఉద్యమమునకు బలమునిచ్చిన కారణములు.

క్రమక్రమముగ ఈరకమైన కవిత్వమునకు భావకవిత్వమను పేరు రూఢమైనది. ఈ పదము ఉపయోగింపబడిన తొలినాళ్ళలో, ఎన్నో వాదోపవాదములు చెలరేగినవి. ఆ విధముగ వ్రాసిన కవులకే ఈ పదము అర్థముకాలేదు. వారు ఉపయోగింపలేదు కూడ. ఇంగ్లీషు 'రొమాంటిక్' కవులవిషయమును ఇంతే. 'ఇవాన్స్' అను ఆంగ్ల విమర్శకుని ఈ మాటలే ఇందులకు తార్కాణము. "రొమాన్టిక్ రివైవల్ అను లేబులు వీరికి తగిలించినారు. అది ఏమిటో వారికే అర్థము కాకపోయి ఉండవచ్చును." ఈ పేరు, తక్కిన రచయితలకంటె వీరి ప్రత్యేకతను తెలుపుటకు ఉపయోగింపబడినదన్న చాలును. ఇంగ్లండులోనే గాక, ఫ్రాంసు, జర్మనీలలోకూడ ఈ ఉద్య

మము సాగినది. వాటికి ఉన్న భేదములనుగూర్చి కొంచెము చెప్పవలసి ఉన్నది.

ఫ్రాంసులో రొమాంటిక్ ఉద్యమము, జర్మనీలో వలెనే చక్కగ నిర్మాణ కార్యక్రమమును అనుసరించి నడచినది. కొన్ని నియమములు, ఆ సంఘ సభ్యులు వాటిని పాటించుట, వారికి ఒక నాయకుడు—ఇవి 'విశిష్టధర్మములు'. ఇంగ్లండులో అట్లు కాదు. ఈ రొమాన్టిక్ కవులకు—ఫ్రాంసులో విక్టర్ హ్యూగోవలె (Victor Hugo)—నాయకుడు లేడు. అందరును స్వతంత్రులు. అనుకరణఉన్నదిగాని నాయకత్వములేదు. ఒక్క విషయములో ఫ్రెంచి ఉద్యమము, జర్మనీ, ఇంగ్లండుల ఉద్యమములకన్న, ప్రత్యేకతకలది. ఇది ఫ్రాంసులో, అతి తీవ్రముగను, ఆకస్మికముగను వచ్చినది. ఇది పరిణామముగ వచ్చినది కాదు. ఒకవిప్లవముగ, ఒక 'ఉప్పెన'వలె వచ్చి పడినది. ఇందులకు కారణము, ఫ్రాంసులో పదునెనిమిదవశతాబ్దిలో సంప్రదాయవాదులైన ఛాందసులకు బలము అధికముగ నుండుటయే. ఇక్కడ ఫ్రెంచివారి మనస్తత్త్వములోని విశేషమును గుర్తింపవలెను. రాజకీయరంగములోను, సాంఘిక రంగములోను విప్లవవాదులైన ఫ్రెంచివారు, సాహిత్యాభిరుచియందుమాత్రము కొంచెము ఛాందసులు. ఈఉద్యమము 'పారిస్' నగరములోనే కేంద్రీకరింపబడియుండుట ఇంకొక విశేషము. ఈవిధముగ ఇంగ్లండులోగాని, జర్మనీలోగాని అందరు రొమాంటిక్ రచయితలు కూడియుండుటలేదు. ఒక్కవిషయములో మాత్రమే ఈ ఉద్యమమునందు ఫ్రాంసునకును, ఇంగ్లండునకును—జర్మనీకంటె—ఎక్కువ పోలిక కలదు. ఉద్యమము ఒక్క కళారంగమునందే పరిమితమై ఉండుట ఆ ఒక్క విషయము. జర్మనీలో అట్లుగాక, ఇది రాజకీయ, మతరంగములలోకూడ ప్రవేశించినది. జర్మను 'రొమాంటిసిజము' తాత్త్విక దృక్పథము కలది. ఫ్రెంచి 'రొమాంటిసిజము' సాంఘికమైన, కళాసంబంధమైన దృష్టి కలది. జర్మను 'రొమాంటిసిజము'నకు ఉద్యమలక్షణములు అధికము. చైతన్యము గల ఒక నిర్మాణమది. విమర్శనాత్మకమది. అందువలననే విమర్శనము పేరు పొందినంతగా, ఆదేశములో కవిత్వము ఈఉద్యమమున పేరు పొందలేదు. జర్మను 'రొమాంటిక్' రచయితలనుగూర్చి ఒక విమర్శకుడిట్లు వ్రాసెను. "వారు సన్నిహిత మిత్రులు. కలిసి పనిచేసిరి. కలిసి ప్రయాణము చేసిరి. ఒకరి పుస్తకములు ఒకరు 'సంపాదించు' చుండిరి. ఒకరి సోదరి నొకరు వివాహము చేసికొనిరి." ఇంత సన్నిహితత్వము ఇంగ్లండులో లేదు. రాజకీయములందును, మతమునందును దీనిని ప్రవేశపెట్టలేదు. ఇంగ్లీషు రొమాంటిక్కు రచయితకు మధ్యయుగమునందు, కళాదృష్టిలో ఆసక్తి ఉండవచ్చును. కాని రాజకీయ, మతరంగిములందు అమధ్యయుగపరిస్థితులనాతడు కాంక్షించలేదు. అంతేకాక ఇంగ్లండులో ఈ ఉద్యమమున జర్మనీలోకంటె, తాత్త్వికమైన మర్మకవిత్వ రచన తక్కువ.

ఫ్రాంసులో ఈ ఉద్యమము స్వేచ్ఛను తెచ్చినది. ఈ స్వేచ్ఛ అన్నిరంగములందును కావలెనను వాంఛ ప్రబలినది. విక్టర్ హ్యూగో (Victor Hugo) "రొమాంటిసిజమ్ అంటే సాహిత్యములో స్వేచ్ఛ... సాహిత్యములోని ఈ స్వేచ్ఛ రాజకీయ స్వాతంత్ర్యమునకు దారి తీయును. మనము సాంఘికమైన ప్రాతి పద్ధతులలోనుండి పైకి వచ్చినపుడు, సాహిత్యములోని ప్రాతపద్ధతులనుండి ఏల పైకి రారాదు? క్రొత్తజాతి, క్రొత్తకళ" అని వ్రాసెను. ఈ స్వాతంత్ర్యము, ఒక్క సాహిత్యములోనే కాక, చిత్రకళయందును కానబడినది. కవులు చిత్రలేఖకులు కలిసి, ఒకరి నొకరు అర్థము చేసికొనుటకు ప్రయత్నించెడివారు. చివరకు, వేషధారణయందును ఈ స్వేచ్ఛ, క్రొత్త పద్ధతులకు దారిచూపినది. చిత్రకారులకును, కవులకును గల సన్నిహితత్వమునుగూర్చి వ్రాయుచు ఒక ఫ్రెంచి రచయిత ఇట్లు వ్రాసెను. "డాంటే, గథే, బైరన్, స్కాట్ మొదలగు కవుల కావ్యములు 'స్టూడియో'లలోను 'స్టడీ'లలోను సమానముగనే అధరమును పొందెను. ఈ పుస్తకములపై సిరా మరకలు ఎన్ని ఉండెడివో, రంగుల డాగులు కూడ అన్నియు ఉండెడివి." రొమాంటిక్ చిత్రకారుడు 'డెలెక్రో' కవులతో సమానమైన గౌరవమును పొందెడివాడు.

(సశేషము)

ఉషని గుండెలకద్దుకొని బాగా కన్నీరు కార్చింది రాధ.

—డాక్టరొచ్చి ఇంజెక్షన్ చేసేడు. "ఫరవాలేదు. తెలివి వచ్చేస్తుం దోగంటలో!" అని చెప్పి వెళిపోయేడు.

శ్రీనివాసానికి తెలివి రావడం, అతని తల్లిదండ్రులు లోనికి ప్రవేశించడం ఒక్కమారే జరిగింది!—

"అమ్మో!—నీవాళ్లం ఇంతమందిమీ ఉంటూ ఉండగా ఆఖరి కిలా దిక్కూ మొక్కూ లేకుండా జబ్బుతో బాధపడుతున్నావా బాబూ!" అని ఏడుస్తూ కొడుకుముఖంలోకి చూస్తూ, చేతులతో నిమురుతూ మంచందగ్గర కూలబడిం దాతల్లి.

మంచంమీద జబ్బుతో పడుకొన్న కొడుకువేపూ, రాధవేపూ, ఉషవేపూ చూస్తూ ఆందోళనతో నిలబడ్డా డతని తండ్రి.

"డాక్టరూ!..." అని శ్రీనివాసంతండ్రి అంటూఉండగానే...

—"ఇప్పుడే ఇంజెక్షనిచ్చి వెళ్ళేరు!" అనంది రాధ.

"నువ్వెరవమ్మా?!" అనడిగింది శ్రీనివాసంతల్లి.

ఇంకా రాధ సమాధానంఇవ్వకముందే—"అదో దేవ...త!" అనన్నాడు శ్రీనివాసం.

"అంటే?" అనడిగే డతనితండ్రి.

"మురికికూపంలోకి నే పడిపోతూఉంటే, తీసి రక్షించిం దీమె!—నే వివాహం చేసుకోబోయేది ఈమె...నే!..." అనన్నాడు శ్రీనివాసం ఆయాసంతో.

వాళ్లు చాలా ఆశ్చర్యపోయేరు!—"ఎన్నాళ్లకి మాట అన్నావురా నాయినా! ఈ జబ్బు తగ్గిపోయిన వెంటనే వివాహం!" అం దాతని తల్లి.

అతని తండ్రి మాత్రం ఏమీ అనలేదు!—అతనికి అనుమానం లోలోన ఉంది!—ఆమె ఏ కులమో ఏమిటో అని!...కానీ అప్పట్లో అడగడం ఉచితపని కాదని ఊరుకున్నాడు.

అంతట్లో రాధ తల్లి అక్కడికి తడువుకుంటూ వచ్చింది. "ఏదో దానదృష్టం బాగుంది. మళ్ళీ పెళ్లవుతున్నాది దానికి!—లోకంలో కొందరికయినా విశాల మనస్తత్వం ఉంటుంది!" అందా ముసిలిది.

"ఏమిటిరా బాబూ...మళ్ళీ పెళ్ళం టున్నదావిడ!" అనడిగిం దతని తల్లి. శ్రీనివాసంవేపు ప్రశ్నార్థకంగా చూసే డతని తండ్రి!—

ఆమధ్యనుంచి "బావా!" అని అరుస్తూ శ్రీనివాసం మంచంమీద కెక్కింది ఉష. "మాట్లాడవేం బావా?" అంది ఏడుస్తూ ఉష.

అంతా ఉషవేపూ శ్రీనివాసంవేపూ చూసేరు!

అక్కడి వాతావరణం అంతా అదోలా తయారయింది!—



# నక్షత్ర పరిణామము



శ్రీ వసంతరావు వేంకటరావు

"అణువులో బ్రహ్మాండ మమరించి బ్రహ్మాండ
మణువని చూపు మాయావినోద!
దిశలక్షలుగనున్న తారకా గోళమున్
చెడకుండ గారడీ చేయువాడ!
అవ్యక్తమగు శక్తి నవ్యక్తముగ గూర్చి
గురు పదార్థముల కన్పరచువాడ!
పరమాణు గర్భస్థ బహుసూక్ష్మ కణములన్
మించుగా ద్రిప్పి క్రీడించువాడ!
ద్రవ్యమున శక్తి, శక్తిలో ద్రవ్యఘనిమ,
ఆకసము కాలమున కాలమాకసమున!
ద్వైతి మద్వైతమందు, అద్వైతమందు
ద్వైతమును చూపు మాయలవాడ వౌర!"

అని మహత్తర విశ్వసత్యాల నొకపరి మనస్సులో భావించినప్పుడు శరీరం జలదరించని మానవుడుండడు. భూమితో సరిపోల్చి చూసినప్పుడే మానవుని పరిమాణం, అన్నివిధాలా అత్యంతాల్పంగా స్ఫురిస్తుంది. ఏమంటే, భూగోళం నిడివి సుమారు 8000 మైళ్ళు, మానవుని పొడవు 2 గజాలు; భూమి వయస్సు కొన్ని కోట్ల యేండ్లు, మానవుని వయస్సు సరాసరి 70 ఏండ్లు. ఎంత వ్యత్యాసం! ఇక భూమిని విడిచి నక్షత్రలోకాలలో విహరించినప్పుడు ఈ వ్యత్యాసం అంతు లేకుండా పెరిగిపోతుంది.

ఏ రాత్రి సమయమందైనా 'నక్షత్రంబులు కన్పడున్ వెలుగు తున్కల్ వోలె వ్యోమంబునన్.' నక్షత్రాల సంఖ్య అపరిమితమని, నక్షత్రాల వయస్సు అనంతమని చాలకాలంవరకు అనుకొనేవారు. కాని, మూకుడు బోర్లించినట్లున్న ఆకాశంలో మానవ నేత్రానికి గోచరించు నక్షత్రాలు 3000 కంటె ఎక్కువ లేవని విజ్ఞానులు నిర్ణయించగలిగారు. దూరదర్శినితో చూస్తే ఆ సంఖ్య పెరుగుతుంది; కాని, కథలలో చెప్పినట్లు అసహాయ నేత్రానికి గోచరించే నక్షత్రాలు మాత్రం గణనాతీతంగా లేవు. వయః పరిమాణాలలో కూడ నక్షత్రానికి నక్షత్రానికి చాల వ్యత్యాసముందని నమ్మడానికి ఇటీవలి పరిశోధనలు సహాయపడుతున్నాయని విజ్ఞానులు భావిస్తున్నారు. కొన్ని నక్షత్రాలు చిరకాలీనములే; వేలకొలది యేండ్ల అనుశీలనలు కూడ వాటిలో మార్పును చూపెట్టలేవు. కాని, సాపేక్షంగా, కొన్ని క్షణభంగురములైన నక్షత్రాలు కూడ లేకపోలేదు. అట్టివి, గెలాక్సీ వయస్సులో శతసహస్ర లక్షాంశ కాలంపాటు దేదీప్యమానంగా నభోవీధిని ప్రజ్వలించి, మనం గుర్తించలేని ద్రవ్యరూపంలోనికి మారిపోతాయి.

గత శతాబ్దాలలో లిఖితమైన అవలోకనలను బట్టి నక్షత్రకూటాలు ఎట్టిమార్పు చెందకుండా వాటి స్థానాలలో యథాతథంగా నున్నాయని భావించేవారు. కాని, అసహాయనేత్రానికి కనిపిస్తున్నంత స్థిరంగా లేవని ఈమధ్యనే తెలియవస్తూంది. కొన్ని నక్షత్రాల ఔజ్జ్వల్యం మారుతుంది; కొన్ని ప్రమాదకరమైన విస్ఫోటానికి లోనై నోవా (*Nova*) గా పరిణామ మొందుతాయి.

అపరిమితమైన శక్తిని నక్షత్రా లేవిధంగా ఉత్పత్తిచేస్తున్నాయో తెలిసికోడానికై ప్రయత్నాలు చేసిన సందర్భంలో వాటి వయఃపరిమాణాలవిషయమై కొంతజ్ఞానం లభించింది. సూర్యునివంటి నక్షత్రాలలో ఉదజని కేంద్రకాలు హీలియం కేంద్రకాలుగా రూపాంతరం పొందుతున్నాయి. ఆ ప్రక్రియలో విశేషశక్తి జనిస్తూంది. ఆ ప్రక్రియకు కర్బన కేంద్రకాలును, నత్రజని కేంద్రకాలును దోహదమిచ్చి ప్రక్రియానంతరం అవట్టిమార్పు చెందకుండా, నాలుగు ఉదజని కేంద్రకాలను ఒక హీలియంకేంద్రకంగా మేళవింపజేసి విడిచిపెట్టుతాయి. ఆ సంవిధానం చిత్రం 1 లో చూపబడింది.

కర్బనకేంద్రకమైన $C^{12}$ తో ఒక ఉదజని కేంద్రకమైన ప్రోటాను $H^1$ కేంద్రకసంయోగ




చిత్రం 1. కర్బన నత్రజని చక్రీయప్రక్రియ, ప్రోటానులు హీలియంగా మారు విధానాన్ని వివరిస్తుంది.

మొందుతుంది. అప్పుడు గామా కిరణరూపంలో కొంత శక్తి బహిర్గమించి, నత్రజని కేంద్రకంయొక్క ఐసాటోపు* $N^{13}$ ఏర్పడుతుంది. అది స్థిరమైన కేంద్రకం గాదు. అదొక పాసిట్రాను (ధనావేశం గల ఎలక్ట్రాను) ను విసర్జించి కర్బనంయొక్క ఐసాటోపు $C^{13}$ గా మారుతుంది. $C^{13}$ తో ఒక ప్రోటాను సంయోగించి, గామా కిరణాలుగా కొంత శక్తిని ప్రసరించి, నత్రజని కేంద్రకం $N^{14}$ అవుతుంది. $N^{14}$ తో మరొక ప్రోటాను సంయోగించి, గామా కిరణాలను ప్రసరించి, ఆమ్లజనియొక్క ఐసాటోపు $O^{15}$ ఏర్పడుతుంది. అస్థిరమైన $O^{15}$ కేంద్రకం ఒక పాసిట్రానును విసర్జించి $N^{15}$ గా మారుతుంది. ఈ నత్రజని కేంద్రకంతో నాల్గవ ప్రోటాను సంయోగిస్తుంది. అప్పుడా కేంద్రకం ఒక ఆల్ఫాకణం (హీలియం కేంద్రకం) గాను కర్బన కేంద్రకంగాను భిన్నమౌతుంది. మొదటి కర్బన కేంద్రకంతో వరుసదశలలో సంయోగించిన నాలుగు ప్రోటానులలో రెండు పాసిట్రానులు పోగా, మిగిలిన రెండు ప్రోటానులు రెండు న్యూట్రానులు సంయోగించి హీలియం కేంద్రకమైనట్లు భావించాలి.

* ఒకే రసాయనిక గుణాలు కలిగి పరమాణు భారంలో వ్యత్యాసం గల పరమాణువులను ఐసోటోపు లంటారు.

నక్షత్రాలన్నిటిలో సుమారిట్టి ప్రక్రియయే జరుగుతుంది. కాని, ప్రక్రియయొక్క వేగం నక్షత్రం నుండి నక్షత్రానికి మారుతుంది. దీనివిషయం తెలిసికోడానికై మనకు మిక్కిలి సన్నిహితమును, అతి పరిచితమును నైన సూర్యగోళంతో ప్రారంభించుట లాభదాయకము.

భూతలాన్ని చేరుకొను సౌరశక్తిని సులభంగా కొలవగలము. ఒక ఘనపు సెంటిమీటరు ఆయతనం గల నీటిని సూర్యకిరణాలకు నిలువుగా క్రిందనుంచి, దాని తాపక్రమం 1 డిగ్రీ సెంటిగ్రేడు పెరగడానికి పట్టే కాలాన్ని కనుగొంటారు. భూతలాన్ని చేరుకోడానికై భూవాతావరణంలోనుండి ప్రయాణం చేసినప్పుడే మాత్రం సౌరశక్తిని వాతావరణం గ్రసించిందో గమనించి, ఆ దోషాన్ని సవరిస్తారు. ఈవిధంగా లెక్కకట్టగా ప్రతి చదరపు సెంటిమీటరు నేలమీద నిమిషానికి రెండు కాలరీల సౌరశక్తి పడుతూన్నట్లు తెలియవచ్చింది. అంటే, ఒక చదరపు సెంటిమీటరుమీద పడే ఎండవేడిమితో ఒక ఘనపు సెంటిమీటరు నీటిని గంటంపావులో మరుగు తాపక్రమంవరకు వేడి చేయవచ్చును.

శక్తిని కొలవడానికి 'ఎర్గు' అనే యూనిటు నుపయోగిస్తారు. ఒక కాలరీ సుమారు 4 కోట్ల ఎర్గులకు సమానం. ఒక రూపాయిని ఒక గజంమీదనుండి నిలువునా క్రిందకు పడేస్తే, అది భూమిని తాకినప్పుడు భూమికిచ్చే శక్తి 10 లక్షల ఎర్గులు.

సెకండుకి రమారమి 10 లక్షల ఎర్గుల చొప్పున సౌరశక్తి ప్రతి చదరపు సెంటిమీటరు భూతలంమీద పడుతూంది. దీనినిబట్టి సూర్యునినుండి బహిర్గమిస్తున్న మొత్తపు శక్తిని లెక్కకట్టగలము. సూర్యుని కేంద్రంగాను, సూర్యునికి మనకిగల దూరాన్ని వ్యాసార్థంగాను ఒక గోళాన్ని చుట్టినట్లూహిస్తే, సూర్యునినుండి వెలువడు శక్తి యావత్తు ఈ గోళతలంపై పడుతుందని గ్రహించాలి. సెకండుకి చదరపు సెంటిమీటరుకి 10 లక్షల ఎర్గుల వంతున, ఈ గోళమంతటిపై సెకండులో పతనమగు శక్తిని గణించగా, దాని పరిమాణము $4 \times 10^{33}$ ఎర్గులని తెలిసికోగలము. సూర్యుని ద్రవ్యరాశి (*mass*) $2 \times 10^{33}$ గ్రాములు. అందుచేత, సూర్యునిలోనున్న ప్రతిగ్రాము ద్రవ్యము సగటున సెకండుకి 2 ఎర్గుల శక్తిని ప్రసరిస్తూంది. ఈవిధమైన ప్రసరణం సంవత్సరాల తరబడే కాదు, శతాబ్దాల తరబడే కాదు యుగాల తరబడి జరుగుతూంది. సౌరమండల వయస్సు 300 కోట్ల యేండ్లని విజ్ఞానులు లెక్కకట్టేరు. ఈ మహాకాలంలో సౌరద్రవ్యంలో ప్రతి గ్రాము $2 \times 10^{17}$ ఎర్గుల శక్తిని ఇంతవరకు ఉత్పత్తిచేసింది. రసాయనిక ప్రక్రియలలో జనించు శక్తికంటె సూర్యునిలో జనించు శక్తి అధమం 50 లక్షల రెట్లు.

సూర్యగోళంనుండి వికిరణమగు మొత్తపు శక్తిని గణించేరు. పరిశోధనాగారాలలో ఒక మూలతత్వం వేరొక మూలతత్వంగా ద్రవ్యాంతరకరణ మొందు సందర్భంలో విడివడు అమితమైన శక్తివిషయం తెలిసిన తరువాత సౌరశక్తి జననానికాధారభూతమైనది కేంద్రక ప్రక్రియ కావచ్చునన్న అనుమానం ఖగోళశాస్త్రజ్ఞులకు కలిగింది. నాలుగు ఉదజని కేంద్రకాలు ఒక హీలియం కేంద్రకంగా సమ్మేళనం చెందినప్పుడు, ఉదజని కేంద్రకాల మొత్తపు ద్రవ్యరాశిలో నూరవ వంతు మాత్రమే శక్తిగా పరివర్తన మొందుతుంది. సూర్యుని ద్రవ్యరాశిలో సగంవరకు ఉదజనే. అంటే, సూర్యునిలోనున్న ఉదజని $10^{33}$ గ్రాములు. ఇదంతా హీలియంగా మారుతుందనుకొని, ఇప్పటివలెనే సూర్యుడు శక్తిని ప్రసరిస్తాడనుకొంటే 10000 కోట్ల యేండ్లవరకు సూర్యగోళ మీవిధంగానే మహోజ్జ్వలంగా దీపించే అవకాశముంది.

సూర్యునిలో జరుగుతున్న కేంద్రక ప్రక్రియ కొంత మందంగానే సాగుతూందని చెప్పాలి. రిగెల్ — మృగవ్యాధ కూటంలోని తార —, సిగ్నస్ కూటంలోని డెనెబ్ నక్షత్రం: ఇట్టి మహోజ్జ్వల తారకలలో సూర్యగోళముకంటె ఎక్కువ వేగంతో శక్తి జనిస్తూంది. సూర్యునిలో ఒక గ్రాము ద్రవ్యరాశినుండి సెకండుకి 2 ఎర్గుల శక్తి మాత్రమే జనిస్తూంటే, ఈ మహోజ్జ్వల తారలలో ప్రతిగ్రాము ద్రవ్యంనుండి సెకండుకి 10,000 ఎర్గులశక్తి జనిస్తూంది. వీటిలో సగం ద్రవ్యరాశి ఉదజని అనుకొని, సూర్యునిలోవలె వీటిలోకూడ కేంద్రక ప్రక్రియ జరుగుతూందనుకొంటే, ఈ మహోజ్జ్వల తారల భావి జీవితాలు 2 కోట్ల యేండ్లకంటె అధికముండక పోవచ్చు.

రెండుకోట్ల యేండ్లవరకైన ఈ తారలు జీవింపక పోవచ్చు. నక్షత్రంలో నున్న ఉదజని యావత్తు హీలియంగా రూపాంతరం పొందుతుందని పై గణితంలో భావించేము. ఈ ప్రక్రియ కొనసాగడానికి అధమం 2 కోట్ల డిగ్రీల తాపక్రమముండాలి. అట్టి తాపక్రమాలు నక్షత్ర కేంద్రభాగమందు మాత్రమే ఉండగలవు. ఉపరితలానికి వస్తూన్న కొద్దీ తాప

క్రమం తగ్గిపోతుంది. సూర్యుని కేంద్రతాపక్రమం సుమారు 2 కోట్ల డిగ్రీలు కాగా, సూర్యోపరితల తాపక్రమం 6000 డిగ్రీలు మాత్రమే. అందుచేత, ఉదజని యావత్తు రూపాంతరం పొందాలంటే పై పొరలలోనున్న ఉదజని కేంద్రభాగాన్ని చేరుకొనేట్లు నక్షత్రంలోని పదార్థం గోళమంతటా కలయబారాలి. తమ అక్షం పై అతివేగంగా భ్రమించు నక్షత్రాలలో పదార్థం కలయబారడానికి అవకాశముంది. కాని, మందంగా భ్రమించు తారలలో పై పొరలందుండు ద్రవ్యం కేంద్రముఖంగా గమించగల అవకాశం తక్కువ. సూర్యునిలో సమృద్ధిగా నున్న లిథియమే దీనికి తార్కాణము. సూర్యుడు మందంగా భ్రమించు గోళం. పై పొరలలోనున్న లిథియం కేంద్రభాగానికి వెళ్లే అవకాశముంటే, ఆ తాపక్రమానికి లిథియమంతా ఘోరతరమైన మూలతత్త్వాలలోనికి ఇదివరకే రూపాంతర మొంది ఉండేది.

నక్షత్రాలు స్థిరంగా లేవు; అవి ఆకాశయానం చేస్తున్నాయి. అయినప్పటికి విశ్వప్రమాణాలతో చూచినప్పుడు కొన్ని లక్షలయేండ్లలో కూడ నక్షత్రాలు గమించినట్లు చెప్పలేము. కాబట్టి, మన పరిసరాలలోనున్న పాలవెల్లి (milky way) యందలి కొన్ని మహోజ్జ్వల తారలు వాటి ప్రస్తుతస్థానాల దాపునే జన్మించే యనుకొనడం తప్పుకాదు. మన కళ్ళముందు కొన్ని క్రొత్తనక్షత్రాలు జనిస్తూండవచ్చును. కాని, నక్షత్ర జననం నిరంతరం సాగవచ్చునన్న భావాన్ని కొందరు ఖగోళజ్ఞు లంగీకరించరు. ప్రాథమికమైన ధూళివాయుపదార్థాలనుండి మన గెలాక్సీలోని నక్షత్రాలన్నీ సుమా రొకేసారి జన్మించే యనిన్నీ, ఇప్పుడు మహోజ్జ్వలంగా నున్న తారల ఔజ్జ్వల్యానికి ముఖ్యకారణం వాటి ఆకాశయానంలో నక్షత్రాంతరాళమందు మేఘరూపంలోనున్న ద్రవ్యాన్ని ప్రోగుచేసికొనడమేననిన్నీ జర్మన్ విజ్ఞాని వైజ్ సేకర్ భావిస్తున్నాడు. దీనికి 'కాయకల్ప' (Rejuvenation) ప్రక్రియ అంటారు.

రిగెల్ డెనెబ్‌లవంటి నక్షత్రాలు బహు ప్రాచీనమైన సూర్యుని తరగతికి మాత్రం చెందవన్నది నిశ్చయము. అత్యుష్ణ యువతారల జనన పరిణామాల రహస్యాలు, కొంతవరకు, నక్షత్ర పుంజాలలో దొరకవచ్చును. పుంజంలోనున్న నక్షత్రాలన్నీ ఒకే వయః పరిమాణం గలవని భావించడాని కాధారాలున్నాయి. పెర్స్యూస్ కూటంలో అట్టి నక్షత్రపుంజ మొకటుంది. ఆ పుంజమందలి ఒక నక్షత్రగణాన్ని పరిశీలించగా లభించిన ఫలితాలు యువనక్షత్ర సిద్ధాంతాన్ని అమోఘంగా బలపరిచేయి.

వదులు వదులుగానున్న నక్షత్ర గణాలను సోవియట్ ఖగోళజ్ఞుడైన అంబర్ జూమియన్ ఈ మధ్యనే పరిశీలించేడు. వాటిని నక్షత్ర 'సంఘాలు' అన్నాడు. ఈ సంఘాలలో సాపేక్షంగా కొద్ది మాత్రమే నక్షత్రాలున్నాయి; అవైనా దూర దూరంగా నున్నాయి. అందుచేత, ఆ నక్షత్రాల మధ్యనున్న గురుత్వాకర్షణబలం వాటినొక సంఘంగా నుంచగలిగినంత ఎక్కువగా నుండదు. మొదటిలో ఆ నక్షత్రాలు గమిస్తుంటే, పరిసర నక్షత్రాల ఆకర్షణ బలం వాటిమీద ప్రవర్తించక పోవుటచేత, దేనిమట్టుకది సమవేగంతో ప్రయాణిస్తుందనుకొనవచ్చును. పెర్స్యూస్ కూటమందలి ఒక నక్షత్ర సంఘాన్ని పరిశీలించిన డచ్ ఖగోళజ్ఞుడు బ్లావు, సెకండుకి $7\frac{1}{2}$ మైళ్ళ వేగంతో ఆ నక్షత్రాలు చెదిరిపోతున్నట్లు కనుగొన్నాడు. ఇప్పుడా సంఘపు యొక్క నిడివి 500 కాంతి సంవత్సరాలు. ఆదిలో ఒకే సంఘంలో దగ్గరగానున్న నక్షత్రాలు ఈ ప్రకారం చెదిరిపోతూండినట్లయితే, ఇప్పటి 500 కాంతి సంవత్సరాల మేర వ్యాపించడానికి 10 లక్షల యేండ్లకంటె ఎక్కువ కాలం పట్టియుండదు. అంటే, ఆ నక్షత్ర సంఘంయొక్క వయస్సు రమారమి 10 లక్షల సంవత్సరాలనుకోవచ్చు

వ్యాకోచన లక్షణం గల ఇట్టి సంఘాలు మరికొన్నిటిని ఇతర నక్షత్ర కూటాలలో బ్లావు కనుగొన్నాడు. నక్షత్ర వేగాలనుబట్టి సంఘాల వయస్సు నిర్ణయించగా లసెర్టా కూటమందలి నక్షత్రసంఘం యొక్క వయస్సు 4 లక్షల యేండ్లని, సప్తర్షిమండలంలోనున్న సంఘంయొక్క వయస్సు $4\frac{1}{2}$ కోట్ల యేండ్లని తెలియవచ్చింది.

మౌంట్ విల్సన్ వేధశాలలో అనుశీలనలు గావిస్తున్న విజ్ఞాని వాల్టర్ బాడే యువనక్షత్రాలకు వృద్ధనక్షత్రాలకు గల వ్యత్యాసానికి సంబంధించిన భోగట్టా ఎక్కువగా సేకరించేడు. వాయుధూళి సమ్మిళితపదార్థం బాహువులుగా గల ఆంద్రోమెడా గెలాక్సీలో, ఆ పదార్థానికతి సమీపంలోనే యువనక్షత్రాలుంటాయి. బీజభూతమైన వాయుధూళిపదార్థంతోనే ఆ బాహువు లేర్పడ్డాయి. గెలాక్సీ కేంద్రకంలో వృద్ధతార లపరిమితంగా నున్నాయి; కేంద్రకానికి బాహువులకి మధ్య కొన్ని వృద్ధతార లున్నాయి కేంద్రకప్రాంతంలో వాయువుగాని ధూళిగాని లేదు,

నక్షత్రోద్భవ సందర్భంలో అపెంతా పూర్తిగా విని యోగమై యుండవచ్చు.

లక్షలకొలది నక్షత్రాలు దగ్గరదగ్గరగా చేరి దట్టంగా ఏర్పడిన కూటాలను గోళీయపుంజాలు (*Globular clusters*) లంటారు. వాటిలో విశుద్ధమైన వృద్ధతారలున్నాయి. విరళమైన నక్షత్రాంతర ద్రవ్యం ఈ పుంజాలలో కూడా కనిపించదు. దట్టమైన ఈ గోళము పుంజాలలో నున్న నక్షత్రాలు మిక్కుటమైన గురుత్వాకర్షణ బలానికి లోనైయుండుటచేత, అవి చెదిరిపోజాలవు. లక్షలకొలది సంవత్సరాలావిధంగానే ఉండగలవు. గోళీయ పుంజాలలో వాయు ధూళి పదార్థం లేకపోవుటచేత వాటిలోని నక్షత్రాలు కొత్తకల్పాన్ని పొందలేవు.

నక్షత్ర పరిణామాన్ని అర్థం చేసికోడానికి ఎక్కువగా సహకరించేది నక్షత్రాల వర్ణౌజ్జ్వల్య పటం. నక్షత్రాల ఉపరితల తాపక్రమాన్ని బట్టి వాటిని కొన్ని శాఖలుగా ఖగోళజ్ఞులు విభజించేరు. అవి *O, B, A, F, G, K, M, R, N, S.* ఈ క్రమాన్ని ప్రధాన శ్రేణి అన్నారు. ఒకే ఔజ్జ్వల్యం గల రెండు నక్షత్రాలు వేర్వేరు దూరాలలో నున్నప్పుడు, దూరంగా నున్న నక్షత్రంకంటె దగ్గరగా నున్నది ఎక్కువ ఉజ్జ్వలంగా కనిపించుట సహజమే. సాపేక్షంగా వాటి ఔజ్జ్వల్యాలను చెప్పవలసి వచ్చినప్పుడు, ప్రతి నక్షత్రము మనకు 32½ కాంతి సంవత్సరాల దూరంలోనున్నప్పు డెంత ఉజ్జ్వలంగా కనిపిస్తుందో అదే దాని సహజౌజ్జ్వల్యం (*intrinsic brightness*) అని నిర్వచించేరు. ఒక నక్షత్రంయొక్క దూరం, దాని అభివ్యక్తమైన ఔజ్జ్వల్యం తెలిసినప్పుడు, పై నిర్వచన ప్రకారం, దాని సహజౌజ్జ్వల్యం సులభంగా నిర్ణయించవచ్చు.

*O* శాఖ నక్షత్రాల ఉపరితల తాపక్రమం మిక్కిలి ఎక్కువ; *S* శాఖ తాపక్రమం అత్యల్పము. *O* నుండి *S* వరకు తాపక్రమం క్రమంగా తగ్గుతుంది. నక్షత్రాలతాపక్రమాన్ని ఔజ్జ్వల్యాన్ని గ్రాపు కాగితంపై గుర్తిస్తే, పటంలో ఎడంప్రక్క మీదిభాగంనుండి కుడిప్రక్క క్రింది భాగానికి అడ్డంగా ఒక సన్నటి పట్టీ ఏర్పడుతుంది. దానిని రస్సెల్ చిత్ర మంటారు. తొలిసారిగా విజ్ఞాని రస్సెల్ దానిని గీసేడు. ఉష్ణతమమైన యువనీల తారలతో ఎడమను ప్రారంభమైన ఆ పట్టీ చల్లటి వృద్ధశోణ తారలతో కుడివైపు అంతమొందుతుంది.

నిత్యపరిణామం చెందుతూన్న నక్షత్రం ఏ అవస్థలో ఏవిధంగా ప్రధానశ్రేణి తారలలో ఒకటిగా మారుతుందో తెలియదు. కాని, ఒక నక్షత్ర కూటం ప్రధానశ్రేణిలో చేరేటట్లు ఏదోవిధంగా పరి




చిత్రం 2. పెర్‌స్యూస్‌లోని తారా పుంజం యొక్క తాపక్రమం-ఉజ్జ్వలతాపటం. అందులో నక్షత్రాలు ప్రధానశ్రేణికి చెందుతాయి.




చిత్రం 3. కృత్తికానక్షత్ర పుంజంయొక్క పటం. ప్రధానశ్రేణియొక్క మీదిభాగం కుడివైపుకు జరిగింది. ఎడమవైపు పైని బృహన్నీలతారలు, కుడివైపుక్రిందని శోణవామనతారలు సూచితములు.

శాము పొందినదని భావిస్తే, దాని తదనంతర చరిత్ర వర్ణోజ్జ్వలతా పటంనుండి తెలిసికోడాని కవకాశం కలుగుతుంది. ఉదాహరణగా మూడు నక్షత్రకూటాల పటాలుపరిశీలిద్దాము. యౌవనంలోనున్న పెర్స్యూస్ కూటమందలి తారాపుంజ పట మొకటి—చిత్రం 2; వడివయస్సులోనున్న కృత్తికా పుంజ పటము—చిత్రం 3; హాయడీస్‌లోని వృద్ధకూట పటం—చిత్రం 4




చిత్రం 4. హాయడీస్ పుంజచిత్రంలో కొన్ని తారలు ప్రధానశ్రేణిమీది భాగంనుండి విడిపోయేయి. ఇట్లు విడిపోయిన కూటంలోని తారలు బృహత్ శోణతారలు.

శోణవామన తారల బాహుళ్యం చూపించే పట్టీలో క్రిందిభాగం ఈ మూడు పటాలలోను సుమారొకేవిధంగా నుంది. కాని, పట్టీయొక్క పైభాగం మూడు పటాలలోను మూడు విధాలుగా నుంది. తారల వయస్సు ఎక్కువౌతున్నకొద్దీ ఈ భాగం కుడిప్రక్కకు వంగుతుంది. దీనినిబట్టి తారా పరిణామంలో యువతారల స్థానం తిన్నగా కుడిప్రక్కకు జరుగుతుందని ఊహించుకోవచ్చు. అనగా, తారయొక్క సహజమైన ఔజ్జ్వల్యం మారదు కాని, దాని తాపక్రమం తగ్గుతుంది.

పాలవెల్లిలో సూర్యునికి సమీపంగా రకరకాల వయస్సులలోనున్న తారలున్నాయి. వాటివర్ణాల ఔజ్జ్వల్య పటంనుండి (చిత్రం 5) స్పష్టమయే విషయమేమంటే పైని చర్చించబడిన మూడు తారా




చిత్రం 5. సూర్యునికి సమీపప్రాంతంలో నున్న నక్షత్రాలపటం. ఇందులో బృహత్ శోణ తారలు అధికంగా నున్నాయి. ఈపటంలో మధ్యగా నుండి సూర్యునిస్థానం.

పుంజాలలో కంటె వీటిలో శోణవామన తారలధికంగా నున్నాయని. దీనినిబట్టి సూర్యునికంటె పై మూడు తారా పుంజాలు వయస్సులో చిన్నవని నిర్ణయమౌతుంది. ఆ తారాపుంజాల వయస్సు ముదిరే కొలఁదిన వాటిలోని తారలు చెదరిపోతాయి. అయినప్పటికి ఆ నక్షత్రాలు పరిణామం చెందుతూ, కొన్ని శోణ బృహత్తారలు కావచ్చు; మరికొన్ని విస్ఫోటనం చెంది, కొంత ద్రవ్యాన్ని కోల్పోయి శ్వేతవామన తారలుగా మారవచ్చు.

మెస్సైర్ 3 అను సంకేతం గల గోళీయ పుంజంయొక్క వర్ణౌజ్జ్వల్యపటాన్ని పరిశీలిస్తే ప్రధానశ్రేణియొక్క పైభాగం కుడిప్రక్కకు జరిగినట్లు కనిపిస్తుంది. ఎందుకలా జరిగిందో బోధపడదు. కాని, ఆ పటానికి సంబంధించిన ప్రధాన లక్షణాలను వివరించడానికనువైన పరిణామ సిద్ధాంతాన్ని మాంటు విల్సన్ వేధశాలకు చెందిన ఖగోళజ్ఞులు ప్రతిపాదించేరు. సుమారు 500 కోట్ల ఏండ్ల క్రిందట ఈగోళీయ పుంజంలోని నక్షత్రాలన్నీ బాల్యావస్థలో ప్రధాన శ్రేణి తారలుగా నుండేవని వారి అభిప్రాయము. ఈ పుంజంయొక్క అప్పటి వర్ణౌజ్జ్వల్యపటం నేటి పెర్స్యూస్ పటాన్ని పోలి ఉండేది. ఈ తారా పుంజంలో విడిగా విరళద్రవ్యం లేకపోవుటచేత

అందలి నక్షత్రాలు కాయకల్పప్రక్రియ పొందే అవకాశం లేకపోయింది. అందుచేత, వాటి ఉదజనిని హీలియంగా మార్చుకొంటూ అవి పరిణామ మొందజొచ్చేయి. అతివేడిగానున్న తారలలో ఈ మార్పు త్వరగా జరిగింది, చల్లటి తారలలో మెల్లగా జరిగింది. కాని, నక్షత్రంలోనున్న పదార్థం బాగా కలయబారి ఉదజని యావత్తు కేంద్రకంవైపు వెళ్ళకపోవడంచేత, ఒకరేటున హీలియం ఉత్పత్తి కాలేకపోయింది. ఉష్ణతారలో కేంద్రకంవద్దనున్న ఉదజని హీలియంగా మారినతరువాత కేంద్రకాన్ని ఆవరించియున్న కొద్ది భాగంలో మాత్రమే ఈ ద్రవ్యాంతరకరణం (*Transmutation*) జరుగుతుండేది. ఆ సమయంలో నక్షత్రం వ్యాకోచించి బాగా పెరగజొచ్చింది. దీటి ఫలితంగా తాపక్రమంలోను ఔజ్జ్వల్యంలోను మార్పులు కలిగేయి.

మన సూర్యుని చుట్టుప్రక్క నున్న బృహత్తారలను *M* 3 పటంలో గుర్తిస్తే, *M* 3 శ్రేణియొక్క మీది కుడిభాగానికి క్రిందిస్థానాల నాక్రమిస్తాయి. మన నక్షత్రాలకు గోళీయ పుంజంలోని నక్షత్రాలకు వాటి రచనావిధానంలోనే భేదమున్నదని ఇది సూచించవచ్చును. ఆరంభంలో వాటి రాసాయనిక సంఘటనే వేరుగా నుండేదేమో!

నక్షత్రాల ఉపరితల లక్షణాలనుబట్టి వాటి గర్భరహస్యాలను పూర్తిగా తెలిసికోగలమని నిశ్చయంగా చెప్పలేము. నక్షత్రాల ఉపరితలాలు బహువిధాలుగానున్నాయి. కర్బన—నత్రజని చక్రానుగుణంగా (చిత్రం 1) ఉదజని హీలియంగా మారు ప్రక్రియలో జనించు *C* - 13 అను కర్బన ఐసొటోపు కొన్నిటిలో సాపేక్షంగా అత్యధిక పరిమాణంలో నుండె. నక్షత్రాలలో పదార్థం బాగా కలయబారుతుండను వాదానికిది నిదర్శనం కావచ్చును.

టెక్నీషియం అను రేడియో ధాత్వికపదార్థం కొన్ని చల్లటి నక్షత్రాలలో ఎక్కువగా నున్నట్లు మౌంటు విల్సన్ వేధశాలలో కనుగొన్నారు. మన భూమిలో సుమారు నిరవశేషంగా టెక్నీషియం విచ్ఛిన్నమైపోయింది. కాని, సుస్థిరమూలకత్వమైన మోలిబ్డినం ఎంత జాస్తిగా నుందో అణుమంతైనా టెక్నీషియం ఆ నక్షత్రాలలో నున్నట్లు తెలియవచ్చింది. అందుచేత, ఆ నక్షత్రాల వయస్సు 100,000 ఏండ్లకు మించి ఉండదు. అంటే, లక్ష సంవత్సరాల క్రితం జన్మించిన నక్షత్రాలు సైతమున్నాయని అంగీకరించవలసివస్తుంది.

నక్షత్రాలన్నీ జగత్తులో ఒకేసారి పుట్టలేదు. నక్షత్ర పరిణామం ఆకాశ గహ్వరాలలో అవిచ్ఛిన్నంగా జరుగుతూంది. శిశుతారలుద్భవిస్తున్నాయి; వృద్ధతారలు వ్యాకోచించి చల్లారుతున్నాయి. ఈ మహావిశ్వంలో అసంఖ్యాక తారాకుటుంబాల జనన పరిణామ చరిత్ర మహాద్భుతము! *

"అలరెడి కందుకంబు లటు
లంబరమున్ గయిసేయు గోళముల్,
విలయమునందు దక్క నిజ
స్థితుల దప్ప, వహాయి మెట్టియున్
గలుగదు నీకు, మానవుల
కన్నుల కిద్ది భరంబు కాన, నీ
కలవుగాక దివ్య మహి
మాన్విత చక్షువు లిడు సత్కవీ!"

(స్వప్నానుభూతి)



* [illegible] వ్రాసిన "ది ఇవల్యూషన్ ఆఫ్ స్టార్స్" దీనికి ముఖ్యాధారం. దీనిలో చిత్రాలను ఆ వ్యాసంలోనివే.



# విషయానుక్రమణిక

## డిశంబరు 1953







దినదినమునకు ఇంక
స్వచ్ఛమైనటువంటియు, ఇంక
మనోహరమైనటువంటియునైన చర్మము

రెక్సోనాలోని కేడిల్‌తో ఈ అద్భుతమైన
మార్పును మీరు తెచ్చుకొంటారు



రెక్సోనా సబ్బును ప్రతి దినము వాడండి. కేడిల్‌తో గూడిన దాని నురుగు మీ చర్మమును దినదినమునకు ఇంక మెత్తగాను, ఇంక స్వచ్ఛముగాను చేయును.



# రెక్సోనా

ఇది ఒక్కటే కేడిల్*తో గూడిన సబ్బు

* చర్మమును పోషించేటటువంటియు, చర్మమును మెత్తగా చేయునటువంటియునైన తైలముల ఒక ప్రత్యేక మిశ్రమమునకు రిజిష్టర్డ్ పేరు.

R.P. 109-50 TL

# భారతి ముప్పదియవ సంపుటము

(1953 జూలై - డిశంబరు)

---

## అకారాది విషయసూచిక

